# ఫారెక్స్®
# తల్లుల మొదటి ఎంపిక!

## తన పాపాయికి ప్రేమతో తినిపించి పెంచే ప్రతి తల్లికీ తెలుసు: పాపాయి పెరుగుదలకై ఘన ఆహారాలను ప్రారంభించేటపుడు మొట్టమొదటి ఎంపిక ఇదే–ఫారెక్స్®.

ఎందుకంటే, మేలుపర్చబడిన ఫారెక్స్‌లో ముద్దుల పాపాయి పెరుగుదలకై అవసరమైన పోషణ పదార్థాలు సరియైన పాళ్లలో కలవు.

- ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు అవసరమైనట్లు సరియైన పరిమాణంలో ప్రొటీన్లు; సున్నిత జీర్ణశక్తికి అనువుగా క్రొవ్వు పదార్థాలు కలవు.
- పుట్టిన నాలుగు నెలలకు, పాపాయికి తల్లి నుండి లభించిన ఐరన్ నిల్వ తగ్గిపోతుంది. పాపాయి రక్త-పుష్టికై ఫారెక్స్‌లో తగినంత ఐరన్ కలదు.
- దృఢమైన ఎముకలు, గట్టి పళ్లకోసం ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు ఉత్తమ 2:1 నిష్పత్తిలో కాల్షియం, ఫాస్ఫరస్ కలవు.
- ఫారెక్స్‌లో పాపాయి బాగా ఇష్టపడి తినే రుచి కలదు.
- దీనిని కలపడం, తినిపించడం సులభం.




పాలు చేర్చే అవసరం లేదు.
కేవలం నీళ్లలో కలిపి ఇవ్వాలి

**ఫారెక్స్®–శ్రేష్ఠమైన ఘన ఆహారం**
**తల్లి ప్రేమకు ప్రతిబింబం**

CLARION/B/GX/15/244/TEL





"నాకు ప్రియమైన సహనటుడా?
సింథాల్ !
దీంతో నేను మూడు షిఫ్టులు
పని చేసినాసరే
తాజాగా, అందంగా వున్న
అనుభూతిని పొందుతాను"









ఇప్పుడు
సరికొత్త ప్యాక్‌లో

గోద్రెజ్
ఉత్పాదన

సింథాల్® పరిమళం రోజంతా తాజాదనానికి.

CHAITRA-B-G-403TEL

# సిగ్గుపడేలా చేసిన సియోల్!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

నాలుగు వందల మంది భారతీయులు సియోల్ వెళ్ళి అయిదు బంగారు పతకాలతో తిరిగి వచ్చారు. ఒక్క ఉషే అందులో నాలుగింటిని సంపాదించింది. మనం ఇంకెవరినీ పంపకుండా ఆమెని మాత్రమే పంపించి ఉంటే కోట్ల రూపాయలు ఆదా అయి ఉండేవి. భారతీయ అధికారులు అలాంటి వాటిలో నిపుణులు కాబట్టి అలా ఎందుకు జరిగిందన్న దానిపై పెద్ద పెద్ద నివేదికలని సమర్పిస్తారు. ప్రపంచానికి తెలిసింది, మనకి తెలియని దానిని గురించి ఆ పెద్ద నివేదికలో వివరిస్తారనటంలో సందేహం లేదు. అది మనం అయిదేళ్ళ కొకసారి రూపొందించే పంచవర్ష ప్రణాళికలాగా, ఇంకా చెప్పాలంటే మరిన్ని పట్టికలు, అంకెలతో నిండి ఉంటుంది. సియోల్ క్రీడోత్సవాలలో మనం పాల్గొనటం వల్ల ఎంత ఒరిగిందో ఆ నివేదికల వల్ల కూడా అంతే ఉపయోగం ఉంటుంది. దాదాపుగా 80 కోట్ల జనాభాగల ఒక దేశం కనీసం ఒక డజను బంగారు పతకాలని కూడా సాధించలేక పోయింది. ఉత్తర ప్రదేశ్‌లో మూడో వంతు జనాభాగల దక్షిణ కొరియా దాదాపు చైనాతో సమానంగా దగ్గర దగ్గర వంద పతకాలని గెలుచుకున్నది.

దక్షిణ కొరియా వంటి చిన్న దేశం మనం చేయలేని వాటిని ఎలా చెయ్య గలుగుతున్నదన్నది ప్రస్తుతం ఎవరో ఒకరు ఆలోచించవలసిన విషయం. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసే నాటికి భారతదేశం, కొరియాలు రెండూ సమానంగానే ఉన్నాయి. కొరియా జపాన్‌వారి వలస అయితే మనది బ్రిటిష్ వారిది. అదొక్కటే మనకి, వాళ్ళకి తేడా, తలసరి ఆదాయాల విషయంలో కూడా సమానంగానే ఉన్నాయి. ఇంకా చెప్పాలంటే కొరియానే కాస్త వెనుకబడి ఉందనవచ్చు. పారిశ్రామికంగా కూడా మనకన్నా తక్కువగానే ఉండేది. అప్పుడు మనకి మోటారు కార్ల ఫ్యాక్టరీ, నౌకా నిర్మాణ కేంద్రం, అనేక చక్కెర ఫ్యాక్టరీలు, లాభసాటిగా ఉన్నటువంటి ఎన్నో నూలు మిల్లులు ఉండేవి. కొరియాకి అవేవీ లేవు. బ్రిటిష్ వారికన్నా జపాన్‌వారు మరింత కఠినంగా ఉంటారు. కొరియన్‌లని వాళ్ళు పీల్చి పిప్పి చేసారు. కొరియన్‌లు ఈనాటికి కూడా జపాన్ వారిని ద్వేషిస్తారు. వాళ్ళని గురించి చెప్పాల్సి వచ్చినప్పుడు వారి మాటలలో చాలా ఆవేశం కనిపిస్తుంది.

పరిస్థితులిప్పుడు పూర్తిగా వేరు. నేను మొదటిసారి 15 ఏళ్ల కిందట జపాన్ నించి తిరిగి వస్తూ సియోల్ వెళ్ళాను. అక్కడ చూడదగినది ఏమి లేదని చెప్పటం వల్ల నా కార్యక్రమంలో సియోల్ సందర్శనని చేర్చలేదు. డవున్ టవున్ అని వాళ్ళు పిలిచే ప్రాంతం అమెరికన్ పద్ధతిలో ఉంటుంది. అది తప్ప మిగిలిన ప్రదేశాలన్నీ, ఢిల్లీలోని కరోల్‌బాగ్‌లా ఉండి గొడ్లసావిళ్లతో నిండి ఉన్నాయి. నేను బసచేసిన అయిదు చుక్కల హోటల్ అనబడే దాంట్లో రోజులో ఎక్కువ సమయం నీళ్ళు ఉండవు. కరెంటు కూడా ఏదో చుట్టం చూపుగా అప్పుడప్పుడు వస్తూ పోతూ ఉండేది. అక్కడి ప్రజలు పేదవారు. కొందరికైతే చింకిపాతలు తప్ప మరేమి లేవు. ఆ నగరంలో చాలా భాగం రాత్రి పూట ఒక పెద్ద వేశ్యా గృహంగా మారి పోయేది. అక్కడ జీతాలు కూడా భారత దేశంలో కన్నా చాలా తక్కువ, రోజుకి జీతం కొద్ది రూపాయలు మాత్రమే ఉండేది. సంపన్నుల భవంతులు ఉన్న ప్రాంతాలని తప్పిస్తే మిగతా రోడ్లన్నీ తీరూ తెన్నూ లేకుండా ఉండేవి. చాలా మంది జనం, స్త్రీలతో సహా వాటి మీదే నివసిస్తూ ఉండేవారు. అప్పుడీ సియోల్ ఒక జిల్లా కేంద్రమే తప్ప మహానగరం కాదు. అంత సంపన్నం అయిన జిల్లా కూడా కాదది. అక్కడ నేను రెండు రోజులు మాత్రమే ఉండి తీవ్రమైన అసంతృప్తితో తిరిగి వచ్చినట్లు నాకు గుర్తు.

మళ్ళీ నేను అక్కడికి ఆరేళ్ల క్రితం వెళ్ళాను. అప్పటికి ఆ నగరం మంత్రం వేసినట్లు అత్యంత ఆశ్చర్యకరంగా మారి పోయింది. జనాభాని బట్టి సియోల్ ఎంత పెద్ద నగరమో నాకు తెలియదు. బహుశ అహమ్మదాబాద్ అంత కూడా ఉండి ఉండదు. కానీ జపాన్‌లోని ఒసాకా కన్నా సంపన్నమైనదిగా కనిపించింది. ఒసాకా చిన్న పట్టణమే అయినా అక్కడినుంచే బులెట్ ట్రైన్‌లు బయలు దేరుతాయి. సియోల్‌లో ప్రజలంతా తాము లండన్‌లోనో పారిస్‌లోనో ఉన్నట్లుగా వస్త్రధారణ చేసుకున్నారు. ప్రపంచంలో అన్ని చోట్ల నుంచీ వచ్చిన వ్యాపారస్తులతో రెస్టారెంట్‌లు క్రిక్కిరిసి ఉన్నాయి. అమెరికన్ చలన చిత్రాలలో మాత్రమే కనిపించే పెద్ద పెద్ద ఎయిర్ కండిషన్డ్ ఆఫీసులు ఉన్నాయి. చైనా వంటి దేశాలని కూడా కొరియా మించిపోగలదని నేను ఆనాడే ఊహించాను. ఇటీవలి ఆసియా క్రీడోత్సవాలలో అదే జరిగింది. నేను ఎప్పుడూ చైనా వెళ్ళలేదు కాబట్టి అక్కడ ఏమి జరుగుతున్నదో నాకు తెలియదు. కానీ భారతదేశం



కంటే భిన్నంగా మాత్రం ఏమి ఉండదని అనుకుంటున్నాను ఇదే జన సాంద్రత, ఇక్కడిలాగే పేదరికం, మురికి అక్కడా ఉన్నాయి అందుకు భిన్నంగా కొరియా ఒక యూరోపియన్ దేశంలా దాదాపు ఇటలీలాగా ఉన్నది అక్కడ తలసరి ఆదాయం తక్కువే ఉండవచ్చు, అయినప్పటికి అది యూరోప్ లోని ఒక దేశంలా ఉన్నది

కొరియా, జపాన్ వంటి దేశాలు సాధించ గలిగినది మనం ఎందువల్ల చెయ్యలేకపోతున్నాము? మనది పెద్ద దేశం కావటం ఒక కారణం అయి ఉండవచ్చేమో కానీ కేవలం అది మాత్రమే కాదు మిగతా అన్ని దేశాలూ కలిసి సాధించిన దానికి పదింతలు బంగారు పతకాలు సంపాదించిన ఆ దేశాలు ఒకే జాతికి చెందినవి కానప్పటికీ కాస్త అటూ ఇటూగా ఒక సంస్కృతికి సంబంధించినవి భారతీయులకి కొరియా వారైనా చైనా వారైనా జపనీయులలాగే కనిపిస్తారు. జర్మన్లు స్విస్ వారిలా కనిపించినట్లు మీకు ఆసియా అంతటా ఈ చీనీ – జపనీస్ జాతి కనిపిస్తుంది యూరోప్, అమెరికాలో ఎవరికీ అది తీసిపోదు ప్రపంచంలో ప్రస్తుతం రెండవ స్థానంలో ఉన్నది జపాన్, అమెరికా సంయుక్త రాష్ట్రాలకన్నా అది ఇప్పుడు కొద్దిగా వెనుక బడి ఉన్నప్పటికీ ఈ శతాబ్దం చివరికి దానిని మించి పోగలదని అనుకుంటున్నారు అంతే కాకుండా జపాన్ వారు తమ ప్రత్యేకతని వదులు కోకుండా ఉన్నత స్థాయిని అందుకోగలిగారు బయటికి వారు పాశ్చాత్య ప్రభావం ఉన్నట్లు కనిపించినా జపనీయులు నేటికీ తమ భావాలలో, నడవడికలో తమదైన ప్రాచ్య సంస్కృతిని వదులుకోలేదు వాళ్ళు పాశ్చాత్య ప్రభావానికి పూర్తిగా లొంగి పోలేదు ఆధునికీకరణ అన్నది తప్పని సరే కానీ పాశ్చాత్య ప్రభావం అనేది మన ప్రధాన మంత్రిలాంటి వారు అనుకుంటున్నది మాత్రం కాదు జపాన్‌వారు రెండు తరాలలోపుగానే తమ ప్రత్యేకతని నిలుపుకుంటూనే అమెరికా వారిని అధిగమించగలిగినప్పుడు భారతీయులకి కూడా అది సాద్యమే అవుతుంది భారతదేశంలోని ఆర్థిక వేత్తలు కొందరి లాగా హిందూ అభివృద్ధి రేటు గురించి అనర్గళంగా మాట్లాడే వారు చెప్పేది కేవలం బూటకంతో నిండిన అతిశయోక్తులు తప్ప మరేవీ కావు ఇప్పుడు ఉన్న దానికన్నా ఎక్కువగా మనం 'హిందూ' గా ఉండి ఉంటే తప్పకుండా ఇప్పటికంటే మెరుగుగా ఉండే వాళ్లం కొరియావారు కూడా కొరియన్లుగా ఉండబట్టే వాళ్ళు కూడా జపాన్ వారిలా దానిని సాధించ గలిగారనవచ్చు

సియోల్ క్రీడోత్సవాల ఫలితాలు బారత దేశానికి సిగ్గుచేటుగా ఉన్నాయి రాబోయే ఒలింపిక్ ఉత్సవాలలో మరిన్ని దేశాలు కొరియా మార్గాన్నే అనుసరిస్తాయి కాబట్టి మనం ఇంకా ఇబ్బంది పడాల్సి ఉంటుంది అది మన క్రీడాకారులకే కాకుండా మన దేశానికి కూడా సిగ్గుచేటు దాదాపు ఎనభై కోట్ల జనాభా ఉన్నదేశం కనీసం ఎనిమిది బంగారు పతకాలని కూడా సాదించ లేకపోయింది □

# మనలో మాట

గత వారం దీపావళి సంచికలో ప్రచురించిన ★ ఆ తృప్తి చాలు సామీ ★ నామకరణం ★ బరువు – బాధ్యత; ఈ వారం వేసిన ★ బుద్ధుడు పుట్టిన భూమిలో ★ మాయ ★ శిఖరం మీద కథలతో దీపావళి కథల పోటీలో రు. 700 /– బహుమతి పొందిన ఆరు కథల ప్రచురణ పూర్తి అయింది.

ఎప్పటి మాదిరిగానే ఈ ఏడాది కూడా పాఠకుల కోసం దీపావళి కథలపై బాలట్, వ్యాసరచన పోటీలని నిర్వహిస్తున్నాము.

సంపాదకుని ఎన్నికలో ఒక్కొక్కటీ రు 700/– చొప్పున బహుమతి పొందిన ఈ ఆరు కథలలో అత్యుత్తమమైన కథ పేరుని పాఠకులు ఈ కింద ఇచ్చిన బాలట్ పత్రంలో పేర్కొన వలసిందిగా కోరుతున్నాము వ్యాస రచన పోటీలో పాల్గొనేవారు బహుమతి పొందిన ఈ ఆరు కథలనీ సమీక్షిస్తూ ఒక సమీక్షా వ్యాసాన్ని వెయ్యి అక్షరాలకి మించకుండా రాసి దానితో పాటు పూర్తి చేసిన బాలట్ పత్రాన్ని జత పరచి పంపగోరుతున్నాము బాలట్ పత్రం జత పరచని వ్యాసాలని పరిశీలించటం జరగదు వ్యాసం రాయని వారు కూడా బాలట్ పత్రాన్ని పూర్తి చేసి పంపవచ్చు

**ముగింపు తేదీ : 29–11–1986**

పోటీకి పంపిన వ్యాసాలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు కాబట్టి వాటితో పాటు స్వంత చిరునామా కల, తపాలా బిళ్లలు అతికించిన కవర్లు జతపరచి పంపనవసరం లేదు వ్యాసం వ్రాత ప్రతి మీదా, బాలట్ పత్రంలోను రాసిన వారి పూర్తి పేరు, చిరునామా స్పష్టంగా రాసి ఉండాలి వ్యాసాలు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి కవరు పైభాగంలో 'దీపావళి కథలపై వ్యాస రచన పోటీకి' అని రాసి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003 అన్న చిరునామాకి పంపాలి బాలట్ పత్రాన్ని మాత్రమే పంపేవారు 'దీపావళి కథలపై బాలట్‌కి" అని కవరు పైభాగంలో రాసి దానిని పై చిరునామాకి పంపాలి

వ్యాసరచన పోటీలో మొదటి బహుమతి పొందిన వ్యాసానికి రు. 250/–, రెండవ బహుమతి పొందిన వ్యాసానికి రు. 150/–, మూడవ బహుమతి పొందిన వ్యాసానికి రు. 100 లు లభిస్తాయి.

పాఠకుల తీర్పుని అనుసరించి బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో ఎన్నికైన కథలకి వరుసగా రు 750/– రు 650/–, రు 550 /– లు అదనపు బహుమతులుగా లభిస్తాయి మిగతా మూడు కథలకీ కన్సొలేషన్ బహుమతిగా ఒక్కొక్క దానికీ రు 350/– చొప్పున అదనంగా ఇవ్వబడుతుంది

బాలట్, వ్యాసరచన పోటీ ఫలితాలని, బహుమతి పొందిన వ్యాసాలని, దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన ఆరుగురు కథా రచయితల పరిచయాలని ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంక్రాంతి సంచికలో ప్రచురిస్తాము

పాఠకులందరూ ఈ బాలట్, వ్యాసరచన పోటీలలో ఉత్సాహంగా పాల్గొని వాటిని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము

---

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## దీపావళి కథల బాలట్ పత్రం

**ముగింపు తేది : 29–11–1986**

కథ పేరు : ______________________

పంపిన వారి పేరు ______________________

పూర్తి చిరునామా ______________________

______________________

# కోహినూర్

ఝల్లు మనే చల్లగాలులు విసిరి వీచే వేళ
జగమంతా ప్రకృతి ఒడిలో నిదురించే వేళ
వెచ్చని సుతిమెత్తని నీ వలపు వెలుగు
అలముకుంటుంది నా హృదయాన్ని చలి తెలియకుండా
అనురాగం చిందే నీ హృదయం నాకు వేయి విధాల విదితం

**KOHINOOR®**

గులాబీరంగు
సుఖదాయకమైన లూబ్రికేటెడ్
కాండోమ్ ఎలెక్ట్రానిక్
ఉపకరణాలతో పరీక్ష
చేయబడినది




ఇప్పుడు
ఖర్చు ఆదా చేసే
విధంగా ఒకే
ప్యాక్‌లో పది.

ttk తయారీ

MAA (S) LRC1A TEL 86

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)
7-13 నవంబరు, 1986
శ్రీ అక్షయ నామ సం ఆశ్వీయుజ కార్తీకము షష్ఠి
సంపుటము 79 : సంచిక 10
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 78 00 |
| పోస్టులో 12నెలల చందా | రు 156 00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధినగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక






### దసరా సంచిక

మహిషాసురమర్దిని ముఖచిత్రంతో వచ్చిన దసరా ప్రత్యేక సంచిక చూడముచ్చటగా చదువరులకు ఆనందాన్ని కలుగజేసింది సంగీత సాహిత్యాలతో సర్వమంగళ పై ఆదిలక్ష్మిగారి వ్యాసం బాగుంది

స్త్రీ శిశుజన నిరోధంపై కథ - తల్లీ నీకు శతకోటి దండాలు వాస్తవాలకి ప్రతీకగా ఉంది మాచర్ల హేమగార్కి 'జీవితాన్ని జీవించు కథ, లోపాలు కలవారిలో ఆత్మవిశ్వాసాన్ని కలిగించేదిగా ఉంది

-కొండమూరి శ్యామ, గుత్తేనదివి

* * *

దసరా సంచిక మహిషాసురమర్దినితో వెలువడిన పత్రికలోని జీవితాన్ని జీవించు అనే కథ చాలా బాగుంది మధ్యలో యాక్సిడెంట్ ద్వారా వికలాంగులైనవారికి దర్పణం పట్టినట్లుగా నున్నది

-నాగావళి, తిరుపతి

* * *

'గర్భస్థ శిశువు చెప్పిన కథ' మరో శీర్షిక పవేశపెట్టడం- నూతన రచయిత (త్రు)లందరికి ఒక మంచి శుభావకాశంగా మా అందరికి ఎంతో ఉత్సాహం కల్గించడమే కాకుండా, తల్లీ నీకు శతకోటి దండాలు' కథ టిరిబుల్ అండ్ న్యూవేవ్ రచయితగార్కి హార్దికాభివందనములు

-కిర్తి కిష్టయ్య, లక్ష్మీదేవిపల్లి

విజయదశమిక ప్రత్యేకంగా ప్రచురించిన పత్రిక ముఖచిత్రం బాగుంది నూతనంగా ప్రవేశపెట్టిన శీర్షిక నేటి కాల పరిస్థితులకు, అందునా నేడు అనేక సమస్యలను ఎదుర్కొంటున్న వనితామణులకూ యీ గర్భస్థ శిశువు చెప్పిన కథలు చాలా ఉపయోగకరంగా వున్నది యీ శీర్షిక ద్వారా స్త్రీ సమాజం కొంతవరకు మేల్కొని చైతన్యాన్ని పొందించగలదని విశ్వసిద్దాం

శ్రీ పిళ్లా దుర్గా శ్రీనివాస్‌గారు వివరించిన ఐదు అంశాలు యదార్థానికి చాలా దగ్గరగా వున్నాయి యీ శీర్షికను తమరు ప్రవేశపెట్టినందుకు మాకు ఎంతో ఆనందంగా వుంది పాఠకులు విరివిగా యీ శీర్షిక ద్వారా ఎన్నో స్త్రీ సమస్యలను పరిష్కరించుకుంటారని మా ముఖ్య ఆశయం

-షేక్ మస్తాను, గాలిటిబి, ముమ్మలనేనివారిపాలెం, రేపల్లె

* * *

మహిషాసురమర్దిని ముఖచిత్రం బాగుంది కథల్లో 'వద్దు బాబోయ్! పెళ్లొద్దు!', జీవితాన్ని జీవించు', గాలివాన వెలిసింది పత్రికకే హైలైట్ రచయిత (త్రు) లకు మా అభినందనలు.

-ఎం శివాజీ, కె శైలజ
మోదుకూరు

### సీరియల్స్

సి విమలాగణేశ్‌గారి 'పావని' సీరియల్ చాలా బాగుంది విజయ్, పావనిల కథ సుఖాంతమవాలని కోరుకుంటున్నాను

-శ్రీవీణ, గోదావరిఖని

### బొమ్మల సీరియల్

సీక్రెట్ ఏజెంట్ ' విక్రమ్' ఎంతగానో ఆకర్షణీయంగా ఉంది

-షేక్. జకీర్‌హుస్సేన్, తంబళ్లపల్లె ☐

# అంజయ్య అస్తమయం



**ఆం**ధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి, అఖిలభారత కాంగ్రెసు (ఐ) సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ టంగుటూరి అంజయ్య అక్టోబరు 18వ తేదీ రాత్రి కొత్త ఢిల్లీలోని రామమనోహర్‌లోహియా ఆసుపత్రిలో గుండెపోటు వల్ల హఠాత్తుగా మరణించారు. ఆయన వయస్సు 57 సంవత్సరాలు. భార్య, కుమారుడు, నలుగురు కుమార్తెలు ఉన్నారు.

అంజయ్యగా పేరుపొందిన శ్రీ టంగుటూరి రామకృష్ణారెడ్డి మెదక్‌జిల్లాలోని భానూర్‌లో ఒకపేద కుటుంబంలో 1929లో జన్మించారు.పసితనంలోనే తండ్రిని కోల్పోయినఆయన మూడేళ్ల ప్రాయంలో తల్లితో పాటు హైదరాబాదు చేరారు. ఏడవ తరగతి చదువుతూ ఉండగా గాంధీజీ క్విట్ ఇండియా ఉద్యమ ప్రభావానికి లోనై చదువుకు స్వస్తి చెప్పారు.

అరణాల కూలీగా హైదరాబాద్‌లో జీవితాన్ని ప్రారంభించిన శ్రీ అంజయ్య అనంతరం ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టేతర కార్మికోద్యమానికి మూలపురుషుడుగా పేరు తెచ్చుకున్నారు.

1957లో శ్రీ అంజయ్య ఆంధ్రప్రదేశ్ శాసనసభకి ఎన్నికైనారు. 1972లో రాష్ట్ర కార్మికమంత్రిగా పనిచేశారు. 1978 వరకూ ఆయన శాసన సభ్యులుగా ఉన్నారు. అనంతరం ఆయన రాజ్యసభ సభ్యులై కేంద్రంలో కార్మికమంత్రి పదవిని అలంకరించారు. 1980లో రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవీ స్వీకారం చేశారు.

1984లో జరిగిన ఎన్నికలలో రాష్ట్రం నించి లోక్‌సభకి ఎన్నికైన కొద్దిమంది కాంగ్రెసు (ఐ) నాయకులలో శ్రీ అంజయ్య ఒకరు. తిరిగి ఆయన కేంద్ర కార్మిక మంత్రి అయినారు. ఆ తర్వాత కొద్ది నెలలకే ఆయనని అఖిలభారత కాంగ్రెసు(ఐ) సంఘం ప్రధాన కార్యదర్శిగా నియమించటం జరిగింది.

ఎన్నికలలో ఓడిపోయిన వారికి తమకన్నా ఎక్కువ అవకాశాలు లభించినా, తమకి సరైన న్యాయం జరగకపోయినా సహృదయంగల శ్రీ అంజయ్య తమపై వారి నిర్ణయాలని శిరసావహించారు. మారిపోతున్న కాంగ్రెసు సంస్కృతిలో ఆయన రాజకీయ జీవితం ఎన్నో ఒడిదుడుకులకి లోనైంది.కానీ ఆయన మాత్రం ఎంతో నిబ్బరంగా అంకితభావంతో పనిచేశారు. కర్తవ్యదీక్ష, విధేయతగల నిరాడంబర వ్యక్తి ఆయన. మృదుభాషి అయిన ఆయన తమ ప్రసంగాలలో ఛలోక్తులు విసురుతూ ప్రజలను బాగా ఆకట్టుకొనేవారు. ఆయన ప్రసంగాలు, చర్యలు కొన్ని పరిహాసానికి వీలు కల్పించినప్పటికీ అభినయాలనే వాటిలో ఆయనకి ఎంతమాత్రం తెలిసిని వారు ఉన్నతపదవులని అలంకరిస్తున్నారనే చెప్పాల్సి ఉంటుంది.

శ్రీ అంజయ్య అసలైన ప్రజా నాయకుడిగా పేరుతెచ్చుకున్నారు. అజాతశత్రువైన ఆయన పట్ల ప్రతిపక్షంలో ఉన్నవారు కూడా అభిమానం ప్రదర్శించేవారు. రాష్ట్రంలో కాంగ్రెసు (ఐ) పార్టీకిఆయన కొండంత అండగా ఉండేవారు. ఒకప్పుడు ఎంతో బలంగా ఉన్న ఆ పార్టీ ఇప్పుడు మరింత బలహీనపడిపోయింది. శ్రీ అంజయ్య హఠాన్మరణంతో రాష్ట్రంలో కాంగ్రెసు (ఐ) పార్టీకి తీరని లోటు ఏర్పడింది. ప్రస్తుతం రాజకీయాలు ఎక్కువగా వ్యక్తులపైనే ఆధారపడి ఉన్నాయనే చెప్పాలి. మిగతా దేశం అంతటా ఇదే విధంగా ఉన్నాయనటానికి వీలులేదు. ఎందుకంటే పశ్చిమ బెంగాలు, కర్నాటక రాష్ట్రాలలో కొన్ని రాజకీయ సంప్రదాయాలని గౌరవించేవారే ముఖ్యమంత్రులుగా ఉంటున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో కూడా రాజకీయ చైతన్యం వృద్ధిపొంది వ్యక్తులకన్నా వ్యవస్థలే ముఖ్యం అన్న భావం ప్రజలలో బలపడాలనుకునేవారు కూడా శ్రీ అంజయ్య మృతి రాష్ట్ర రాజకీయరంగానికి తీరని వెలితిగా విచారాన్ని వ్యక్తం చేయకుండా ఉండలేరు.

కొత్త ఢిల్లీ నుంచి ప్రత్యేక విమానంలో హైదరాబాదు తీసుకువచ్చిన కీ. శే. అంజయ్య భౌతిక కాయానికి అక్టోబరు 20న అన్ని ప్రభుత్వ లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి. లక్షలాదిమంది ప్రజలు శోకతప్త హృదయాలతో, అశ్రునయనాలతో తమ ప్రియతమ నాయకునికి అంతిమ వీడ్కోలు చెప్పారు. ప్రజలలో ఆయనపట్ల గల ప్రేమాభిమానాలకి అది నిదర్శనం అని చెప్పవచ్చు. గతంలో ఏ ప్రముఖ వ్యక్తి మరణించినప్పుడు కూడా ఇంతమంది జనాన్ని చూడలేదని పలువురు అన్నారు.

—(ఒ.వి.)

V.V.D

ఊహలలో విహరించే
నవయౌవన సుందరాంగి
ఆమె హృదయాన్ని దోచుకున్నది ఎవ్వరో
అల్లనల్లన సాగే అందాల సెలయేరు
హాయి హాయిగ వీచే చల్లని మలయ మారుతం
హృదయాన్ని చూరగొన్న సొగసైన చెలికాడు
రంగు రంగుల కోమల కుసుమాలు
నిగ నిగలాడే సుదీర్ఘ శిరోజాలు
ఆ శిరోజాలకు
వి.వి.డి కొబ్బరి నూనె



VVD-2/86 R




# వి.వి.డి.కొబ్బరి నూనె

*సహజ శిరోజాల యౌవన రహస్యం*

V.V.D

సన్నటి వేప పుల్లకు ఒక వేపు బెరడు తీసి, నోట్లో పెట్టుకుని నములుతూ చెరువు గట్టు మీద నడుస్తున్నాడు ప్రణీత్...



"ఏటి కడుపున దాగి తోట నిదరోయింది..." పుల్ల విసిరేసి కూనిరాగం తీస్తూ చెరువులో దిగి మొహం కడుక్కుని ఒడ్డుకొచ్చాడు ప్రణీత్.

ఇంకా పూర్తిగా సూర్యోదయం కాలేదు. తూర్పు మీద కుంకం ఎరుపు, సంవత్సరాది పూతకు తయారవుతున్న వేపచెట్టు చిగుర్ల మీద మెరుస్తోంది..





# ఒడిలో చెలి మోహన రాగం

పక్షులు కిలకిలా రావాలతో బాలభాస్కరునికి స్వాగత గీతాలాలపిస్తున్నాయి .

పైపైకి పచ్చిన సూర్యుడు నేర్పు గల ప్రియుని వలె, చెరువు మధ్యగల తామర మొగ్గల చివరల్ని కిరణపు కొనలతో తాకి ఎర్రబారేలా చేస్తున్నాడు తే ఎరుపు తామరలు నును సిగ్గుతో విచ్చుకుంటున్నాయి .

ప్రకృతి బద్ధకంగా చలిదుప్పటిని తొలగించుకుంటోంది . ఆ అద్భుతమైన సూర్యోదయపు దృశ్యాన్ని పరవశంతో చూస్తున్నాడు ప్రణీత్ .

దూరంగా పాల కావిడుల వాళ్ళ మాటలు కూరల గంపలతో వస్తున్న పల్లెపడుచుల కడియాలందెల చప్పుళ్ళు రచ్చబండ మీద మొహం కడుక్కుంటున్న ఊరి పెద్దల పరామర్శలు రైతు కూలీల జవాబులు

కళాపు చల్లిన వాకిళ్ళలో తెల్లగా మెరుస్తున్న ముగ్గురేఖల మీద హరిదాసు చిరతల చప్పుళ్ళు

పాలు పిండుతున్న తాలూకు వీణా నాదం

ఆత్రంగా తనను చేరిన దూడను ఆప్యాయంగా నాలుకతో స్పృశిస్తున్న గోమాత చూపుల చల్లదనం

పచ్చని పైర్ల కొనలను అల్లరిగా తాకి పరుగెడుతూ హుషారుగా ఈల వేసే చిరుగాలి రెపరెపలు

ఓహ్! ఫెంటాస్టిక్!

చూసేవాడి మనసులో బావుకత ఉండాలే కానీ అందాల కేం కొదువ?

సముద్రం ఒడ్డున కూర్చుని పడమట మెరిసే చుక్కల్ని చూస్తూ శుక్రుడి మీద షెల్లీ రాసిన పద్యాలను గుర్తు తెచ్చుకుని మురిసే వాడు పట్నంలో తను

అందాలను వెతుక్కుంటూ ఊరికి దూరంగా ఉన్న సముద్రాన్ని ఆశ్రయించేవాడు ఎప్పుడెప్పుడు సాయంత్రమవుతుందా! అని ఎదురు చూసేవాడు

ఇక్కడలా కాదు! ఊరి నిండా అందాలే!

పల్లెటూరి ముగ్ధత్వం గురించి వినటమే గానీ ప్రత్యక్షంగా చూడటం మాత్రం ఇదే

చదువూ సంధ్యా వదిలేసి, ఈ చెరువు ఒడ్డునే తనో పర్ణశాల నిర్మించుకుని ఉండిపోతే?

పెళ్ళీ పెడాకులూ లేకుండానే తనకిలాంటి బైరాగి బుద్ధులు పుడుతున్నాయేం?తెలివి ముదిరి పిచ్చి, చాదస్తంగా మారినట్లు భావుకత ముదిరి బైరాగి తత్వంగా మారుతుందేమో!



'ఈ రేయి నన్నొల్లనేరవా రాజా

యెన్నెలల సొగసంత ఏటి పాలేనటరా

ప్రకృతి అందాలతో సహజంగా కలిసిపోతున్న తియ్యని స్వరం వినపడుతున్న వేపు కుతూహలంగా చూశాడు ప్రణీత్ పదిహేడేళ్ళ అమ్మాయి కాళ్ళను నీళ్ళలోకి జార్చి, రాతి మీద కూర్చుని ఇత్తడి బిందెను తోముతోంది ఆమె పెదవుల మీదే ఆ పాట అలలా తేలి వస్తోంది

మంచి గంధం పొడిలాంటి ఒంటి రంగు . నల్లటి కోలకళ్ళు వేళ్ళ చివర గోరింటాకు ఎరుపు పనికి అడ్డొస్తోందన్నట్లు నిర్లక్ష్యంగా వెయ్యబడి, మెడ మీద భారంగా కదులుతున్న జుట్టు ముడి అక్కడి నుంచి తప్పుకొచ్చి బుగ్గలూ నుదురూ స్పృశించి, వెనక్కి వెళ్ళలేనట్లు అలాగే ఆగిపోయిన ముంగురులు

నల్లంచు గులాబీ రంగు పరికిణీ, నల్లని ఓణీ ఒంటికి పట్టినట్లున్న బ్లౌజు .

నీటిలో తెల్లగా మెరుస్తున్న పాదాల నలంకరించిన పట్టాల తాలూకు మువ్వలు, ఆమె లయ వేస్తుంటే చిరు చిరుగా మోగుతున్న సవ్వడి .

ముగ్ధుడై చూస్తున్న ప్రణీత్ చూపులు ఆమె తెల్లని మెడ మీద . అందంగా కదిలే కింది పెదవి మీద, లయ వేస్తున్న పాదాల మీద పడి ఆగిపోతున్నాయి

ఎవరీమె!?

"మంజీరా! త్వరగా కానివ్వవే. రోజూ వస్తూనే ఉన్నా ఈ ప్రదేశం చూస్తుంటే నీకిహ ఇవతలి ప్రపంచం గుర్తుండదు నేను నీళ్ళు పట్టి గంటయింది నీ కింకా బిందె తోమటం కాలేదు?' ఆమెకు తోడుగా వచ్చిన యువతి హెచ్చరిస్తోంది

మంజీర!

బావుంది ఆమె ముగ్ధత్వానికి తగిన పేరు!

ఇంకా వివరాలు తెలిస్తే బావుండును!

వెళ్ళి అడిగేస్తే?

తంతుంది పట్టుకుని

"అయిందిలే హైమా! వచ్చిందగ్గర్నుంచీ పోదాం పోదామని ఒకటే గొడవ ' బిందె కడిగి నీళ్ళు ముంచుతూ అన్నది మంజీర

"నీకేం తల్లీ! ఎంతాలస్యం చేసినా మీ అమ్మ నిన్నేం అనదు. మా అత్త సంగతి తెలుసుగా? కాస్త ఆలస్యమయితే దండకం మొదలెడుతుంది " అన్నది హైమ

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయిన తరవాత ఇహ అక్కడ కూర్చుని ఒక్కడే ప్రకృతి అందాల్ని చూసే మూడ్ పోయింది ప్రణీత్‌కి నెమ్మదిగా ఇంటి దారి పట్టాడు

ప్రణీత్ తండ్రి వెంకట్రామయ్య ఆ ఊరుకి స్కూల్ టీచరుగా వచ్చాడు. ఆయన భార్య కామేశ్వరి ఒక కూతురు, ఒక కొడుకూ ఆయనకు కూతురు అత్తవారింట్లో ఉంది కొడుకు ప్రణీత్ పట్నంలో చదువుకుంటూ సెలవల కొచ్చాడు ఆ ఊరు పేరు పైడిపల్లి

* * * * * * * * *

"అన్నయ్యా! అమ్మ లేదూ?

ఉలిక్కిపడి చూశాడు ప్రణీత్ అతనికి చెల్లెళ్ళు లేరు.

ఆ అమ్మాయి.

హైమ!

ఒక్కక్షణం అతని మనసు సంతోషంతో ఉద్విగ్నమయింది..

'లోపలుందమ్మా! వెళ్ళు " అతని కంఠంలో అనుకోకుండా వచ్చిన మెత్తదనం

రెండు రోజులు గడిచేసరికి హైమ ప్రణీత్ దగ్గర తగినంత చనువూ చెల్లిగా అధికారం సంపాయించేసింది ఆమె ద్వారా మంజీర విషయాలు తెలుసుకున్నాడు ప్రణీత్ అతన్ని ఆట పట్టిస్తూ బతిమాలించుకుంటూ .. బెదిరిస్తూ మంజీర గురించి చెప్పింది హైమ

మంజీర తండ్రి మాజీ మున్సిపల్ చైర్మన్. పదెకరాల మాగాణీ, స్వంత ఇల్లూ ఉన్నాయి బాబూరావు, శార్వాణి దంపతులకు మంజీర ఒక్కతే కూతురు బాబూరావు ఆ ఇంటికి మకుటం లేని మహారాజు, శార్వాణి భర్త కెదురాడదు

# "లవంగ నూనె లేని టూత్ పౌడరు నాకు పనికిరాదు"



"నాకిష్టమైన టూత్‌పౌడరు ప్రామిస్. ఎందుకేమిటి, దీన్లో లవంగ నూనె ఉంది! అందుకే ఇది ఊరూరా పేరు మోసింది. లవంగ నూనెలో రెండు గొప్ప సుగుణా లున్నాయి. ఇది చిన్నచిన్న బాధలనుంచి పళ్లను సదా కాపాడుతుంది. పైగా పళ్లకు చెడుపుచేసే సూక్ష్మజీవులు దీనిదెబ్బకు నశించిపోతాయి.

ఇందువల్ల పళ్లు గట్టిగా ఉంటాయి. దీని మరొక గొప్ప గుణమేమిటంటే, ఇది నోటిని తాజాగా, సువాసనగా ఉంచుతుంది. అంటే మనం మాట్లాడుతుంటే ఎదుటి వాళ్లు మొహం తిప్పుకోరన్నమాట!

మరొక ముఖ్య విషయమేమిటంటే, ప్రామిస్‌లోని సద్గుణాలతో పోలిస్తే దీని వెల చాల తక్కువ. దీనిపైన పెట్టిన పైసపైసకూ మనకు ఫలితం దక్కుతుంది.




30 గ్రా. పౌచ్‌లో కూడా లభిస్తుంది.

నన్నడిగితే ప్రామిస్ టూత్‌పౌడరే తెచ్చుకోమంటాను. ఇది లవంగ నూనెతో నిండినది. బలాస్రా వారు ఎంతో ఆలోచనతో సృష్టించినది".

## లవంగ నూనెతో అద్భుత సృష్టి

# ప్రామిస్
## టూత్‌పౌడర్



బలాస్రా—
టూత్‌పేస్ట్ విశేషజ్ఞులు



CHAITRA-B BLS 828 TEL

## ఒడిలో వెలి మోహన రాగం

మంజీరకు తండ్రి దగ్గర కన్నా. తల్లీ, తాతగారి దగ్గరే ఎక్కువ చనువు....

మంజీర, హైమ టెంత్ పాసయ్యాక, ఆ ఊర్లో కాలేజీ లేని కారణంగా చదువులు మానేశారు

హైమకు తల్లి లేదు మేనత్త దగ్గర ఉంటుంది 'మేనత్త కొడుకు రాజారావు బాపట్లలో అగ్రికల్చర్ బి ఎస్ సి చదువుతున్నాడు. అతనికి హైమంటే ఇష్టం

హైమా మంజీరా ప్రాణస్నేహితులు మంజీర చక్కగా పాడగలదు ఎంకి పాటలు అష్టపదులు ఆమెకు చాలా ఇష్టం ఇవీ ఆమె వివరాలు!

"మా లావు ఫ్రెండులే! ఈ కాస్త చెప్పటానికింత సేపు బ్రతిమాలించుకోవాలా?" నిష్ఠూరంగా అన్నాడు ప్రణీత్

"అంతేలే! అక్కర తీరాక .. "అని ఓ మోటు సామెతుందిట" అంటూ నవ్వి 'అయినా ఆ పిల్ల వివరాలు నీ కెందుకూ?" అంది హైమ దబాయింపుగా.

వివరాలన్నీ చెప్పనే చెప్పావుగా! ఎందుకో . చెప్పను. నీ సామెత రుజువు చెయ్యాలి గదా" అంటూ నవ్వాడు ప్రణీత్

'ఓ యబ్బ! నువ్వు చెప్పకపోతే నేను తెలుసుకోలేనా? నాకెప్పుడో అర్థమయిందిలే."

"ఏమర్థమయింది?'

"చెప్పను " అతన్నే అనుకరిస్తూ అన్నది హైమ.

ఇలాంటి చెల్లెలుంటే నిజంగా ఎంత బావుంటుంది! ఆమె కోసం మంజీర తమ ఇంటి కొచ్చేది తన చెల్లెలే సూత్రధారిణిగా మారేదప్పుడు

స్త్రీని చూడగానే మంచం గుర్తొచ్చే మూర్ఖుల కోవకు చెందిన వాడు కాడు ప్రణీత్

మంజీర అందానికేమాత్రం తీసిపోని హైమ అతని మనసు నాకర్షించలేదు. ఆమె 'అన్నయ్యా" అని పిలవగానే అతని మనసాబంధాన్ని సంతోషంగా అంగీకరించింది

'నీ సంగతి మంజూకు చెప్పెయ్యనా?' కవ్వింపుగా అన్నది హైమ

'ఏమని చెపుతావు?" ఆసక్తిగా అడిగాడు ప్రణీత్

"అయితే నా ద్వారా దాని కేదో చెప్పాలనే ఉందన్న మాట నీకు!

"పల్లెటూరి అమ్మాయిలు ముగ్ధలు . అమాయకులు అనుకునే వాడిని పదహారేళ్ళకే వాళ్ళింత జాణలుగా ఉంటారని నాకు తెలీదు "

"అసలు విషయాన్ని దాటేసి, ఇంకో విషయం చాటున అందంగా దాక్కోటం నీకే చెల్లింది "

"నువ్వే గెలిచావులే గానీ . మంజీర కూడా ఇలాగే నా గురించి నిన్ను అడుగుతుంటుందా?"

'నువ్వెంత అమాయకుడివన్నయ్యా! ఈ లోకంలో ఎలా బతుకుతావో ఏమిటో !"

హైమ మొహం చూసి నవ్వును అణుచుకుంటూ "ఎందుకంత జాలి నా మీద?" అన్నాడు ప్రణీత్.

'లేకపోతే ఏమిటి? అదసలు నిన్ను చూసిందా నీ గురించి అడగటానికి?"

"ఔను కదూ! అక్కడ ఆ రోజు చెరువు దగ్గర ఇంకాసేపుంటే నన్ను తప్పక చూసేది. నువ్వే! రాక్షసిలా "రా! రా" అంటూ బలవంతంగా లాక్కుపోయావామెను."

"సరే! రేపు నేనేం అనను లే తీరికగా చూసుకుందురు గాని "

"రేపొస్తుందా? రెండు మూడు రోజుల్నుంచీ ఆమె నీళ్ళకు రావటం లేదేం?"

"అయితే తమరు ప్రతిరోజూ తెల్లారేసరికి హాజరవుతున్నారన్నమాట?"

"ప్రకృతి తాలూకు సహజ సౌందర్యాన్ని కళ్ళారా చూడటానికి ఆ టైంలో నేను మీరు కనపడక ముందు నుంచే వస్తున్నాను "

"అలాగా! ఆ సౌందర్యాన్ని కళ్ళారా చూసుకుంటూ కూర్చోక మళ్ళీ మంజీర కోసం ఎదురు చూడటం దేనికి?"

నేనేం ఎదురు చూడలేదు

'అయితే రాలేదేం అని ఎందుకడుగుతున్నావు?

'ఒక్కసారి చూశాను గనక అడిగాను.

"ఒకసారి చూస్తే ఇంకోసారి ఎదురు చూసి వివరాల కోసం తహతహలాడాలనుందా?'

అబ్బబ్బ! నిజంగా రాక్షసివి నువ్వు

లేకుంటే ఈ డొంక తిరుగుడెందుకూ? నీ ఉద్దేశ్యమేమిటో స్పష్టంగా చెప్పొచ్చుగా?

నేను చెపుతూనే ఉన్నాను నువ్వే సరిగ్గా చెప్పనివ్వకుండా ప్రతి దానికీ మెలికలేస్తూ వెధవ టీజింగ్ నువ్వూను

ప్రణీత్ ఉక్రోషం దాపరికం చూస్తుంటే హైమకింకా నవ్వుగానే ఉంది

మొట్టమొదటి ప్రేమానుభవంలో ఎంత తెలివైన మగవాడయినా ఇంత సిల్లీగా బయట పడి పోతాడా!" అని ఆశ్చర్యపడుతోందామె అతను తన ముందు అలా తడబడటం తమాషాగా ఉందామెకు చెల్లెలిగా కొత్తగా సంపాయించుకున్న ఈ అధికారం అపురూపంగా ఉంది

మగవాడలా అందరి ముందూ బయటపడడు ఆ బయట పడటమనేది ఎదటి వ్యక్తితో అతను ఏర్పరుచుకున్న అనుబందాన్ని బట్టి ఉంటుంది ' అన్నాడు ప్రణీత్

ఈసారి ఆమె అతన్ని ఆట పట్టించ లేక పోయింది '

థాంక్స్!" అన్నది మెత్తగా మంజూ రేపొస్తుంది నీళ్ళకి, కళ్ళెత్తి అతన్ని చూస్తూ అన్నది

నిజంగా? మరి ఈ రెండ్రోజులూ ఎందుకురాలా? ఆత్రంగా అడిగాడు ప్రణీత్

ఇంట్లోకి రాకూడదు "

అంటే? బయట విడిగా కూచుంటుందా?!'

ఔను

ఛీ!"

ఛీ ఏమిటి?!'

ఆ సంగతి నలుగురికీ తెలిసేలా ఎందుకా ప్రదర్శన?

'ఇంట్లో కొచ్చేస్తే ఎలా? దేముడు మైలపడడూ!"

నీ అంత అమాయకులు ఇంకా ఈ శతాబ్దపు అంచులో కూడా ఉన్నారా?!"

ఇందాకేగా రాక్షసినన్నావ్?"

అప్పుడంతే

'నాకేమన్నా కామరూప విద్య తెలుసా? ఇంతలోకే ఇన్ని రకాల రూపాలు దరించటానికి? అసలు మా బావయితే నన్ను ఎప్పుడూ ' చాలా మంచి పిల్లవు హైమా' అంటాడు

'మీ బావకదా మరి' అందునా . కాబోయే భర్త కూడాను ఇప్పట్నుంచే అలా తనను నీ కనుగుణంగ' ఓలుచుకుంటున్నాడు ముందు ముందు కష్ట పడక్కర్లేకుండా

ఆమెను ' టీజ్ చెయ్యటానికి తనకు దొరికిన ఏ అవకాశాన్నీ ఒదులు కోడు ప్రణీత్

హైమ మేనత్త పేరు సుందరమ్మ ఆమెకీ బీదపిల్ల హైమ తన కోడలుగా రావటం ఇష్టంలేదు ఆ అసంతృప్తినామె హైమ మీద రకరకాలుగా ప్రదర్శిస్తుంటుంది

"ఇంకెన్నాళ్ళు హైమా! ఈ ఒక్క సంవత్సరం ఎలాగో ఓర్చుకో నా చదువై పోతుంది ఇక్కడి కొచ్చేసి నిన్ను పెళ్ళి చేసుకుని వ్యవసాయం చేపడతాను అప్పుడిహ అమ్మ నీ జోలికి రాకుండా నేను చూసుకుంటాను', అంటూ సెలవల కొచ్చినప్పుడల్లా ఓదారుస్తుంటాడు రాజారావు .

కామేశ్వరికి హైమలాంటి ఆడపిల్లా నట్టింట్లో తిరగటం చాలా ఇష్టం దగ్గర దగ్గర ఇళ్ళు కావటంతో హైమ తరుచుగా వీళ్ళింటికి వస్తూ ఉంటుంది

'మా బావను నువ్వేం ఎద్దేవా చెయ్యక్కర్లేదు తనకు నీలాగా నాలిక చివర్నుంచి మాట్లాడ్డం చేతకాదు " అన్నది హైమ



## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

# ఒడిలో చెలి మోహన రాగం

నాలిక చివర్నుంచి మాట్లాడ్డ మేమిటి?!"

అంటే ఆ టైముకు తోచిందేదో అనెయ్యటమే గానీ అది మనసులోంచి సహజంగా ఉద్భవించిన అభిప్రాయం కాదన్న మాట

ఐ సీ! అయితే ఇందాక నిన్ను నేను రాక్షసీ అనటం కూడా ఈ బాపతుకు చెందినదే అయి ఉంటుంది కదూ? రాజీ కొస్తున్నట్లుగా అన్నాడు ప్రణీత్

కదూ?! వెక్కిరింపుగా అన్నది హైమ,

* * * * * * * * *

మామూలు టైము కన్నా ముందే చెరువు దగ్గర కెళ్ళాడు ప్రణీత్ హైమ చెప్పినట్లు మంజీర ఈ రోజు వస్తుందా?

ప్రణీత్ చూపులు మాటి మాటికీ కాలిబాట వెంట పరుగిడుతున్నాయి

సూర్యుడు ఎగతాళిగా చూస్తూ పైపైకి వస్తున్నాడు

చెరువు దగ్గర సందడి ఎక్కువయింది

గట్టు వెంట గొడ్లను తోలుకెళ్ళేవాళ్ళు చెరువులో ఓ పక్క బిందెలు తోమేవాళ్ళు మడి బట్టలుతుక్కునే వాళ్ళు కావిళ్ళతో నీళ్ళు పట్టుకెళ్ళేవాళ్ళు

నిరాశగా ఇంటి దారి పట్టాడు ప్రణీత్

హాయ్ అన్నయ్యా ', అంటూ వచ్చింది హైమ

మాట్లాడకుండా మొహం తిప్పుకున్నాడు ప్రణీత్

ఎందుకా అలక? ఇది మరీ బావుంది అది రాకపోతే మధ్యన నేనేం చెయ్యనూ? నీ కో మంచి కబురు చెపుదామని వచ్చాను నువ్వు పలకటం లేదుగా? నే వెడుతున్నానయితే జడకుప్పెల మీద నల్ల తాడును గట్టిగా లాగి ముడేసుకుంటూ వెనుతిరిగింది హైమ

ఆగు హైమా! ఏమిటో చెప్పు అన్నాడు ప్రణీత్

కోపం పోయిందా?

నాకోపానికి నువ్వేమన్నా జడుస్తావు గనకనా? ఉట్టి రౌడీ పిల్లవి

అవునూ పొద్దున రాలేదు నువ్వు కావాలనే అబద్ధం చెప్పావు కదూ?

చా! అదేంకాదు మంజూ గొప్ప హడావుడిలో మునిగి పోయి, నీళ్ళకు రాను పొమ్మంది

ఏం హడావుడి?

అది ఈ రోజు సంధ్య గొబ్బిళ్ళు పెడుతోంది

'ఎక్కడ?

చెరువు పక్కనున్న తోట వాళ్ళదే అందులో పెద్ద తులసి కోట ఉంది సాయంత్రం అయిదింటికి అక్కడ పూజ మొదలు పెట్టి గొబ్బితట్టి, పూజ అయాక వాటిని ఓలలాడించి వస్తాం

గొబ్బిళ్ళు చెయ్యటం పేరంటం పిలవటం ప్రసాదం చెయ్యటం ఇవన్నీ తోట లోకి జారెయ్యటం

కావలసినంత పని మాకు

నువ్వు కూడా సాయంత్రం అక్కడికి రా నీ ప్రియురాల్ని కళ్ళనిండా చూసుకోవచ్చు

అక్కడంతా ఆడపిల్లలుంటారుగా?

అయ్యో! ఏం అమాయకత్వం? చెరువు కట్ట మీద నుంచి దొంగ చాటుగా చూడ్డం లేదూ? నీ కలవాటేగా? తోటలో కావలసినంత చాటు ' అలాగే చూడు వచ్చి

'నా ప్రేమకథ నీకు చెప్పుకుని ఎంత లోకువై పోయానూ!

కదూ? పాపం!

'పేరంటానికి పెద్ద వాళ్ళు కూడా వస్తారా? అంటే అమ్మా వాళ్ళు కూడా

రారులే ఇది పెద్దవాళ్ళ పేరంటం కాదు దీన్ని పెళ్ళి కాని అమ్మాయిలే చేసుకుంటారు '

ఉహూ(!

లోపలికెళ్ళి, కామేశ్వరితో చెప్పి వెళ్ళి పోయింది హైమ

సాయంత్రం తోటవేపు వెళ్ళాడు ప్రణీత్

చెరువు గట్టుమీద నుంచి తులసి కోట స్పష్టంగా కనిపిస్తోంది ఆడపిల్లల సందడి వినిపిస్తోందక్కడ

చాటుగా నిలబడి వాళ్ళని గమనిస్తున్నాడతను

తులసి కోట ముందు వెడల్పుగా ఉన్న పీటవేసి, దాని మీద పెద్ద పెద్ద గొబ్బిళ్ళు మూడు పెట్టి, వాటిని పూలతో అలంకరించారు వాటి ముందు రెండు వేపులా ఉన్న కుందుల్లో దీపాలు వెలుగుతున్నాయి

అగరొత్తుల పరిమళం దీపకాంతితో కలిసి వాటి మీదకు ప్రసరిస్తోంది

ఆడపిల్లలు పట్టు లంగాలు, ఓణీలు వేసుకుని చాప మీద కూర్చున్నారు ఒక వేపు

పూజ పూర్తయాక గొబ్బితట్టటానికి లేచారంతా

మంజీర పసుపు రంగుకు ఎరుపు జరీ అంచున్న పట్టు లంగా ఎరుపు జార్జెట్ ఓణీ, జరీ అంచున్న బ్లౌజ్ వేసుకుంది నడుము దగ్గరున్న జరీ అంచు తాలూకు చివరి ఎరుపు ఆమె పచ్చని ఒంటి మీద స్నిగ్ధంగా మెరుస్తోంది

పొడుగ్గా ఉన్న జడ చివర కుప్పెలు జడ మధ్య రాళ్ళ చేమంతి బిళ్ళ జడ మీద చేమంతి, కనకాంబరాలతో కూర్చిన దండ రాళ్ళ జుంకీలు మువ్వల పట్టాలతో అందంగా ఉన్న లేత పాదాలకు గోరింటాకు పారాణి మెడలో పొడవైన హారం చేతులనిండా గాజులు

పల్లెటూరి అలంకరణలో ఉన్న మంజీర నండూరి వారి ఎంకిలా కనిపిస్తోంది ప్రణీత్ కళ్ళకు

గొబ్బీయళ్ళో గొబ్బీయళ్ళో పాటకు అనుగుణంగా గొబ్బి తడుతూ తులసి కోట చుట్టూ గుండ్రంగా తిరుగుతున్నారు అమ్మాయిలు

వాళ్ళ కార్య క్రమాల్ని ఆసక్తిగా గమనిస్తున్నాడు ప్రణీత్

'చామంతీ పువ్వంటీ చెల్లెనివ్వవే హుషారుగా సాగుతున్న పాట మొగలి పువ్వంటీ దగ్గర కొచ్చే సతికి సిగ్గుగా ఆగి పోయింది

మొగుణ్ణియ్యావే నాకేం! పాడకుండ అలా మధ్యలో ఆపేసిన వాళ్ళకి మొగలి పువ్వులాంటి మొగుడు రాడు బెదిరింపుగా అన్నది మంజీర

అంతా ఒక్కసారిగా నవ్వారు

మొగుడు మొగలి పువ్వులా ఉండట మెందుకే? గీసుకు పోవటానికా? అన్నది హైమ

మొగలి రేకు కున్న సువాసనంత సహృదయుడై ఉండాలని అర్థం అన్నది మంజీర

'ఇంచక్కా మల్లె పువ్వంటి మొగుణ్ణియ్యమని అడక్కూడదూ? సువాసనతో పాటు కాస్త మెత్తగా కూడా ఉంటాడు కదా?

"మరీ మెత్తగా ఉంటే బాగోదని , మొగలి రేకు చీరుకున్నట్లు కాస్త కరుకు దనం కూడా తోడయితే తీపీ పగరూ కలిసిన కొత్త దనంతో బావుంటుందని

'ఈకాలం పిల్లలకి బొత్తిగా సిగ్గూ లజ్జా లేకుండా పోతున్నాయ్రా! మొగుడి పేరెత్తగానే ఊరికే సిగ్గు పడి పోవాలిగానీ ఇంతగా సాగదీస్తారా!



# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు 4వ నెల నుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలూ కావాలి. దీన్ని సెరిలాక్ కానుకతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం :**
సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు-ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వుపదార్థం, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయికి ప్రత్యేక అవసరాలకు తగినట్టుగా సరైన పాళ్ళలో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

**రుచి లాభం :**
సెరిలాక్ మంచి పోషక పదార్థాలను, మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం :**
సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార ఉన్నాయి. దాన్ని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారుచేయడంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.

ఉచిత సెరిలాక్ పుస్తకం కోసం
వ్రాయండి.
సెరిలాక్
పోస్ట్‌బాక్స్ నం: 3.
న్యూఢిల్లీ-110 008.






Nestlé

SAA/FSL/379(R)/TEL

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం

# ఒడిలో చెలి మోహన రాగం

అవ్వ ఒకమ్మాయి కొంటిగా అన్న మాటలకి అంతా గొల్లున నవ్వేసి మళ్ళీ పాట అందుకున్నారు

గుంపులో ఉన్న హైమ దూరంగా ఉన్న ప్రణీత్‌ని గుర్తించి కళ్ళెగరేసి నవ్వింది గుంబనగా

ఇస్' అన్నట్లు చూపుడు వేలు పెదవుల కానించు కున్నాడు ప్రణీత్ ఆ తతంగ మంతా పూర్తయ్యాక ప్రసాదం పంచి స్నేహితురాళ్ళతో కలిసి వెళ్ళి పోతున్న మంజీర నతుక్కు పోయాయతని చూపులు

ఆమె పూర్తిగా కనుమరుగయాక తనూ ఇంటికి బయల్దేరాడు ఒక్కసారి ఏకాంతంగా ఆమెతో మాట్లాడ కలిగితే బావుండును!

ఆమె ఏమనుకుంటోందో తన గురించి

* * * * * * * * *

అబ్బబ్బ! అన్నయ్య అన్నయ్య అంటూ ఒకటే స్తోత్ర మయిపోయింది నీకీ మధ్య! ఎవరా మహానుబావుడు ఏమాకథ? అన్నది మంజీర

అతనెంత మంచి వాడని '

గంట నుంచీ లాగుతునే ఉన్నావు దాన్ని ప్రతి మాటనీ తిప్పి తిప్పి అతని మీదకే తెస్తావు

ఏం? మీ బావతో మాట్లాడి, త్వరగా నీ పెళ్ళి జరిపిస్తానని చెప్పాడా? హైమను మధ్యలో నే ఆపుతూ అన్నది మంజీర

మా బావతో ఎవరూ మాట్లాడక్కర్లా నేను కోరితే ఈ క్షణంలో నా మెడలో తాళి కట్టేస్తాడు తెలుసా? అన్నది హైమ

అయితే కోరరాదూ? సరదాగా నీ పెళ్ళి చూసి ఎంజాయ్ చేస్తాం!

నువ్వు చూసి ఎంజాయ్ చెయ్యటం కోసం నేను పెళ్ళి చేసుకోవాలా? అయితే నేను చూసి ఎంజాయ్ చేస్తాను నువ్వు చేసుకోరాదూ?

నీ కయితే రెడీగా ఉన్నాడు గదా?

నాకు ఇంకా వెతకాలి రావాలి చూడాలి నచ్చాలి నే మెచ్చాలి ఓహ్! ఎంతకథుంది

శుభ్రంగా మా అన్నయ్యని చేసుకోరాదూ?

తంతానేవ్!

ఎందుకుట?

ఎంత ధైర్యం నీకు?! ఎవరో ముక్కూ మొహం తెలీని వాడిని తెచ్చి నీ అంతట నువ్వే అతన్ని నా మొగుడిగా నిర్ణయించేస్తావా?

మానాన్న కీ సంగతి తెలిసిందంటే జాగ్రత్త!

మీ నాన్న సంగతి సరే! ముందు నీ విషయం చెప్పు

నేను చూశానా అతన్ని?'

అతని ఊహల నిండా నువ్వే ఈ ఫోటోలు చూడు అంటూ మూడు ఫోటోలు మంజీర కిచ్చింది హైమ .

కాళ్ళు నీళ్ళలో వేసి అలవోకగా బిందె తోముతూ.

బిందె నడుము కానించుకుని వెళుతూ .

గొబ్బిళ్ళ దగ్గర తెల్లని నవ్వుతో మొగుడి గురించి వాదిస్తూ మూడు పోటోలూ తనవే!

ఎవరు తీశారు?" ఫోటోలు పరిశీలనగా చూస్తూ అడిగింది మంజీర

బాగున్నాయా లేదా?" అన్నది హైమ

అద్భుతంగా ఉన్నాయి ఎప్పుడు తీశావు?'

నేను కాదు మా అన్నయ్య తీశాడు

ఉట్టి రౌడీ మనిషిలా ఉన్నాడే! చెట్ల చాటు నుంచి గమనించటం దొంగచాటుగా పోటోలు తియ్యటం ఊహల నిండా నువ్వే నంటూ వాపోవటం .

"పోటోలు అద్భుతంగా ఉన్నాయని మెచ్చుకుంటూనే మళ్ళీ ఈ నస దేనికి?

"అతడు తీశాడని నేననుకున్నానా?

బావుంది ఆర్ట్‌ని ఆర్ట్‌గానే గుర్తించాలి గానీ తీసిన వ్యక్తిని బట్టి విలువలు మార్చకూడదు

అన్నట్లు నీలాగే మా అన్నయ్య కూడా అందంగా ఉంటాడు ఇదిగో అతని ఫోటో'

కాంతిగా ఉన్న కళ్ళు నవ్వే పెదవుల మీద నిండైన మీసకట్టు అందమైన ముఖం

చూసీ చూడనట్లు చూసి నాలిముచ్చులా ఉన్నాడు' అన్నది మంజీర

ఎవరూ నాలి ముచ్చులా ఉందీ? అంటూ వచ్చింది శార్వాణి

ప్రణీత్ ఫోటో ఒడుపుగా దాచేసి మిగిలినవి చూపిస్తూ వీటిని చూడత్తయ్యా! నేనే తీశాను మాట మారుస్తూ అన్నది హైమ

'నిజంగా చాలా బాగా తీశావు " అన్నది శార్వాణి వాటిని చూసి

"అమ్మా! నిన్ను కూడా ఓ ఫోటో తియ్యమను " నవ్వును అణచుకుంటూ అన్నది మంజీర

కెమెరా లేదత్తయ్యా! బావ పట్టి కెళ్ళాడు అన్నది హైమ

మనింట్లో ఉందిగా మంజీర మాట పూర్తి కాకుండానే-

'పనుందత్తయ్యా, మళ్ళీ వస్తాను అంటూ పారి పోతున్న హైమని చూసి నవ్వాపుకుంది మంజీర

హైమకు ఫోటోలు తియ్యటం రాదు

మొత్తానికి మంజీరను కలుసు కోవాలనుకున్న ప్రణీత్ కోరిక తీరనేలేదు

పండగెళ్ళంగానే అతనెళ్ళి పోయాడు

(ఇంకా ఉంది)







# నాగుల చవితి




నాగుల చవితినాడు నాగపూజగావించటం మన సాంప్రదాయం దీపావళి తరువాత వచ్చే చవితి నాడు ఈ నాగుల చవితిని మన రాష్ట్రంలోనే గాకుండా యిరుగు పొరుగు రాష్ట్రాల వారు కూడా భక్తి శ్రద్ధలతో జరుపుతారు నాగులకు ప్రతిపాత్రమైన క్షీరాన్ని, కోడిగ్రుడ్లను, నువ్వులు, తెలగపిండి మొదలైన వాటిని పుట్టలలో జారవిడిచి పూజలు జరుపుతారు వేదకాలం నుండి నాగులు మన పూజలను అందుకుంటున్నాయని చెప్పవచ్చును 'శాంతాకారం భుజగశయనం' అంటూ విష్ణు స్తోత్రంలో ఆదిశేషుని పేర్కొనటం జరిగింది

అధర్వణ యజుర్వేదాలలో నాగులను ప్రస్తుతించారు శివ పంచాక్షరిలోనూ, శివాష్టకమ్ లోనూ దేవి స్తోత్రంలోనూ శివాభరణంగా సర్పాన్ని అభివర్ణించటం మనకు తెలిసినదే సుప్రసిద్ధమైన కుండలినీ యోగంలో నాగ యుగ్మం చిత్రాతమై వుంది నాగుల కృపవలన మానవుల కోరికలు ఫలిస్తాయని అనాదిగా మన హిందువుల నమ్మకం నాగ విగ్రహాలకు పూజలు జరిపి ప్రదక్షిణలు జరిపితే సంతానం కలుగుతుందన్న నమ్మకం నేటికీ గాఢంగా ప్రబలి వుంది

కాశ్మీర్, సౌరాష్ట్రలలో నాగులకు ప్రత్యేకంగా దేవాలయాలు వుండటం గమనార్హం పంజాబ్‌లో గల మిరాసీ తెగ ప్రజలు నాగ పూజను విధిగా జరుపుకొంటారు ఆ తెగకు చెందిన ప్రతి గృహంలోను నాగ దేవతల విగ్రహాలు, చిత్రువులు పూజా మందిరంలో వుంటాయి గుజరాత్‌లో కృష్ణ సర్పాన్ని యిలవేల్పుగా భావించి ఆరాధిస్తారు అసలు, ఆర్య సంస్కృతిలో నాగరాజుల సంస్కృతి విలీనమై వుంది ఈ ఆర్య, నాగ సంస్కృతుల సమ్మేళనమే నాగపూజగా పరివర్తనం చెందింది రసాయనిక వేత్తగా విశ్వ విఖ్యాతిగాంచిన ఆచార్య నాగార్జునుడు నాగ వంశస్థుడే ఇక పౌరాణిక కాలానికి వస్తే మహా భారతం కాలంనాటి మయసభను నాగ వంశీయులే నిర్మించారు తక్షశిల మధుర పాతాళాది మహా నగరాలను నిర్మించింది కూడా నాగ వంశీయులే

పౌరాణిక చారిత్రక ప్రాశస్త్యంగల నాగులుకు జలధారలైన మేఘాలపై సాధికారం వుంది ఆ నాగుల ఆశీర్వాదం లభిస్తే సర్వ శుభాలు జరుగుతాయన్న నమ్మకంతో నాగుల చవితి నాడు నాగులును భక్తితో పూజిస్తారు

–శ్రీమతి మీనాప్రసాద్

దీపావళి కథల పోటీలో రు.700/- బహుమతి పొందిన కథ

# బుద్ధుడు పుట్టిన భూమిలో!

## మిట్ట మధ్యాహ్నం!.... మిడిసి పడ్తూ ఉంది ఎండ!!....

మిద్దింటోళ్ళ కోడలు మీనాక్షి! మిద్దింటికే కాదు – ఊరి కంతా ముద్దే! ముద్దబంతిలా ఉంటుంది!



ఇంట్లో చేదబావి ఎండిపోతే వీధి బావి కొచ్చింది. అది గూడ అడుగంటింది. ఆ అడుగంటిన బావిలో చేద విడిచింది. దోర్చిదోర్చి చేరెడు చేరెడుగా చేదుకొనింది. నిండిన బిందెనెత్తి చంకన బెట్టింది. వీధిలో వయ్యారంగా నడుస్తూ ఉంది.




ఎండిన పైర్లకు ఏతా మెత్తిన వాళ్ళు... కోడికి కూత నేర్పి లోతు బావుల్లో ఓర్పును పరీక్షించుకొన్నవాళ్ళు... పదును లేని కయ్యల్లో దొక్కలెండిన దుక్కిటెద్దుల శ్రమను చెమటతో సేద దేర్చిన వాళ్ళూ – కడుపులకంత కవళం వేసుకొందామని యింటి ముఖం పట్టి వీధుల్లో అడుగు పెట్టినారు.

మీనాక్షి నడి వీధిలో నిలబడింది.

ఒక్కసారి చుట్టూ కలయ చూసింది. చంకన బిందెను చేతుల్లోకి తీసుకొనింది. గబగబ నెత్తిన ఖుమ్మరించుకొనింది. సూరీడు కక్కుతున్న నిప్పుల్ని కన్నులో చెరుగుతూ తలను ఒక్క విసురు విసిరింది!

కురులు చెదిరినాయి కుంకుమ చెదిరింది పైట జారింది తడిగుడ్డల్లో సొగసు ఎగసెగసి పడుతూ ఉంటే సుడిగాలిలో చిక్కిన తరువులా సుళ్ళు తిరుగుతూ 'ఒరే నేను ముత్యాలమ్మన్రో!' అని గావుకేక పెట్టింది కేకలేస్తూ పరుగందుకొనింది వీధి వీధి తిరిగింది ఆ తర్వాత ఊరి గెవిన్లో చేరి పోతరాజు గుళ్ళో దూరింది " త్రిశూలాన్ని చేతికందుకొనింది గుడ్లు తేలేసి నాలుకను బయటికి నెట్టి వెనక్కూ ముందుకూ ఊగుతూ 'నన్నే మర్చి పోతారంట్రా?' అని హుంకరించింది

వీధుల్లో అడుగు పెట్టిన రైతులు ఇండ్లలో అమ్మలక్కలు ఊరంతా ఒక్కటై ముత్యాలమ్మ వెంట పడింది 'మా తప్పుల్ని క్షమించు తల్లీ!' అని కర్పూర హారతు లిచ్చింది నిమ్మకాయల్ని దిగదీసింది టెంకాయల్ని దిష్టి తీసి కొట్టింది

ముత్యాలమ్మ తల్లి శాంతించింది!

దేవుడు తలుచుకొంటే దెబ్బలకు కొదవా?

తొప్పెట మీద దెబ్బపడింది ఏడూళ్ళు ఏకమైనాయి

ఆ పాయకట్టులో అప్పుడప్పుడు కలిగినింటి కోడళ్ళ మీద ముత్యాలమ్మ పూనడం కద్దు వెనుకాముందు చూడకుండా ముత్యాలమ్మ తిరణాలు చేయడం వాళ్ళకు ముద్దు!

ఆ రోజు –

ఊరూరుగా కుశాల కుళ్ళాయిల్నెత్తి నెత్తిన బెట్టుకొని ఉత్సాహం ఉరకలు వేస్తుంటే సంబరాల పల్లకీ లెక్కి ఊరేగుతూ 'ఎప్పుడు



## బుద్ధుడు పుట్టిన భూమిలో

పొద్దుకుంకుతుందా? మరెప్పుడు తెల్లారుతుందా?' అని వెయ్యిన్నొక్క కన్నుల్తో ఎదురు చూస్తుంటే 'పొద్దుగూట్లో పడ్తే ఎట్లబ్బా? తెల్లార్తే ఎట్లబ్బా?' అని రాఁవుడు మాత్రం తనలో తాను కుళ్ళుతూ కుములుతూ తుళ్ళి పడబోతున్న కన్నీళ్ళను అతి కష్టం మీద ఆపుకొంటూ నెత్తిన చేతులు పెట్టి కూర్చో లేదు కానీ – తన పని మాత్రం తాను చేసుకొని పోతున్నాడు – యాంత్రికంగా కర్మయోగిలా మౌనంగా'

రాఁవుడు రెడ్డోరింట్లో సేద్యగాడు

రెడ్డోరిల్లు మున్నెడ్డిగారి ఊళ్ళో ఉంది

మున్నెడ్డిగారూరు ఈ దేశంలో నే ఉంది

ఎవ్వడో ఒక మదపిచ్చిగాడు మూతీముక్కూ లేని వంకరటింకర రాతిని చేతికందుకొని కసిదీరా విసిరేస్తే ఆ రాయి ఎక్కడో ఒక మూరు మూల పడింది ఆ రాయి పడిన చోటే మున్నెడ్డిగారూరు'

పడిన రాయి పగిలింది పగిలి చెదిరింది ఒక్కొక్క పలుగు ఎగిరి ఒక్కొక్క చోట పడింది ఆ పలుగులే పల్లెలైనట్లుంది

మున్నెడ్డిగారూరు చుట్టూ ఎంచినట్లు ఏడు పల్లెలున్నాయి

ఆ పల్లెల కన్నిటికీ తల మున్నెడ్డిగారూరు పల్లెల కన్నిటికీ మున్నెడ్డి గారూరు తలైతే మున్నెడ్డిగారూరికి తల తమ్మిరెడ్డి

సదరు తమ్మిరెడ్డిగారిల్లే రెడ్డోరిల్లు

ఆ రెడ్డోరింట్లో సేద్యగాడే రాఁవుడు'

రాఁవుడు రెడ్డోరింటి ముందర పందిరి మీద కూర్చున్నాడు అది ఆర్నెల్ల కిందట ఊళ్ళో బారతోత్సవాలు జరుగుతున్నప్పుడు వేసింది ఆకు గలగల ఎండిపోయింది రాఁవుడు ఆ ఆకునంతా తీసి కింద పారేసినాడు అడ్డకొయల్ని నిలువు వాసాల్ని బాగా సర్ది కట్టాడు పెద్ద తోపులో నుండి నరికి తెచ్చిన నేరేడాకు నవనవలాడుతూ ఉంది రెడ్డోరింట్లో పాచి పనులు చేసే చెంగి, మంగి నేరేడు మండల్ని బాణాల్లా పైకి విసురుతూంటే విసిరిన బాణాల్ని అతి లాఘవంగా పట్టే వీరుడిలా రాఁవుడు మండల్ని అందుకొని పందిరి మీద పరిచినాడు గాలికి ఎగిరి పోకుండా పెండె వేసి కట్టినాడు. ఎండ పొడ కింద పడకుండా అందంగా తయారయింది పందిరి ఒక్కసారి పందిరి వైపు కలయచూసి తృప్తిగా నిట్టూర్చినాడు రాతి కూసాల మీదుగా ఉడతలా కిందికి పాకుతూ పడమటి దిక్కు వైపు చూసినాడు నాలుగు బార్ల పొద్దే ఉంది ఆ నాలుగు బార్ల పొద్దు కుంకితే' , కుంకిన పొద్దు మొలిస్తే!'

రాఁవుడి గుండె గుబిక్కుమనింది'

గుభిక్ మన్న గుండెను గుప్పిట్లో కుదుట పట్టుకొని గడపలకు మామిడి తోరణాలు కట్టినాడు నిలువెత్తు పందిరి రాతి కూసాలకు టెంకాయ మట్టల్ని ఆనించి ఆకుల్ని కూసాల చుట్టూ జడ అల్లినట్లు అల్లుతున్నాడు అల్లుతున్నాడన్న మాటే కానీ వాడి మనస్సు మనస్సులో లేదు

వాడి మనస్సంతా బుజ్జిగాడి మీదే ఉంది

రాఁవుడి మనస్సు బుజ్జిగాడి మీద ఉంటే – ఊరి మనస్సంతా ఆ మరునాడు జరిగే ముత్యాలమ్మ తిరణాల మీదే ఉంది

'పొద్దు గూట్లో పడ్తే ఎట్లబ్బా?' అని కొందరు ఆదరాబాదరా గోడలకు సున్నం కొడుతున్నారు కొందరు యిండ్లు అలికి ముగ్గులు పెడుతున్నారు పెద్ద పెద్ద ముత్తైదులు తీరిగ్గా కూర్చొని ఓపిగ్గా పొంగళ్ళ గంపల్ని అలుకుతున్నారు పడుచుదనం పోటీలు పడ్తూ యిండ్ల ముందర ఆకాశమంత ముగ్గులు వేయాలని ముచ్చట పడ్తూ ఉంది ముష్టికొమ్మల మీద సన్నని యిసుక పోసి కత్తులు నూరేవాళ్ళు నూరుతున్నారు కాగుల్లో కడవల్లో దాచిన పిల్లంగోవుల్ని బయటికి తీసి దుమ్మూధూళీ దులిపి నూనె రాసే వాళ్ళు రాస్తున్నారు – నిగనిగలాడించాలని' కోలాటం పుల్లలు చెక్కుకొనే వాళ్ళు చెక్కుకొంటున్నారు ఆ మరుసటి రోజు పనీపాట లేకుండా ముత్యాలమ్మ తిరణాల్లో మునిగితేలాలని కొందరు పొలాల్లో వంచిన నడుపు ఎత్తకుండా పనీపాటా చేసుకొంటున్నారు

ఆ మరుసటి రోజు ముత్యాలమ్మకు పొంగళ్ళు పెట్టడానికి మున్నెడ్డి గారూరు మంచి ముహూర్తం మీద ఉంది

ఊరికి పడమరగా ఒక బోడిగుట్ట చెట్టూ చేమా లేకుండా చిన్న చిన్న రాళ్ళు రప్పలతో బుడపలు తేలిన బట్టతల మాదిర ఉంటుంది అందుకే దానిని బోడి గుట్ట అంటారు ఆ గుట్ట కిందుగా ఊరికి నైరుతీ మూలంగా చుట్టుపక్కల పల్లెల కన్నిటికీ అందుబాటుగా ముత్యాలమ్మ గుడి ఉంది

ఒక వేప చెట్టు, ఇంకొక రాగి చెట్టు, ఒక దాన్నొకటి పెనవేసుకొన్నాయి ఎంతో గాఢంగా ఎంత కాలమయిందో ఏమో కానీ ఒక దాని కౌగిట్లో యింకొకటి తాదాత్మ్యం చెందినట్లు కలిసి పోయినాయి ఆ చెట్టు చుట్టూ మొండి గోడలు ఆ చెట్ల బోదెల కింద ముత్యాలమ్మ వెలిసింది

ఆ ముత్యాలమ్మ తల్లికి ముక్కు మీద కోపం'

తల్లికి కోప మొస్తే ఆ తల్లి వినయ విధేయతలు కలిగిన భారతనారీమణి అయితే' – ఆ కోపాన్ని ఎవరి మీద చూపిస్తుంది? పిల్లల మీద చూపిస్తుంది

ముత్యాలమ్మ తల్లికి ఆ పల్లెల్లో ప్రజలు బిడ్డలు అందుకే కోపం వస్తే ఆమె బిడ్డల మీద పడుతుంది పడటమంటే అట్లా యిట్లా కాదు విరుచుక పడుతుంది ఆ దెబ్బతో కొందరికి జ్వరాలు కొందరికి వాతీ బేదులు కొందరికి పూనకాలు గొడ్లూ గోదకు రోగాలు' అంతే కాదు చినుకు నేల రాలదు

ఈ యేడు కూడా ముత్యాలమ్మ తల్లికి కోపం వచ్చింది

ముత్యాలమ్మ తల్లికి కోపం వస్తే తమ్మిరెడ్డికి కాలం కలిసి వస్తుంది

'ఓట్లు' తిరుణాల్లో ఏకులానికాకులంగా చీలి

పోయిన పల్లెల్ని ఏకతాటి మీద నడిపించడానికి ముత్యాలమ్మ తిరణాల ఒక అవకాశమైతే అట్లాంటి అవసర మొచ్చినప్పుడంతా మీనాక్షి చాలా తెలివిగా ఆదుకొంటూ ఉంటుంది.

తమ్మిరెడ్డికి రాజకీయం తెలియదు.

అయితే ముత్యాలమ్మ తిరణాల్ని మత పరమైన రాజకీయంగా చేసి ఆ ఏడు పల్లెల్ని ఎదురు లేకుండా ఏలుకొంటున్నాడు.

తమ్మిరెడ్డి తల, అవయవాలు ఆ పాయకట్టులో ప్రజలు. తల ఔనంటే శరీరంలోని అవయవాలు ఔఔ!' నంటాయి.

ఆ యేడు ముత్యాలమ్మ తిరణాలు జరిపించ డానికి ఆ పాయకట్టు ఉరుకులు పరుగులందు కొనింది. ఆ తిరణాల్ని పల్లెలన్నీ కలిసి కట్టుగా నిర్వహించినా అంతర్యంలో మాత్రం పోటీ ఉంటుంది. వేడుకల్లో ఒక పల్లెను మించాలని యింకొక పల్లె తాపత్రయ పడుతుంది. ఆ సమయాల్లో పిల్లా జల్లా, ముసలీ ముతక వయోభేదాలు మరిచి పోతారు. కక్షలు కార్పణ్యాల్ని విడిచి పెడతారు. అందరూ ఒక్క తాటి మీద నడిచి ముత్యాలమ్మ తిరణాలు ఎంత ఘనంగా జరిపిస్తే తమ బతుకులంత బాగు పడ్తాయని నమ్ముతారు.

అందుకే ముత్యాలమ్మ తిరణాల చూడ ముచ్చటగా ఉంటుంది.

ముత్యాలమ్మ తిరణాల నాటికి ఒక్కొక్క పల్లె ఎలబారుతుంది రంగరంగ వైభవంగా – సంప్రదాయాల గంపల నిండుకు ఆనందాల్ని నింపి నెత్తికెత్తుకొని!

ఇంటి కొక్క పెద్ద ముత్తైదు. ఉంటే పెండ్లినాటి నారపట్టు చీరను, లేకుంటే – మడివేలు మునెయ్య ఎరవలిగా యిచ్చిన సాదా సీదా చీరను సింగారించు కొంటారు. ఎండకు ఎండి వానకు తడిసి రాగి రంగులో కంపదేలిన తలకు చేరడు వేరుశెనక్కాయ నూనె పులుము కొంటారు. చెక్కుడు పారతో కసువు చెక్కినట్లు చెక్క దువ్వెనతో చెక్కుతారు. దాని పేరే తల దువ్వడం. దువ్విన తల్లో వెంట్రుకలు ఊరుచూడమంటే ఉత్తరం చూసినట్లు దిక్కులు చూస్తుంటే అతి కష్టం మీద వాటిని ఒక దారికి తెస్తే వెంట్రుకలున్నమ్మకు ముంతంత కొప్పు అవుతుంది. లేని తల్లికి చన్నీళ్ళకు వేన్నీళ్ళుగా సవరం జత చేరిస్తే బిసాడీ అవుతుంది. ఆ కొప్పుల్ని బిసాడీలను బంతులో చామంతులో అలంకరిస్తాయి.

అప్పుడు పొంగలి గంపలు నెత్తినెక్కుతాయి!

ఇంటికొక్క పొంగలి గంపగా రచ్చబండ దగ్గర చేరి అక్కడ నుండి ఊరూరుగా ఎల్లబారి గెవిన్లో పోతరాజు గుడి కాడి కొచ్చేకుందికి డప్పులు మోగుతుంటాయి. పిల్ల ఏనుగులు తొండాలెత్తి ఘీంకరించినట్లు కొమ్ములు డప్పుల దరువుకు ఊపు నిస్తుంటాయి. పంబలు పలుకుతుంటాయి. కోలాటం మంచి కోపు మీద ఉంటుంది. వీటన్నిటికీ పిల్లనగ్రోవులు పల్లవి పాడుతుంటాయి. డప్పులు, కొమ్ములు, కోలాటం, పంబలు, పిల్లనగ్రోవులు కలగలిసిన చిత్రమైన గోల మంచి ఊపు మీద ముందుగా సాగి పోతూంటే పొంగళ్ళ గంపలు వెంట నడుస్తుంటాయి.

ఆ గుంపును చూస్తుంటే ఒక జానపద చిత్ర కారుడు పనిగట్టుకొని చిత్రించిన జానపద చిత్రం ఊపిరి పోసుకొని ఊరేగుతున్నట్లుంది.

అడుగు మీద అడుగ్గా అర మోడ్పు కన్నులతో మెల్లగా ముందుకు సాగిపోతున్న పొంగలి గంపల్లో భక్తి భావం పొంగి పొరలుతూ ఉంటుంది.

పల్లె వెనుక పల్లెగా ముత్యాలమ్మ గుడికి సాగి పోతూంటే–

"ఒరే! మా వూరివి యిరవై డప్పులు.... పది కొమ్ములు.... రెండు జతల పంబలు.... ఆరుజతల గెగ్గిరెట్లు.... రెండు జట్లు కోలాటలు–" అని ఒకపిల్లోడు రొమ్ము విరిస్తే–

"బోడి మీదేవుండాది? మావూరివి ముప్పై పలకలు.... యిరవై కొమ్ములు.... పది జతల గెగ్గిరెట్లు.... ఆరు పిల్లం గట్టిలు.... మూడు జతల కోలాటాలు– దుమ్ములేసి పోతావుండాది. కావాలంటె పోయ్ సూస్కో పోరా!" అని యింకొకడు మొలక మీసాన్ని మెలితిప్పుతాడు.

"ఒరే మీకత లాడికి నిలెపండ్రా! ఏంవుండి ఏంవిలేక పాయ్‌నా ఏలపదం లేక పోతే మేళం లేని పెండ్లేకదరా? మా వూళ్లో కుచ్చేలుగాడేసే పాయాలపదాలను బోండ్రా!" అంటూ యింకొక బుడంకాయంత బుల్లోడు ధీమాగా భుజం మీది తుండు గుడ్డను తీసి సుంగు విడిచి తలపాగా చుట్టుతాడు.

వీటన్నిటికీ వెనుగ్గా మెడల్లో పూలు.... నొసట్న పసుపు కుంకుమ బొట్టులతో కండబట్టిన పొట్టేళ్ళు మేక పోతులు యమ పాశాల్లాంటి మెడతాళ్ళు ముందుకు లాగుతూంటే మందంగా ముందుకు నడుస్తూంటాయి. మొండి కేస్తున్న పిరికి జీవాలకు మూరెడు దూరంలో పిడికెడు పచ్చి కసువును చూపిస్తూ లౌక్యంగా ముందుకు నడిపిస్తుంటారు వొళుపూ వాటం తెలిసిన మొనగాళ్ళు!

"ఓ యబ్బ! యిన్ని తలల్ని నరకాల్నే! కత్తి పదును సరిపోతుందా? లేదా?" అని మాటి మాటికి కత్తి వాదర తడిమి చూసుకొంటుంటాడు మడివేలు మునెయ్య.

పొద్దు తిరుగుతూంటే ఎలబారిన పొంగళ్ళు నాలుగు బార్ల పొద్దు ఉండనంగా ముత్యాలమ్మ మిట్ట చేరుకొంటాయి.

వాటారిన పొద్దులో ముత్యాలమ్మ మిట్ట ముద్దుగా కనిపిస్తూ ఉంటుంది.

ఇంటి కొక్క పొంగలి.... ఇంటి కొక్క మేక పోతో పొట్టేలో బలి.... ముత్యాలమ్మ కోపం చల్లారిపోతుంది. అయితే కోపం చల్లారిన ముత్యాలమ్మ తల్లి ఎప్పుడైనా ఆ పాయకట్టులో కాలే కడుపుల్ని చల్లార్చిందా? లేదా? అని ఆలోచించే అవసరం కలగ లేదా పాయకట్టుకు!–

అందుకే ఎవడైనా ముక్క మూలిగితే.... ఆ మూలుగు జ్వరమైతే.... ఆ జ్వరం నాలుగిండ్లకు పాకితే.... గొడ్డూ గోదా తిరుగులేని రోగాల్తో 'హరీ!' మంటే.... ఉరిమిన మేఘం కురవకపోతే – మిద్దింటి మీనాక్షి మీదనో కలిగినింటి కామాక్షి మీదనో ముత్యాలమ్మ పూనాల్సిందే! పొంగళ్ళు పెట్టాల్సిందే!–

ఆ మర్నాడు పొంగళ్ళు పెట్టడానికి ఏ పల్లె కాపల్లె ఎంతో సంబరంగా 'ఎప్పుడు పొద్దుకుంకుతుందా? యింకెప్పుడు తెల్లార్తుందా? అని ఎంతో ఆశగా ఎదురు చూస్తుంటే రాంవుడు మాత్రం పొద్దుకుంకితే ఎట్లబ్బా? కుంకిన పొద్దు మొలిస్తే ఎట్లబ్బా? అని తనలో తాను తపించి పోతున్నాడు.

రాంవుడు తపించి పోతున్నాడు!

ఊళ్ళో వాళ్ళు ఉలికులికి పడుతున్నారు!!

ఇదంతా పట్టించుకోని పొద్దు గూట్లో పడింది.

రాంవుడి గుండెల్లో రాయి పడింది!

పగలంతా ఎక్కడెక్కడో తిరిగి పిలవని



పేరంటంగా ఆ ఊరి మింద పడిన కాకులు ఆ ఆనందోత్సవాల్లో మాకూ భాగముందన్నట్లుగా రంపు చేస్తున్నాయి అభము శుభము ఎరుగని ఎవడో ఒక పసిగుడ్డు చేతి కందిన పిడికెడు తెల్లకాగితాల్ని పీలికలు చీలికలుగా చింపి ఎగరేస్తే అవి గాలి కెగురు తున్నట్లు కొంగల గుంపులు ఊరిముందర చింత చెట్లకు ప్రదక్షిణం చేస్తున్నాయి- రోగి పడక చుట్టూ ఆదరా బాదరా తిరుగుతున్న నర్సుల్లా! ఇంటింటా ముగ్గుల ముందర హరి విల్లులా వంగిన పడుచుదనం కన్నులు దించుకొంటూ వేగాన్ని పుంజుకొంటూ ఉంది లాంతర్లు, కోడిగుడ్డు బుడ్డి కరసనాయిలు దీపాలు వొళ్ళంతా సున్నం పట్టించుకొని స్నానాలు చేస్తున్నాయి కనుచీకటి పడుతున్నా పొలాల్లో మోట తోలుతున్న రైతుల రాగాలు తీలగా వినిపిస్తున్నాయి పనిఉన్నా లేకున్నా అటున్నా వాళ్ళిటు' యిటున్నవాళ్ళటు కుట్ట మునిగినట్లు తిరుగుతుంటే మరునాట తిరునాళ్ళ జోరు వాళ్ళ మొగాల్లో మొలకలేస్తూ ఉంది

ఉన్న వాళ్ల యిండ్ల వసారాల్లో లాంతర్లు వెలిగినాయి నట్టింట్లలో నూనె దీపాలు అందమైన జడల్లో పువ్వుల్లా వెలుగుతున్నాయి

పాత రైలు పెట్టెలాంటి పూరి కొంపల్లో కోడిగుడ్డు బుడ్డీ దీపాలు మినీ రైలు పొగల్ని కక్కుతూ ఆ బతుకుల్లో ఆ మాత్రం వెలుగు నింపడానిక్కూడా ఆయాస పడుతున్నాయి

ఈ దెబ్బతోనే ఊరి మీద దండెత్తిన చీకటి తోక ముడిచింది

అయితే రాంవుడి గుండెల్లో చేరి తోక రూడించింది

ఇంకొకప్పుడైతే ముచ్చట పడి ముస్తాబు చేసిన పెండ్లి కూతురులా తయారైన రెడ్డోరింటిని తేరిపార చూసి 'అదంతా తన పనితనమే!' అని మురిసి పొయ్యేవాడు రాంవుడు కానీ ఈపూట వాడి మనస్సులో మనస్సు లేదు మనస్సంతా బుజ్జిగాడి మీదే ఉంది

బుజ్జిగాణ్ణి తలుచుకొంటే రాంవుడి గుండెల్లో గునపాలు ఉంచినట్లవుతూంది

## లోకరీతి

ఆవుపాలు అమ్మాలా?
కావిడి భుజాన్నేసుకో
అరుస్తూ ఇంటింటికి తిరుగు!
కాపు సారా అమ్మాలా?
కాలు మీద కాలేసుకో
నీ చుట్టూ లోకం తిరుగు!

—పెయ్యేటి రంగారావు

# బుద్ధుడు పుట్టిన భూమిలో

అవును! బుజ్జిగాణ్ణి తప్పిస్తే తన కెవరున్నారు? పుట్టుకతోనే తల్లి పోయింది నడక నేర్పించకనే నాయన పోయినాడు పోతూ పోతూ వాళ్ళు మిగిలించిన తోడూ లేదు జానెడు బీడూ లేదు ఆకలెరిగి ఏ తల్లి అన్ని పాలు పట్టిందో, కడుపు చూసి ఏ చల్లని తల్లి అంత తిండి పెట్టిందో! తనకు బాగా బుద్ధి తెలిసే నాటికి తాను రెడ్డోరింట్లో ఉన్నాడు

కొంత కాలం రెడ్డోరి గేదెలతో ఊరి గేదెల్ని కూడ జత చేర్చి వాటి తోక పట్టుకొని తిరుగుతూ మేపినాడు కురుకురు మీసం వచ్చి రాకముందే రెడ్డోరి ఆవుల్ని తోలుకొని పరవ గుట్టకు ఊపు మింద ఎలబార్నాడు వాడి చూపూ, ఊపూ చూసిన పడుచుదనం 'రెడ్డోరి సేద్యగాడా! మేథైన మొనగాడా!!' అని వగలు పడుతూ కూనిరాగాలు తీస్తే వెలక్కాయంత గుండె గుమ్మడి కాయంత అవుతూంటే ముసి ముసిగా నవ్వుకొన్నాడు

అట్లాంటి సమయాల్లో రాంవుడి బుల్లి బుర్రలో బాన మీద బాన కుమ్మరించినట్లు ఆలోచనలు దొర్లిపొయ్యేవి!

తన అమ్మ అందంగా ఉండి ఉంటుంది అయ్య కూడా మెలితిరిగిన కండలతో మొగలాయిలా ఉండి ఉంటాడు అందుకే తనకు అమ్మ అందము అయ్యకండలు వచ్చి ఉంటాయి ఈ కండల్ని చూసే కదా రెడ్డోరింట్లో అంత తావిచ్చినారు ఆ తావే దొరక్కపొయ్యుంటే . తన బతుకు గాలికి కొట్టకపోయ్యే పుల్లాకే అయ్యేది పోనీలే! అమ్మ అయ్య ఏ మిచ్చి ఏమివ్వకపోయినా కష్టపడే దానికి కండలైనా యిచ్చినారు లేకుంటే రెడ్డోరింట్లో తావు దొరకడమంటే మాట్లా? పూర్వజన్మలో చేసుకొన్న పుణ్యమే ఈ జన్మలో యిట్లా ఆదుకొంటా ఉండాదేమో?

ఇట్లా ఆలోచిస్తా ఉంటే రాంవుడికి ఎంతో తృప్తిగా ఉంటుంది.

రెడ్డీ మనిషే! రెడ్డి కొడుకులూ మనుషులే! వాళ్ళంతా మల్లెపువ్వుల్లాంటి బట్టలు తొడుక్కొని మట్టి చేతి కంటకుండా తిరగతా ఉండే తానెందుకు కయ్యా కాలవల్లో బురదంతా పూసుకోవాలి?' అని వాడు యోచించలేదు ఇల్లూ వాకిలీ లేదని, భూమీ పుట్రా లేదని వాడెప్పుడూ వాపోలేదు ఎప్పుడైనా ఎగతాళిగా తమ్మిరెడ్డి 'యిల్లు లేకపోతే పొయ్యింది యిల్లాలైనా వుండాలి కదరా?' అని అంటే – ఆ పీకులాట నాకెందుకులేయ్యా? తగిలించుకోని తన కలాడ్తా వుండే వోళ్ళని సూస్తానే వుండా గదా? ఈ బతుకిట్లా గడిస్తే సాల్దా? అని మాట మార్చే వాడు

రెడ్డోరింట్లో ఒక మంద గొర్రెలున్నాయి ఒక మంద మేకలున్నాయి పది పన్నెండు బర్రె గొడ్లున్నాయి ఇంకొక మంద ఆవులున్నాయి

పాడి కోసరం గాదు రెడ్డిగారిన్ని జీవాల్ని బరిస్తూ ఉండేది- పొలాల సత్తువ కోసరం దుక్కిదున్నిన కయ్యల్లో ఈ జీవాల్ని మందలుగా తోలేస్తే రాత్రి పూట అవి విసర్జించే మలమూత్రాలే కయ్యలకు ఎరువు అయితే ఈ మధ్య వాన చినుకు నేలరాల్లేదు జీవాలకు మేపు చాలడం లేదు ఆ నోరులేని జీవాలు 'బేర్ బేర్' మని అరుస్తూంటే రెడ్డిగారి కడుపులో చెయ్యేసి దేవినట్లయ్యేది 'ఎట్లబ్బా యిన్ని జీవాల్ని ఈ కరువు కాలంలో బరించేది?' అని మలగులాలు పడ్తాఉంటే- 'మాంవా! మణుసుల రోగాలకు మొందులు కనిపెట్టినట్లే, మనకయ్యలకు, కయ్యల్లో పైర్లకు మొందులొచ్చేసినాయే! గోతాలగ్గోతాలమ్మతా వుండారు మొన్న సిలమాకు పొయ్యుండి సితూర్లో సూసి! అని అన్నాడొక చిన్నోడు

తమ్మిరెడ్డికి చిన్నోడి మాట మీద చింతాకంత సందేహం లేదు

అందుకే వెనకాముందు చూడకుండా గొర్రె మందను మేకల మందను కటిక రంగడోళ్ళకు తగల కట్నాడు బర్రెగొడ్ల పీడ వదిలించు కొన్నాడు ఆవుల్ని మాత్రం అపురూపంగా చూసుకొంటే చాలను కొన్నాడు- ఇంటి పాడికి!- కోడెదూడలు కాడికి!!- కావాలి కదా అని

అప్పుడు బుజ్జిగాడు రాంవుడి పాలబడినాడు

ఒక గొర్రె, సూటుది ఈ పొద్దో రేపో యీనేటట్లుగా ఉంది ఏ పళాన్నో ఏంవో? నాంవెక్కిన జొన్న కర్రను కొరికింది అంతే! దినం మారకనే ఉబ్బిన పొట్ట మరీ ఉబ్బింది ముచ్చటగా మూడు పిల్లల్ని నేల మీద పడేసి అది కన్ను మూసింది నాంవెక్కిన జొన్న కర్ర విషం కంటే మరీ



భయంకరమయింది దాని ప్రభావం కడుపులో పిల్లలక్కూడా సోకి నట్టుంది పుట్టి నేల మీద పడ్డూనే రెండు గుట్టెక్కి పోతే ఒక్కటి మాత్రం గండం గడిచి గట్టెక్కింది

ఆ గొర్రె పిల్లను చేతికందు కొన్నాడు రావుడు!

ముఖాన ముచ్చటగా చిన్న తమలపాకంత మచ్చ పొడుగాటి చెవులు వొళ్ళంతా లేత గోధుమ రంగు మోకాళ్ళ కింది నుండి మాత్రం ముదురు గోధుమరంగు మిల మిలా మెరుస్తూ నీలాలు పారే కండ్లూ బుజ్జితోక- పెంటిదో? పోతో? చూసినాడు పోతే! మగపుట్ట కంటే వాడి క్కూడా మోజుగా ఉంది చిరునవ్వు పెదవుల మీద విరిసింది

ఉన్ని దుస్తుల్లో చక్కగా ప్యాక్ చేసిన బిరియానీ పొట్లంలా ఉందది!

'నాబుజ్జీ!' అంటూ రావుడు దాన్ని గుండెలకు హత్తుకొన్నాడు

గుండెల మీద మెత్తగా అరమోడ్పు కన్నుల్తో అమాయకంగా కొమ్మకు హత్తుకొన్న ఉడతలా- హత్తుకొన్న బుజ్జిగాణ్ణి చూస్తుంటే రావుడి మనస్సు పరిపరి విధాల పోయింది

ఇట్లానే నన్ను గూడా నా తల్లి కని పారేసి కన్ను మూసుంటుంది అప్పుడు అయ్య యయినా నాకు తోడున్నాడు నా బుజ్జి కెవరుండారు? ఏదో ఒక మదపిచ్చిది మోజు తీర్చుకుంటే నా కర్మ కాలినట్టే దీని కర్మాకాలింది '

రావుడి గుండె కదిలింది కరిగింది భారంగా నిట్టూర్చింది!

'ఒరే బుజ్జీ! యింగ మిందట నేన్నీకు! నువ్వు నాకురా! ఏమంటావ్?' అన్నాడు రావుడు గోముగా

'మ్మెమ్మెమ్మే!' అనింది బుజ్జి

"ఒరే పిచ్చి నాయాలా! అప్పుడే మాట్లాడేది కూడా నేర్చుకున్నావు కదరో" అంటూ రావుడు ముసి ముసిగా నవ్వినాడు

ఆ రోజు నుండి తొక్కని గడప లేదంటూ తొక్కినాడు ఏయింట్లో అయినా సరే! పాలిచ్చే గొర్రె కంటపడ్తే చాలు వెనుకాళ్ళకు బంధమేసి బుజ్జిగాడికి చన్నుకుడిపించినాడు తాను తినే సంకట్ని చిన్న చిన్న ముద్దలుగా చేసి తినిపించినాడు తాను తాగే నీళ్ళు తాగిపించినాడు పడ్డూ లేస్తూనే అది తెపురుకొనింది నాలుగు పచ్చి కసువు పోసల్ని కొరికింది

రావుడి ఆనందానికి మేరలేదు

ఆరోజు నుండి ఈ రోజు దాకా కడుపున పుట్టిన బిడ్డ మాదిర కంటికి రెప్ప మాదిర నీడలో నీడగా తోడుకు తోడుగా బుజ్జిగాడే తానుగా . తానే బుజ్జిగాడుగా బతికినాడు! .

బతికితే యిప్పుడేమయింది?- ఏమవుతుందో తలుచుకొంటే రావుడి మనసు విరిగింది మతి చెడింది మొదలు నరికిన తరువులా తనువు కుప్పగా కొట్టంలో కూలింది 'పొద్దు కుంకితే ఎట్టబ్బా అనుకొంటే పొద్దు కుంకనే కుంకింది తెల్లార్తే ఎట్టబ్బా అనుకుంటే తెల్లారిపోతుంది తెల్లారిపోతే

## శ్రమైక్య జీవనం

కార్మికుడో, కర్షకుడో, సైనికుడో!
నవభారత నిర్మాణానికి
ప్రతి పౌరుడూ నిర్విరామ శ్రామికుడే!
శ్రమ శక్తికి లేదు ఎదురు
లేదు కులమతాల నదురు బెదురు
జాతికి నవచైతన్యం శ్రమైక్య జీవనం
చిందించాలి స్వేదబిందువులు
సమన్వయించాలి అమృత భాండమ్ములు!

—యం. మధు

## బుద్ధుడు పుట్టిన భూమిలో

ఎట్టబ్బా? అనుకొంటూ కాళ్లొత్తి కడుపులో పెట్టుకొని ముడుక్కొన్నాడు రావుడు

జాము రాత్రి కావస్తూ ఉంది

"ఏఎ రావుడూ? ఊరంతా ఒక దారైతే ఉలిపి కట్టెదొక దారన్నట్టుంది గదరో యవ్వారం ఒంటి మింద గుడ్డ నిలవకుండా ఊరుఊరంతా ఊరేగతా వుంటే నువ్వేందిరా మూలకు పోయ్ ముడుక్కున్నావ్? లెయ్‌రా లెయ్ లేసి అంత తినేసి పోయ్ పాణుకోరా అంతగా అల్సిపుల్సిపొయ్యుంటే! అని రెడ్డెమ్మ రాగాలు తీసింది

ఉన్నట్టుండి మోయలేనంత బరువు నెత్తిన పడ్తే అనుకోనట్టుగా నడువులు విరిగిపోతే లేవలేనంత బరువుగా లేచినాడు రెడ్డెమ్మ మర్నాడు ముత్యాలమ్మకు పెద్దారంటే ఆ పూట గంగమ్మకు పెట్టింది రావుడికి నాలుగు కూరల్తో కూడు వడ్డించింది

రావుడికి ముద్ద మింగుడు పడలేదు

కోడి కెలికినట్టు కెలుకుతున్నాడు

గమనించింది రెడ్డెమ్మ!

'ఆ కోడి కెలుకుళ్ళేందిరా రావుడూ? అవున్లే! రెండు పూట్లన్నా కడుపెండగట్టకపోతే రేపు పాటేలి తునకల్తో ఈవారిడి ఆ వారిడి లాగించేదెట్లా?'

రావుడి పంటి కింద కంది గింజంత రాయిపడింది

"ఈ పొద్దు కందిగింజంత రాయి రేపు బుజ్జిగాడి ఎంవిక!' రావుడి వొళ్ళు జలదరించింది

ఆకలి చచ్చిపోయింది ఎంత ప్రయత్నించినా ముద్ద మింగుడు పడలేదు అటు యిటు చూసినాడు రెడ్డెమ్మ యింట్లో వుంది తటాలున తింటున్న ఆకును రెండు చేతుల్తో జవురుకొన్నాడు నేరుగా బుజ్జిగాడి దగ్గరకు నడిచినాడు ఆకును దాని మూతి ముందర పెట్టాడు అది రావుడి మొగాన్ని పరిశీలించి చూసింది ఆ తర్వాత ఆకు వైపు చూసింది ఆ తర్వాత ఏదో అర్థమయినట్టుగా విదిలించి కొట్టింది

రావుడి కండ్లల్లో గిర్రున నీళ్ళు తిరిగినాయి

గిరక్కున వెనక్కు తిరిగినాడు వీధి వాకిట్లో ఆకును విసిరేసినాడు వీధి కుక్కలు ఆ కూటి కోసం కొట్లాడుకొంటున్నాయి

రావుడు యింట్లో అడుగుపెట్టేటప్పటికి రెడ్డెమ్మగుండు చెంబు నీళ్ళు చేత పట్టుకొని నిలబడి ఉంది రెడ్డెమ్మ నీళ్ళు పోసింది రావుడు చేతులు కడుగుకొన్నాడు కడిగిన చేతుల్ని దోసిలిపట్టి రెడ్డెమ్మ పోసిన నీళ్లతో కడుపు నింపుకొన్నాడు మారు మాట్లాడకుండా వెళ్లి పడుకున్నాడు

పడుకొన్నాడే కాని కంటిమీద రెప్ప పడలేదు

అటు పొర్లతాడు యిటు పొర్లతాడు కాసేపు కాళ్లొత్తి కడుపు పెట్టుకుని ముడుక్కొంటాడు ఎంత ప్రయత్నించినా నిద్ర మాత్రం దరిదాపులకు రానంటూ ఉంది బుజ్జిగాడి మీది ఆలోచనలు దూరం కానంటూ వున్నాయి

దాదాపు అర్థరాత్రి కావస్తూ ఉంది తిరణాల హడావిడిలో అలసిసొలసిన ఊరు గురకపెడుతూ వుంది ఎక్కడో ఒక తీతువు భీకరంగా అరుస్తూ వుంది ముత్యాలమ్మగుడి పందిరి కింద అలంకరించిన పువ్వుల్లా ఆకాశంలో నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి

రావుడు లేచి కూర్చున్నాడు

గుండెల సుడిగుండంలో బండ పడినట్టయింది అలలు అలలుగా ఆలోచనలు!

సగం రేత్రి గడ్సిపొయ్యింది ఇంక సగం రేత్రి గడ్సిపోతే తెల్లారిపోతుంది తెల్లార్తే పొద్దు మొలుస్తుంది మొల్సిన పొద్దు నడిమిట్టకొస్తే నడిమిట్టకొచ్చిన పొద్దు వాటార్తే - బుజ్జిగాణ్ణి ముత్తేలమ్మకు బలిచేస్తారు "

రావుడి గుండె చేతికి చిక్కిన పిచ్చుక మాదిరి విలవిలలాడింది

అయినా ఏం చేస్తాడు? ఏడాదిగా బుజ్జిగాడి మమతను సొంతం చేసుకోగలిగినవాడే కాని బుజ్జిగాడు సొంతంకాడు కదా?-

పిడికెడు కసువు దాని నోటికందించినపుడే వాడికి తెలుసు - ఆ కసువు కందగా మారుతుందని! పంటికింద పడుతుందని!- అయినా ఈ పూట వాడా ఊహనే భరించలేకుండా ఉన్నాడు

ఎట్లా భరిస్తాడు?

అది ఒకనాటి అనుబంధం కాదు మరిచిపోవడానికి?- ఒకనాటి అనుబంధంకాదు తెంపితే తెగిపొయ్యేదానికి! అది ఏడాది అనుబంధం!

తనకొక ముద్దుల మేనకోడలంటూ ఉండే ఆ పిల్ల దానికి ముక్కుకు ముక్కెర, కాళ్ళకు గజ్జెల పట్టెడ

నడుంకు వడ్డాణం కోరి కోరి కొని పెట్టినట్టుగా రావుడు బుజ్జిగాడికి మెడకు గజ్జెలపట్టెడ . నడువుకు వెంట్రుక దారం కొమ్ములకు గజ్జెల ఉంగరాలు మోజుతీరా తగిలించాడు గజ్జలగుర్రం కదను తొక్కినట్టు అది నడుస్తుంటే తృప్తిగా మీసం మెలేసేవాడు!

బుజ్జిగాడుకూడా ఒక్క క్షణం రావుణ్ని వదలి వుండేదికాదు వాడు మోట కట్టేదానికి తొలి కోడి కూతతో లేస్తే అది కూడా ఎవరోతట్టి లేపినట్టు లేచేది వాడు ఎలబార్తే అది వెంటపడేది వాడు పదం పాడుతూ కపిల తోలుతూ ఉంటే అది ఘుంగాళ్లు ముందు చాపి ఆ కాళ్లమీద తలను .

మోపి ఆలకిసూ్త పడుకొనేది 'బుజ్జీ! ఆపారట్టా అందుకోరా!' అంటే అతి చాకచక్యంగా కొమ్ముకు తగించుకొని తెచ్చేది

ఎప్పుడైనా సరె రా(వుడు సంకటిముద్ద చేతిలో పెట్టుకుంటే తొలి కవళం తనకు పెడ్తేనే కానీ తిననిచ్చేదికాదు

ఇంతెందుకు? ఒక రోజు రాత్రి, రా(వుడు మందకాడ కావలి పడుకొని ఉన్నాడు బుజ్జిగాడు పక్కలోనే ముడుక్కొని ఉన్నాడు ఉన్నట్టుండి సగం రాత్రికాడ రా(వుణ్ణి డొక్కల్లో ఒక్క కుమ్ము కుమ్మింది అదిరిపడినాడు రా(వుడు

'ఏ(వి దీనికొచ్చిన రోగం!' అని అంటూ ఎగిరిపడిలేచాడు బారెడు పొడుగు నాగుపాము నాలుగు బార్ల దూరంలో పడగవిప్పి ఆడుతూ వుంది గొర్రెలూ, మేకలూ బిత్తరపడి అరుస్తున్నాయి! రా(వుడికి కాలూ చెయ్యీ ఆడలేదు కదలి మెదలకుండా ఊపిరి బిగబట్టి అట్లానే చూసూ్త చేతులు జోడించాడు పాము తన దారిన తాను వెళ్ళిపోయింది!

అయినా రా(వుడికి అదురు తగ్గలేదు ఆ మరునాడు వాడికి జ్వరం కూడా తగిలింది పైకి లేవలేక వాడు కొట్టంలో పడకేస్తె బుజ్జి వాడి పక్కనే ముడుక్కొనింది

రా(వుడు లేచి తిరిగేదాకా అది కసువు పోచ కొరికుంటే ఒట్టు!

అట్లాంటి బుజ్జిగాణ్ణి ముత్యాలమ్మకు బలిచ్చేస్తారు

ఈల్లేదు! బలిచ్చేదానికిల్లేదు! - అనలేదు కానీ అనుకొన్నాడు

చివుక్కున పైకి లేచినాడు రా(వుడు చరచరా బుజ్జిగాడి దగ్గరకి నడిచినాడు రా(వుడి రాకను గమనించి అది ఎగిరిపడి లేచింది

రా(వుడు బుజ్జిగాడి పగ్గాన్ని విప్పి చేత పట్టుకొన్నాడు అది వాడి వైపు అయోమయంగా చూస్తూఉంది వాడదేమీ గమనించే స్థితిలో లేడు అడుగుమీద అడుగ్గా యిల్లు దాటి వీధిన పడినాడు కుక్కలు పసికట్టాయి మొరగడానికి మోరలు పైకెత్తి రా(వుడని గమనించి అవి కూడా తోకాడిసూ్త తప్పుకొంటున్నాయి కన్ను పొడుచుకున్నా కనిపించని చీకటి ఆ చీకట్లో రా(వుడిది నడక బుజ్జిగాడిది పరుగు!

రా(వుడు నడక పరుగ్గా నడిచి నడిచి పరవగుట్ట దరిదాపులకు చేరుకొన్నాడు ఇంక నడవలేనన్నట్టుగా అక్కడ చతికిలపడినాడు కోడి కూసేవేళ అయినట్టుంది రా(వుడు కూర్చునేసరికి బుజ్జిగాడు వాడి పైనబడినట్టుగా ముదిగారంగా మూతిలో మూతి పెట్టి 'ఏంటిదంతా?' అని అడిగినట్టుండే రా(వుడు రెండు చేతుల్తో వాణ్ణి వాటేసుకుని పైకి లాఅ న్నాడు

'ఒరే బుజ్జిగా! ఈ పొద్దు నిన్ను ముత్తేలమ్మకు బలిచ్చేస్తార్రా! పొద్దు గూట్లో పడీ పడక ముందే నిన్ను నోట్లో యేసుకోవాలని ఆయాలాయాలుగా కోసేస్తారా!- ముత్తేలమ్మకు నీ నెత్తురు కావాల పుర్సత్వం జాస్తి అవుతుందని రెడ్డికి నీ సేరు కావాల గుండె లేకపోయినా రెడ్డెమ్మ గుండెకాయంటే కొడకలాడుతుంది రెడ్డి కొడుకు పెద్దోడికి మెదురంటే ప్రాణం సిన్నోడు గోడదబ్బ కావాలని దెబ్బలాడ్తాడు మిగిల్న మాంసాన్ని ఉప్పు పసుపేసి ఎండబెట్టి ఉప్పాసులు సేసుకుంటారు!- నా సేతలమీద నిన్ను పెంచినా, నా కండ్ల ముందర్నే నిన్ను కత్తికి కండ సేస్తా వుంటే ఎట్లా సూడమంటావురా! నావల్ల కాదురా బుజ్జీ! నావల్లకాదు!

కంటికి కడవడుగా ఏడుస్తున్నాడు రా(వుడు

నోరులేని జీవం వాడి బాధను అర్థం చేసుకొన్నట్టుగా వాడి చుట్టూ తిరుగుతుంది నేలమీద పడి పొర్లాడుతుంది అంతలోనే పైకి లేచి వాడి కన్నీటిని మూతితో తుడుస్తుంది! 'అయితే నన్నేం చెయ్యమంటావ్?' అన్నట్టుగా తల ఆడిస్తుంది

ఎల్లిపోరా బుజ్జీ! నా కంటపడకుండా ఎల్లిపోరా!- సాకి సంతరించి నిన్ను సట్లో (చట్టిలో) యేసుకునే మణుసులకు దూరంగా పారిపోరా! పోరా! బుజ్జీ పోరా!

పోతాను నువ్వెట్లా సెప్తే అట్లా పారిపోతాను అయితే ఈ అడవిలో ఏ సిర్తపులో, పెదనక్కో నన్ను నోట్లో యేసుకొని నంజుకుంటే?" అన్నట్టుదీనంగా చూసింది బుజ్జి

నా కంటికి మరుగ్గా నువ్వేపై పోయినా నాకు బాదలేదు పోరా పో! నా కట్టి రెడ్డోరింటికి కట్టుబణ్ణా నా మణుసు నీ ఎంటుంటుంది పోరా!'

బుజ్జిగాడికి ఈ మాటలు చెవికెక్కినట్టులేదు అటు పోతుంది ఇటు పోతుంది పోలేక మళ్ళ వచ్చి వాడి పాదాల ముందు మూతిపెట్టి పడుకొంటుంది ఒరే బుజ్జీ పారిపోరా! అంటే నావల్ల కాదన్నట్టుగా తల అడ్డంగా తిప్పుతుంది

రా(వుడు గుండెను రాయి చేసుకొన్నాడు

అటు యిటు చూసి ఒక బెత్తాన్ని చేతికందుకొన్నాడు ఎప్పుడు తమాషాక్కూడా దానిమీద చేయి చేసుకోని మనిషి, చెడామడా బాదినాడు

రా(వుడి వైపు ఒక్క చూపు చూసింది బుజ్జి-కోపంగా దీనంగా ఆ మీదట తప్పదన్నట్టుగా పరుగు లంఘించుకున్నది

'బొరో!'మని ఏడుసూ్త రా(వుడు కుప్పగా కూలినాడు ప్రకృతిమాత వొడిలో ప్రశాంతమైన పరవగుడ్డ దడిలో కొన్ని క్షణాలు

క్షణాలు గడిచే కొన్ని నిముషాలు- మెల్సగా పైకి లేచినాడు బుజ్జిగాడు కనుచూపు మేరలో కనిపించడంలేదు ఎగ్గొట్టుకొస్తున్న ఏడుపును దిగమింగుకుంటూ వెనక్కు తిరిగినాడు

పశువుకొట్టంలో పడుకొన్నాడు తూర్పున పటమెగిరింది!

తెల్లవారింది!

అంతకుమునుపే నిద్ర లేచిన రెడ్డెమ్మ తలంటి స్నానం చేసింది భోషాణంలోని పట్టుచీరను తీసి కట్టుకొనింది పొంగలి గంపను అమర్చడంలో లీనమయింది

పొంగలి గంప కంటపడేసరికి రెడ్డిగారి మనసులో పొట్టేలు మెదిలింది

రా(వుడుమేపిన పొట్టేలు తవుడు, గానుగపిండి, పచ్చికసువు, నిలుపు లేకుండా పెట్టి పుష్టిగా మేపిన పొట్టేలు ఎక్కడ పట్టుకొంటే అక్కడ పిడికెడు కండ చేతికి దొరికేటట్టు రా(వుడు మేపిన పొట్టేలు!

తమ్మిరెడ్డి గుండెల్లో తృప్తి చిరునవ్వు మొలకలైతే పెదవులు వత్రసుడులైనాయి కాలు దీమగా పైకి లేచి ముందుకు పడింది కొట్టంలో ఆగింది

పొట్టేలు కనిపించలేదు

రెడ్డిగారు సందేహంగా అటు చూసినాడు ఇటు చూసినాడు ఎక్కడా కనిపించకపోయేసరికి గబగబ యింటి వెనక్కు వెళ్ళినాడు అక్కడకూడా లేదు ఆశ్చర్యం, సందేహం, ఆరాటం ముప్పిరిగొన్నాయి తిరణాల మనస్సులో మెదిలి ముచ్చెమటలు పోసినాయి

రా(వుడూ' అని ఒక్క గావు కేకపెట్టాడు

ఆ కేకతో యిల్లు దద్దరిల్లింది ఇంటి యిల్లాలు రెడ్డెమ్మ ఉలిక్కపడింది



# కాలపరిమితి

## ధర్మపథం




తా మే దైవ కార్యం తల బెడితే ఏవైనా ఆటంకాలు కలగ వచ్చుననే సందేహంతో ధైర్యం లేని పిరికివారు ఆ పనిని ప్రారంభించరు. గట్టి ధైర్యం లేని వారు, ఏదైనా పనిని ప్రారంభించి, నడుమ ఆటంకాలు రావడం చూచి, దానిని విడిచి పెడతారు. ధైర్యం గలవారు మాత్రం ఎన్ని ఆటంకాలు కలిగినా, ఆ పనిని విడువక ముగిస్తారు. ఇది లోకంలో సాధారణమై ఉన్నది.

పనిని నెరవేర్చాలనే సంకల్పం ఉన్న ఉత్తములు కూడా, మధ్యలో కొన్ని ఆటంకాలు కలగగా, "ఆ అడ్డు తీరిన తర్వాతనే తిరిగి గట్టిగా ప్రయత్నిద్దా"మనే తలపుతో ఉంటే ఆ పని జరగడానికి చాలా కాలం పట్టవచ్చు.

కాలానికి ఒక అవధి పెట్టుకొని పని చేసినప్పుడే ఆ పని చురుకుగా కొనసాగుతుంది. విద్యార్థులు అభ్యసించే విషయాలకూ, పరీక్షలకూ కాల నిర్ణయం ఉంటున్నది. ప్రణాళికతో ఏర్పరచి నప్పుడు "ఇంత కాలంలో ఈ పని పూర్తి కావాలి" అని నియమం ఏర్పరచడం జరుగుతున్నది. నియమించిన అవధిలో ఆ పని పూర్తి కాకపోతే, ఆ పనిని చేపట్టిన వారి అసమర్థత వ్యక్తమవుతుంది. మొదటనే బాగా ఆలోచించి, ఎంత కాలంలో ఆ పని పూర్తి కాగలదో అంచనా వేసుకుని మరీ ప్రారంభించాలి. అలా చేస్తే పని సక్రమంగా నెరవేరుతుంది. ఒక వేళ పని జరుగుతూ ఉండగా ఏవయినా ఆటంకాలు కలిగితే అచంచల దీక్షతో ఆ ఆటంకాన్ని లక్ష్యం చెయ్యకుండా ముందుకు సాగిపోవాలి. అధైర్యం చెందకూడదు.

కాలం చాలా విలువైనది. నష్ట ద్రవ్యాన్ని తిరిగీ సంపాదించవచ్చునే గాని, పోయిన క్షణకాలాన్ని మళ్ళీ సంపాదించలేము. కాలం చాలా విలువైనది. ఈ విషయాన్ని గుర్తించి దానిని క్లుప్తంగా వాడుకోవాలి.

కాలపరిమితిని పాటించినట్లయితే క్రమశిక్షణ కూడా అలవడుతుంది. వ్యర్థంగా కాలయాపన చేయడం జరగదు.

వీటినన్నింటినీ గమనించి, కాలం విలువ తెలుసుకొని ప్రతి కార్యంలోనూ కాల పరిమితిని నియమంగా పెట్టు కోవడం ఎంతో అవసరం.

– బులుసు వేంకట రమణయ్య

# బుద్ధుడు పుట్టిన భూమిలో

రావుడు మాత్రం అడుగులో అడుగ్గా వచ్చి ఎదుట నిలబడినాడు.

"పొట్టేలెక్కడ్రా?" గద్దించినాడు రెడ్డి.

రావుడు వంచిన తలెత్తలేదు.

"అడగతావుంటే అరీగురీమనకుండా బెల్లంకొట్టిన రాయి మాదిరుండావే? ఎక్కడ్రా పొట్టేలి?"

రావుడు ఒక్కసారి మెల్లగా తల పైకెత్తి తటాలున వంచుకున్నాడు.

దైన్యం గూడుకట్టిన కండ్లను రెడ్డిగారికి చూపడానికి ధైర్యం చాలలేదు.

"నిన్నేరా అడగతా వుండేది. సెవల్లో సెట్లేమన్నా మొలిసినాయా?"

నిలువు రాయిలా నిలబడిన రావుడు కదిలీ మెదల్లేదు.

"ఎంత దిమాకురా నీకు దిక్కులేన్నాకొడకా! ... సెరుకా బెల్లం పెట్టంటే పెడుతుందా?"- రెడ్డి మునికోల చేతికందుకున్నాడు.

"సెప్పరా! పొట్టేలేమయిందో సెప్పరా? నిన్ను గాదనేడికి పోతిందిరా? సెప్పు. సెప్తావా లేదా?"

మాట ముగిసీ ముగియక ముందే మునికోల పైకి లేచింది. దెబ్బమీద దెబ్బ. చర్మం చిట్లుతూ ఉంది. చిట్లిన చర్మంలో నుండి రక్తం చిప్పిలుతూ వుంది.

రావుడు 'అమ్మా! అయ్యో' అంటున్నాడే కానీ అడిగినదానికి భదులు చెప్పలేదు.

పెద్దింటి బలే తక్కువయిందని కోపగించిన ముత్యాలమ్మ ఆవహించినట్లుగా క్షణక్షణానికి రెచ్చిపోతున్నాడు రెడ్డి. మంచీ చెడ్డా మరిచి గొడ్డును బాదినట్లు బాదుతున్నాడు.

పేగు తెంచుకొని పుట్టిన ఆడసంతానాన్ని ఎప్పుడో పుట్టబోయే మగసంతానం కోసరం కాళీమాతకు భలి పేరుతో త్యాగం చేస్తున్న తల్లులున్న ఈ పవిత్ర భారతదేశంలో నాలుగు కసువు పోసలేసి ఎవ్వాడో పెంచిన పొట్టేలు పిల్లను త్యాగం చేయలేని రెడ్డి రావుణ్ణి కుక్కను కొట్టినట్లు కొడుతున్నాడు.

తాగడానికి నీళ్లేలేని రాయలసీమలో ఆ తనువులో ఎక్కడున్నాయో? ఎట్లున్నాయో? అన్ని నీళ్లు!- రావుడి కండ్లు జలపాతాలైనాయి.

మనిషికి మనిషికి మధ్య మమతానురాగాలు మహాకావ్యాలైతే ఒక మూగజీవం మీది మమత కన్నీరై పుడమి తల్లి గుండెలమీద పడి యింకిపోతూ ఉంది- కావ్య వస్తువు కాలేక!

మునికోల కోపు తగ్గలేదు!!

అయినా రావుడు నోరు విప్పలేదు. అది మూగపోయింది- మూగజీవం మీది మమతతో!

బుద్ధుడు పుట్టిన దేశంలో ... మనిషిని మనిషే మాటువేసి చంపే సమయంలో ... రావుణ్ణి గురించి ఆలోచించేవాడెవ్వడు? ఆదుకొనేవాడెవ్వడు??

ధర్మం శరణం గచ్ఛామి! సంఘం శరణం గచ్ఛామి!! బుద్ధం శరణం గచ్ఛామి!!! □

# చిన్న బాబు కంటున్న కల

డబుల్ సెవెన్, స్కైహై
దీవాలి డిలైట్,
హోలీ డిలైట్
స్పిన్నింగ్ కామెట్
సోనికా
బీకన్
సూపర్ సోనికా
ఛుక్ఛూ
బ్లూథండర్
గ్రీన్ ఫ్లాష్
రెడ్ ఫ్యాష్
సిల్వర్ రైన్ థండర్
కిళిమాంజారో
ఫ్యూజియామా
రూబీ విప్
ఎమరాల్డ్ విప్
రూబీ స్పార్క్లర్
ఎమరాల్డ్ స్పార్క్లర్

పాపం! చిన్న బాబు
నిద్దట్లోకూడా పారాలు
ఒప్పచెప్పుతున్నాడే..

నీమోహం! అవన్నీ
క్రొత్తగా వచ్చిన
సింహం మార్కు
టపాసులు, మతాబుల
పేర్లు నీ ముద్దుల
కొడుకు నిన్నంతా
భట్టీయం పట్టాడు




సింహంమార్కు టపాసులు, మతాబులు ప్రసిద్ధిచెందినవి. లక్షలాది ప్రజలు కోరి, కొని, కాల్చేవి. నిరపాయకరమైనవి. విదేశీ పనితనపు నాణ్యతతో తయారైనవి.

దీ నేషనల్ ఫైర్ వర్క్స్ ఫ్యాక్టరీ
శివకాశి-626 123,
తపాలా పెట్టె: 13
ఫోన్: 60 & 1205,
తంతి: SPARKLERS




ADWAVE/NFW/3112/TEL

సీరియల్

# పావని



సి. విమలాగణేశ్

(గత సంచిక తరువాయి)

ఫోను మ్రోగటంతో అప్పుడే లోనికి వచ్చిన కాన్వెంట్ ప్రిన్సిపాల్ మీనా ఫోను ఎత్తింది

హలో మీనా స్పీకింగ్

మీనా నేను రాజేశ్వరిని మాట్లాడుతున్నాను

నువ్వా రాజీ ఏమిటి విశేషాలు? యింటర్వ్యూ సెలక్షన్సు పూర్తయ్యాయా?

ఆ అయ్యాయి అందుకే ఫోన్ చేశాను

పావని సెలెక్టడా?

క్షమించు మీనా ఎంతో ప్రయత్నించాను కాని మా సెక్రటరి కుదరనివ్వలేదు వట్టి డబ్బు మనిషి

డబ్బా అయినా ఫర్వాలేదు ఆ డబ్బు నే సర్దుబాటు చేస్తాగా?

సమయం మించిపోయింది అంత గట్టిగా చెప్పి కూడా యేమీ చేయలేకపోయాను

మరేం బాధ పడకు మన చేతుల్లో అధికారం లేదుగా?

తప్పుగా అర్థం చేసుకోవుగా?

'అదేం లేదు నీకు చాలా ట్రబులిచ్చాను

'అబ్బే అదేం లేదు

ఫోన్ పెట్టేసి తల తిప్పి చూసింది మీనా యెదురుగా పావని నిలబడి యుంది

"పావనీ నువ్వా! యెంత సేపయింది వచ్చి?

"మీరు ఫోన్ రిశీవర్ యెత్తగానే



సారీ పావనీ

అంతా విన్నాను మేడమ్ చూశారా నా దురదృష్టం యెంత గట్టిదో? నవ్వింది

అలా అనుకోకు యిది కాకుంటే మరోటి

"ఆ నమ్మకం నాకు లేదు జీవితంలో యెన్నో చోట్ల ఎంతో ఘోరంగా" దెబ్బలు తిన్నాను నేనే అదృష్టవంతురాలనయితే నా భర్తకిస్థితి రాదు కంటి వెంట నీరు జలజలా రాలింది

పావనీ కష్టములలో నే ధైర్యంగా నిలబడాలి'

అంతకన్నా నేను మాత్రం యేం చేస్తున్నాను మేడమ్" కన్నీరు తుడుచుకొంది

"సరే క్లాసుకు టైమయింది వస్తాను మేడమ్" అంటూ బైటికి నడిచింది పావని

భగవాన్ ఆమెకు అన్యాయం చేయకు' మనసులో నే మూగగా బాధ పడింది మీనా

★ ★ ★ ★

విజయవాడ ట్రాన్స్ఫర్‌లో దినేష్ వచ్చాడు క్రైం బ్రాంచి వన్ టౌన్‌లో అతని స్టేషన్ తన డ్యూటీ ముగియగానే తన వాహనంపై యింటికి వచ్చేస్తాడు తానెంతో అదృష్టవంతుడినని తలుస్తాడు జానకి వినయ విధేయతలు చూచి. జానకి నిజంగా జానకే. ఆ మంచితనం, తన బిడ్డపై కురిపిస్తున్న ప్రేమాభిమానం చెప్పనలవి కానివి ఆ రోజు చాలా త్వరగా వచ్చాడు తండ్రిని చూడగానే-

అమ్మా డాడీ వచ్చాడు అంటూ చప్పట్లు కొట్టాడు బాబు

"జానకీ" అంటూ లోనికి వచ్చాడు

ఏమిటండీ చాలా ముందుగా వచ్చారు?' బాబును ఎత్తుకుంటూ అడిగింది

అబ్బా యింత చెప్పి అప్పుడే మతి మరపు!'

ఏం చెప్పారండీ?'

'అదే దుర్గ గుడి కెళ్ళి అటు నుంచి సినిమా కెళదామని చెప్పలే?

అది గుర్తుందండి మీరు నాలిగింటి కొస్తానన్నారు గుర్తుందా?'

"కాస్త త్వరగా వచ్చా అంతేగా త్వరగా కానీ'

ఇదిగో పది నిముషాలు, ముందు మీరెళ్ళి స్నానం చేసి రండి భర్త స్నానానికి నీళ్ళు తోడి అతను స్నానం ముగించి వచ్చేసరికి-

టిఫిన్ రెడీ'

ఇప్పుడెందుకు జానకీ ఏదయినా హొటల్ కెళ్ళే వాళ్ళం గదా?

హొటలా? ఏమండోయ్ మీరు ఒంటరిగానో ఫ్రెండ్సుతో నో యేమయినా చేయండి ఎక్కడికయినా వెళ్ళండి కానీ నాతో వున్నప్పుడు మాత్రం యిలాంటి హొటళ్ళు గీటళ్ళు అనకండి

అబ్బా సరేనండి దేవిగారూ'

త్వరగా కానివ్వండి కాఫీ తెస్తాను

నాదేం ఆలస్యము లేదు నీదే త్వరగా తెములు

కాఫీ యిచ్చి బాబుకు స్నానం చేయించి ఒళ్ళు తుడవసాగింది జానకి



జరిగిన కథ-8 : పావనికి కవల పిల్లలు పుట్టారు బాబు పేరు వినోద్ పాప పేరు సునంద విజయ్ తనకు లెక్చరర్ పోస్టు రాలేదని క్రుంగిపోతుంటే భర్తకి ధైర్యం చెబుతుంది పావని కాని, తను మనసులో కుళ్ళి కుళ్ళి ఏడ్చింది రోజీ రికమెండేషన్‌తో విజయ్‌కి రిజర్వు బ్యాంకులో జాబ్ వచ్చింది రోజీ అమెరికా వెళ్ళే ముందు వచ్చి, పావని కుటుంబాన్ని చూచి వెళ్ళింది ఆనందరావు ఆత్మహత్య చేసుకున్నాడు విజయ్ మద్రాసుకి వెళు న్న రైల్లో భయంకరమైన శబ్దం అయ్యి విజయ్ మెదడు మొద్దుబారి స్తంభించిపోయింది. రైలు యాక్సిడెంట్‌లో విజయ్‌కి చూపు పోయింది దినేష్ ఆనందరావు పెద్ద చెల్లెలు జానకిని వివాహం చేసుకున్నాడు ప్రిన్సిపాల్ ఎంత ప్రయత్నం చేసినా లేడీస్ కాలేజీలో పావనికి ఉద్యోగం రాలేదు

# పావని

"ఎక్కలికమ్మా తినిమాకా" తల్లి గడ్డం పుచ్చుకొని అడిగాడు బాబు.

"ఔనమ్మా."

"మలి కొత్త బత్త లేత్తావా?"

"ఓ" అంటూ వెళ్ళి మంచి బాబా సూట్ తెచ్చి వేసింది.

"జానకీ వీడెందు కోయి నిద్ర పోతాడు."

"ఫర్వాలేదు నిద్రపోతే మిమ్మల్నేం ఎత్తుకొమ్మని అననులెండి" బాబును రడీ చేసి తానూ ముస్తాబు అయింది.

"అమ్మా వెళ్ళి వస్తాం" తల్లికి చెప్పి స్కూటరెక్కారు. స్కూటర్ సరాసరి పైకి వెళ్ళనిస్తానన్నాడు దినేష్.

"వద్దండీ మెట్లు ఎక్కే వెళదాం."

"జానకీ నీతో అంతా యింతే ఎక్కలేం."

"ఎక్కగలం. మొన్న బాబుకు జ్వరం వచ్చినప్పుడు మెట్లు ఎక్కి వస్తానని మొక్కుకున్నాను." మారు పల్కలేదు దినేష్.

"సరే బాబును నా దగ్గరివ్వు" మెట్లు ఎక్కుతూ అన్నాడు దినేష్.

"అవసరం లేదు లెండి అయినా మీ దగ్గరకు రాడు".

"రారా బాబు అమ్మ మంచిది కాదు నాన్నే మంచోడు బిస్కెట్లు తీసిస్తాడు రామ్మా" దినేష్ చేతులు జాపాడు.

"లాను అమ్మే మంచిది కదమ్మా" అంటూ తల్లిని గట్టిగా పట్టుకొన్నాడు. అదిరిపోయాడు దినేష్. ఔను మరి జానకి వాణ్ణి అలా మలచుకొంది కష్టపడి. దుర్గ గుడి చుట్టూ ప్రదక్షణ చేసి గుడిలోకి వెళ్ళాడు. అహా దేవి విగ్రహం ఎంత బాగుంది! జన్మతరించింది.

"అమ్మా దుర్గమ్మా నా జీవితం నందనవనం చేశావు. బంగారం లాంటి భర్త, కోటి తేనెలొలికించే బిడ్డ యింత కంటే నాకేం వద్దు. నాకు బిడ్డలే వద్దు. ఒకవేళ పుడితే నా బాబు మీద యింత ప్రేమ చూపించలేనేమోనని భయం. అందుకే వద్దు. నా భర్తను అనుక్షణం కాపాడు తల్లి" అంటూ మనసులోనే ప్రార్థించుకొంది.

"జానకి త్వరగా రా సినిమా టైం అవుతూంది" తొందర చేశాడు దినేష్.

"యేమిటండీ తొందర సినిమా లేదు సింగి నాదం లేదు."

"అదో చూశావా? ప్లేట్ మార్చేశావ్. ముందు వస్తానని చెప్పావ్?"

"అబ్బా మీతో వచ్చిన చిక్కే యిది."

"సరే త్వరగా రా" యిద్దరూ శివాలయం చేరారు.

"జానకీ స్వామిని ఏమని వేడుకున్నావ్?"

"మీరు?"

"నేనేమీ వేడుకోలా."




"నా పసుపు కుంకుమ వందేళ్ళు నిలవాలనీ, నా బిడ్డ గొప్పవాడై గొప్ప చదువులు చదివి పేరు తెచ్చుకోవాలనీ."

"రెండో ది బాగుంది మొదటిదే బాగోలేదు."

"అంటే?"

"నన్ను నూట పాతిక యేండ్లు బతకమని."

"ఏం యెందుకని బాగోలేదు."

"నూట పాతిక సంవత్సరాలు బాబోయ్ వద్దు".

"భలే వారో" నవ్వింది. స్కూటర్ కదిలింది సినిమా థియేటరుకు.

* * * *

మధ్యాహ్నం లంచ్ అవర్లో దాదాపు కాన్వెంట్ టీచర్లంతా ఒకే చోట కూచొని భోజనాలు చేస్తారు. ఒకరి వంట మరొకరు రుచి చూస్తూ బాగున్న వాటి గురించి పొగడుతూ వుండటం సరదా. చాలా మంది టీచర్ల కింకా పెళ్ళి కాలేదు. చాలా రకాల టిఫెన్లు, రకరకాల కూరలు తెచ్చి తమ గొప్పతనం చాటుకుంటారు కొందరు. వారితో సరితూగలేని పావని ఎప్పుడూ వారితో పాటు భోజనానికి కూర్చోదు. రకరకాల ఐటమ్స్ తన స్థితికి అందవు. అందుకే ఎప్పుడూ టిఫిన్లు తేదు. తెస్తే పెరుగన్నం మాత్రమే.

"రండి మేడం కనీసం యీ వాళయినా కలసి భోంచేద్దాం" పావన్ని మరో మిస్ పిలిచింది.

"లేదు కమలా నాకు కాస్త పనుంది సారీ మీరు వెళ్ళండి".

"ఏం మేడమ్ మీరు మాతో కలసి తినకూడదా?" చిన్నబుచ్చుకుంది రాధిక.

"అబ్బే అదేం లేదు".

"మరేం మేడమ్ కనీసం యీ సంవత్సర కాలంలో మీరు మాతో కలసి ఒక్క రోజయినా భోంచేశారా" సరసు.

"భలేవారే కలసి భోంచేస్తేనా సరదానా? త్వరగా భోంచేసి రండి కలసి మాట్లాడుకుందాం."

"పోనీ లేవే మన మేడమ్ గారి వంటలు మనం రుచి చూడకూడదు కాబోలు, లేకపోతే దిష్టి తగుల్తుందో ఏమో" వింటున్న పావనికి కన్నీరు పొంగినంత పని అయింది.

"భలే వారమ్మా సరే వుండండి వస్తాను."

"థాంక్స్ మేడమ్" అందరి కళ్ళూ మెరిశాయి. అందరూ గుండ్రంగా కూచొని తమ తమ బాక్సులు తెరచి స్వీట్, పలావ్, పులిహోర, దోసె యిలా రకరకాల కూరలతో కాస్త రుచి చూడండి అంటూ బాక్సు మూతల్లో పెట్టి పావని ముందుకు తోశారు. పావని ముఖంలో బాధ.

"చూడండమ్మా మీరంతా యిన్ని రకాలు నా ముందుంచారు. మరి నేను మీకేం యివ్వగలను" అంటూ బాక్సు తెరిచింది. వట్టి అన్నం, ఓ నిమ్మబద్ద. "యిదమ్మ నా ఆహారం, అందుకే నేను రోజూ మీకు దూరంగా కూచుంటాను. ప్రస్తుతం నా కుటుంబ పరిస్థితుల్లో యింత కంటే గొప్పగా బతకలేం" కన్నీటితో అంది పావని. చూస్తున్న మిస్సులంతా అదోలా అయిపోయారు.

"మేడమ్ బాధ పడుతున్నారా? యిప్పుడేమయింది చెప్పండి. పంచభక్ష్య పరమాన్నాలుంటేనే నా గొప్ప? మీకున్న మంచి మనసు మరెవరికుంది మేడమ్" అంటూ సానుభూతి చూపింది కమల.

"తినండి మేడమ్" అందరూ తొందర చేశారు. భోజనాలు ముగిశాయి.

"మేడమ్ యివాళ పేపరు చూశారా?" కమల ప్రశ్న.

"లేదమ్మా ఏమిటి అంత యింపార్టెన్సు?" పావని తేరుకొని అడిగింది.

"బాస్ ట్రాన్స్పోర్టులో వేకన్సీస్ పడ్డాయి."

"ప్రయివేట్ మేనేజ్మెంటేగా?" లక్ష్మి ప్రశ్న.

"అయితేనేమే జీతం ఎంతో తెలుసా?" కమల కళ్ళు తిప్పుతూ అంది.

"ఎంతట?" రాధిక చేయి తుడుచుకుంటూ అడిగింది.

"పదిహేను వందలు. అంతేకాక రోజూ వాళ్ళ కార్లోనే తీసికెళ్ళి తీసుకొస్తారు."

"అలాగా ఫరవాలేదే ఎయిర్ హోస్టెస్లా" రాధిక నవ్వింది.

"క్వాలిఫికేషన్సు ఏమడిగారే?" లక్ష్మి ప్రశ్న.

"డిగ్రీ. అయినా అందరూ అప్లయి చేసి లాభం లేదు."

"ఏం?"

"ముఖ్యంగా అందం కావాలి!"

"అంటే మనమంతా పనికి రామా?" రాధిక తీవ్రంగా అంది.

"అనేగా అనేది మన మేడం ఒక్కరే దానికి అర్హురాలు."

"దేనికి?"

"ఆ జాబ్‌కు అప్లయ్ మీరు చేయండి మేడమ్."

"పిచ్చి పిల్లా మీరంతా పనికి రానప్పుడు నేను మాత్రం యెలా పనికొస్తాను?"

"మీకు అందం వుందిగా?"

"అని నీ భావన అంతే."

"భలే వారే! మీ అందం మీకు తెలియక పోవచ్చు కాని మాకు తెలుస్తుంది."

"ఇంకా ఏమందం తల్లీ ముసలిదాన్నవుతుంటేను" నవ్వుతూ అంది పావని.

"పోండి మేడమ్ కాటికి కాళ్ళు జాపిన వాళ్ళు కూడా అనటం లేదీ మాట. నాకో సందేహం మేడమ్".

"ఏమిటమ్మా అది?"

"మీరు కనీసం పౌడరయినా పూస్తారా?"

"నీకూ నాకే గాని ఆ కృత్రిమ సామగ్రి మేడమ్ గారి కెందుకో?"

"చాల్లే మీ హాస్యాలు. పదండి టైమయింది." పావని లేచింది.

"యింతకీ అప్లయి చేస్తున్నారా?"

"అలాగే చేస్తాను" అనిపించుకొని అందరూ క్లాసులకు నడిచారు.

*  *  *  *  *

పోస్ట్ అంటూ కవరు లోనికి విసిరాడు పోస్ట్‌మెన్. పావని స్కూలుకి వెళ్ళడానికి లోపల రెడీ అవుతూ వుంది.

"పావనీ యేదో వుత్తరం వచ్చింది చూడు." విజయ్ పిలుపు విని వచ్చిన పావని విజయ్ ముఖంలోకి చూడలేకపోయింది. గోల్డ్ మెడల్ విద్యార్థి అయిన తన భర్త యీ నాడు వుత్తరాన్ని చదవలేని స్థితికి తెచ్చిన భగవంతుని దారుణ కృత్యానికి విలవిల్లాడింది. యిదేమీ చూడలేని విజయ్-

"పావనీ."

"ఆ వచ్చానండీ" కన్నీరు తుడుచుకుని వుత్తరాన్నందుకొని చించి చదివింది.

"ఎక్కడ నుండి పావనీ?"

"అదేనండీ ట్రాన్సుపోర్టుకి అప్లయి చేశానుగా అక్కడి నుంచి."

"అలాగా యేమని రాశారు?"

"ఏముందీ యింటర్వ్యూకి రమ్మని."

"ఎప్పుడు?"

"రేపు వుదయం పది గంటలకు."

"అలాగా?"

"వెళ్ళమంటారా?"

"అదేం ప్రశ్న పావనీ నీ యిష్టం."

"ఏమిటో నండి నాకు వెళ్ళ బుద్ధి కావటం లేదు."

"అలా అయితే మానెయ్యి" చాలా సేపు యిద్దరి మధ్యా మౌనమే నిలిచింది. ఎందుకో పావనికి ఆ యింటర్వ్యూకి అటెండ్ కాబుద్ధి కావటం లేదు.

"సరే నే వెళ్ళి వస్తానండి."

"పిల్లలు వెళ్ళారా?"

"ఆ చాలా సేపయింది వెళ్ళి."

"సరే వెళ్ళిరా."

"వస్తానండి" అంటూ కాన్వెంటుకు బయలుదేరింది పావని యింటర్వ్యూకెళ్ళి వుద్యోగం వస్తే జీతం చాలా దొరుకుతుంది. యిప్పుడు వచ్చే జీతం కనీసావసరాలకు కూడా చాలటం లేదు. ప్రయత్నం చేస్తేనే బాగుంటుందేమో? మరి తన మనస్సెందుకో వద్దంటుంది. సరే టైముందిగా ఆలోచిద్దాం అనుకుంది మనసులో నే. యింతలో కాన్వెంటు చేరింది.

(ఇంకా ఉంది)




## కె. కె. లక్ష్మిదేవిపల్లి

★ యుగాలు నాలుగన్నారు. ఒక్కొక్క యుగం కాలపరిమితి ఎంత?

● ఏమో బాబూ. ఒక్కొక్కప్పుడు ఒక్కరోజు కూడా నాకు యుగంలాగానే అనిపిస్తుంది!అంచేత- యుగపు కాల పరిమితి- ఎవరికి వారు నిర్ణయించుకోవాలని అనుకుంటాను.

★ యుగానికో పురుషుడు ఉన్నాడంటారు? ఈ యుగపు పురుషుడు?

● పుట్టే వుండాలి?!

## బి. ఎమ్. బి. కోటబొమ్మాళి.

★ పెళ్లిలో పంతులుగారు నిండుగా నూరేళ్లు వర్ధిల్లు, అని దీవిస్తారు. కాని కొద్ది రోజులకే వాళ్లు విడిపోతారు. దీనికేమంటారు?

● కోరిక వేరు. వాస్తవం వేరు. కోరుకున్నంత మాత్రాన జరిగి తీరాలని లేదని తెలుసుకుంటే చాలు- పంతుళ్ల మనసు ముఖ్యం. అంతే.

## ఎన్. వి. ఎస్. విస్సన్నపేట

★ రామలక్ష్మి గారూ ఆడదానికి శత్రువు ఆడది అంటారు కదా. కామెంట్-

● ప్రతి స్త్రీ వెనుకా నేనున్నానంటూ ఓ పురుషుడు వుండి ఆడిస్తూ వుంటే – ఆడదానికి ఆడది శత్రువుగా మారుతూండడంలో ఆశ్చర్యం వుండ కూడదు.

## ఆర్. ఎమ్. ఆర్. కడప

★ ఏమిటి మీ సమాధానాలు ఎప్పుడూ స్త్రీ సమస్యల గురించేనా? లేక వాటికి సంబంధించిన సమస్యల గురించేనా? లేక చెత్త ప్రశ్నలకు సమాధానాలు ..... ఇక ఇండియాలో ఇతర సమస్యలు లేవా? జిజ్ఞాసను పెంచే సమాధానాలు యివ్వండి.

● ఈ రోజుల్లో జిజ్ఞాస పత్రికల్లో వుండదు. మీకంత కావలిస్తే ఏ చిన్మయా దగ్గరకో, ఏ పండితుని దగ్గరకో వెళ్ళి భగవద్గీత పాఠం చెప్పించుకోండి. శీర్షిక పేరు మారిస్తే – అదే చెత్త ప్రశ్నలు అతి తెలివి సమాధానాలు- కింద – మీ తెలివే బయట పడి పోతుందని నా భయం.... స్త్రీని తాకని సమస్య ఇండియాలో ఉంటుందంటే నేను నమ్మను. మీరు నమ్ముతున్నానంటె మీ అమాయకత్వానికి జాలి పడతానంతే!

## ఎమ్. వి. మార్కాపురం

★ 21–8–86 మద్రాసు రేడియో నుంచి మీరు రాసిన జీవనమే పోరాటం నాటకం మీ అభిప్రాయాలకు తగిన విధంగా చాలా బాగుంది.

● సంతోషం. చాలా చక్కగా నిర్వహించారని నేను అనుకున్నాను.

## కె. వి. వి. ఎస్. ఆర్. రాజమండ్రి

★ మీరు వ్రాసిన జీవనమే పోరాటం నాటకం విన్నాం. భారతి, విమల, సుశీల పాత్రలకు ప్రాణం పోశారు. ఆ నాటకంలో మగవాళ్లకు ఎక్కువ ప్రాధాన్యత ఎందుకివ్వలేదు? కనీసం నాటకంలోనైనా మగవారికి మంచిపాత్ర పెట్టలేదు....

● ప్రభాకర్ పాత్ర మంచిది కాదా?! ఆడదాన్ని – వ్యక్తిగా గౌరవించే మగవాళ్లందరికీ అతను ప్రాతినిధ్యం వహించడా? నాటకం నచ్చినందుకు సంతోషం.

## వి. జి. కె. ఎమ్. అనంతపూరు

★ చి. సౌ. రామలక్ష్మి గారూ. మిమ్మల్నొసారి చూశాను. స్వర్గీయ శ్రీశ్రీ గారు మీ కిచ్చిన బిరుదు, మీరాయన అమృత హృదయాన్ని అభినందించడం యీ ప్రశ్నావళి శీర్షికలో చూశాను. జె. ఆర్. విజయనగరం గారి ప్రశ్నకు సమాధానం చదివాను. మీ(హృ)ది ప్రశ్నావళి పైనున్న రేఖా చిత్రం కన్నా కొన్ని వెల రెట్లు కోమలమైనది. ఇది పొగడ్తకు వ్రాసినది కాదు.

● చూశారా? అభిరుచులలో ఎంత తేడా వుంటుందో! నన్నెలా వూహించుకున్న వారికి అలా కన్పిస్తాను కాబోలు. నాకంటే నా వ్యక్తిత్వం వెయ్యి రెట్లు గొప్పదని నన్ను కలిసి, నాతో మాట్లాడాక అనుకుంటారని- గోరాశాస్త్రి అన్నారు. అతనికి నేనంటే ఆరాధన. శ్రీశ్రీకి నా తత్వం మాత్రమె చూసె గుణం. అందుకనే నాలో రాక్షసినే చూశారు. ఇక హితులూ మిత్రులూ నా లావు చూడరు. నా మనసు చూస్తారు. థాంక్యూ.... మీ ఉత్తరం నాకు పదేళ్ళు తగ్గించింది!

## ఆర్. జె. ఆర్. సత్తెనపల్లి

★ ప్రతిసారీ ఆడవారి గురించి గొప్పగా చెప్పడం జరుగుతుంది. మరి మీ వలన ఎంత మంది ఆడవాళ్లు తమ జీవితాలను సరి చేసుకున్నారు?

● రాతలతో మనుషులు మారి పోరు. కనీసం ఆలోచిస్తారని రాస్తారు. మీకు తెలుసో లేదో ఆలోచన ఎదుగుదలకి తొలి మెట్టు.

## ఎన్. ఎస్. బి. కోటబొమ్మాళి

★ కొన్ని స్నేహాలు ఎలా పరిచయ మయ్యాయో అలాగే విడిపోతాయంటారు..... ఎంత వరకు నిజం?

● అలాంటివి పరిచయాలే గాని స్నేహం అనరు. తెలిసిన వాళ్లందరూ స్నేహితులెలా అవుతారు?.

## ఎస్. హెచ్. ఆర్. నంద్యాల

★ **హేతువాదమంటే?**

● **ప్రతిదానికీ కారణం వుందని వెతకడమేమో నాకు తెలియదు.** □






రూపురంగులనిచ్చే పసుపు బంగరు
యాత్రలకు కారణం ఆయుర్వేద మూలికలే.

# హిమానీ గోల్డ్

## టర్మరిక్ సబ్బు మరియు క్రీమ్.

ఎవరికి తెలియదు చర్మ సౌందర్యాలకు పసుపు ఎంత సహాయ కారిణి అని. కానీ యీ కొందరి రోజులలో శనగపిండితో కలిపి ప్రతి దినం ఎవరు వాడతారు... శనగపిండి లేకుండా కేవలం పసుపు మాత్రం కలసి ఉన్న చర్మ సౌందర్య సాధనాలు ఎలా చర్మాన్ని కాపాడగలవు ?

సంవత్సరాల తరువాత యీ సమస్యకు సమాధానంగా కనిపెట్టారు భారత విఖ్యాత రవీంద్ర పురస్కార విజేత శ్రీ శివకాళీ భట్టాచార్యగారు సౌందర్య సాధనాలలో కలిపేందుకు గాను పసుపుతో సహా తులసీ, గోరింట వట్టి వేళ్ళు, చందనం మరియు పద్మకముతో వనమూలికల గుణములు కలిసినట్లయితే చర్మ సౌందర్యాలకు పసుపు ఇస్తుంది ఒక ప్రత్యేకతను. శనగపిండి లేదే అన్న సమస్య మరి లేదు. సంపూర్ణ బంగరు ఛాయలు అలానిలుస్తాయి.

ఔను—ఆయుర్వేదపు యీ అమూల్య అన్వేషణా ఫలితం లభిస్తోంది పూర్తిగా హిమానీ గోల్డ్ టర్మరిక్ సబ్బు లేక హిమానీ గోల్డ్ టర్మరిక్ క్రీమ్‌లో సదా. ఇది భారత దేశంలో ప్రప్రథమం.

ఇప్పుడు మీ చర్మంలో క్రీమ్ మరియు సబ్బుల యొక్క ఆయుర్వేద గుణం అతి సహజ సౌందర్యాలతో మిళితమై శరీరం బంగరు ఛాయలతో మిరిమిట్లు గొలుస్తోంది.

ఔను—అందరు అందాలను రెప్ప వేయకుండా చూస్తారు.



శాస్త్రంలో వర్ణించబడిన వన ఔషధాల శ్రేష్టగుణములు :


పసుపు : ముఖానికిస్తుంది అందాల ఆహ్లాదాలను.


గోరింట : రంగుహూపాలను అధిక కాంతివంతం చేస్తుంది.


తులసి : చర్మంపైన మరకలను నిర్మూలిస్తుంది


చందనం : అరిన చర్మాలకు అందాల నిస్తుంది.


పద్మకము: చర్మ రోగాలను నిర్మూలించి జీవాణువులను నాశనం చేస్తుంది.


★ కొబ్బరిమాని : చర్మానికి కోమలత్వాన్నిచ్చి సహజ సౌందర్యాన్నందిస్తుంది.


★ వేపనూనె : జీవాణువులను వష్టపరచి చర్మరోగాలను నిర్మూలించేందుకు దోహదాన్నిస్తుంది.
★ సబ్బులో మాత్రమే.




హిమానీ గోల్డ్ సబ్బు మరియు క్రీమ్

బంగరు సుదినాల సౌందర్యాన్ని తిరిగి తీసుకొస్తోంది

9580A/1TEL

దీపావళి కథలపోటీలో రు.700/- బహుమతి పొందిన కథ

# మాయ

"సుఖము కొరకు కోరిక జనించును. కోరిక నుండియే విరక్తి కలుగును. విరక్తి నుండి మరల కోరిక జనించును. ఇది యొక మాయ"



"ఉద్ధతుల మధ్య పేదల కుండతరమె?" తనలో తానే సన్నగా అనుకున్నాడు వంశీ. అతని దృష్టి ఎదుటి సీటులో కూర్చున్న అమ్మాయి మీద ఉంది.

కిటికీలోంచి వస్తున్నగాలికి ఎగిరిపోతున్న ఆమె పయ్యెద మీద ఉంది. 'బతుకొని పోవు కటిక చోద్వృత్తి నడుమ ఎచటికో తొలగిపోయిన, ఆ తరుణి తను మధ్యం' మీద ఉంది.



ఆమె సుమ.

వంశీ ఆఫీసులో నే ఆమె ఆరునెలలుగా పనిచేస్తోంది. ఆమె రాక మునుపు లేని చైతన్యం ఆమెతో ఆ ఆఫీసుకి వచ్చింది. ఆమెతోపాటు ఆ ఆఫీసులో ఆర్గురు ఆడవాళ్ళున్నారు. కాని అందరి దృష్టి ఆమె మీద పడింది.

ఆమెకు, దగ్గరవటాన్కి ప్రతివాడూ ప్రయత్నించసాగాడు. వంశీ కొంచెం ఎక్కువగా అనవసర ప్రసంగాలు ఆమెతో ఎన్నో చేసాడు. ఎన్నిసార్లు మాట్లాడినా ఆమెతో 'తన' విషయం చెప్పడం అవలేదు. అతని మీద ఆమె అభిప్రాయం తెలియలేదు.

వంశీ అందగాడు.ఈ 'వనితా మానస సూనసాయకుడు'. సహజంగానే అతని దృష్టి ఆమెమీద నిలిచింది. ఆమెను చూశాక అతనికి ఇంకెవ్వరూ నచ్చలేదు.

చెయ్యి పైకెత్తి బల్బు వెలుగులో టైమ్ చూసుకున్నాడు వంశీ. పదిన్నర దాటింది. "ఇంకో గంట ప్రయాణం" అనుకున్నాడు.

పుష్పలోయ వెళ్తోందా బస్సు.

పుష్పలోయ అన్నది లోయ కాదు కాని, అక్కడ ఎక్కువగా పూలు పూయటంతో ఆప్రదేశానికా పేరు వచ్చింది. అదొక మంచి పిక్నిక్ స్పాట్. చాలామంది దూరప్రదేశాల నుంచి కూడా అక్కడికి వెళ్తుంటారు పిక్నిక్‌కి. కార్తీకమాసంలో, పిక్నిక్‌కి ఎక్కడికి వెళ్లాలన్న ప్రశ్న వచ్చినపుడు, ఆఫీసులో చాలామంది అక్కడికేవెళ్దామన్నారు. కాని కొంతమంది, ముఖ్యంగా వయస్సు మళ్ళినవాళ్ళు అభ్యంతరం చెప్పారు. కారణం, అక్కడికి వెళ్లాలంటే ఘాట్ రోడ్డు మీద బస్సు ప్రయాణం చెయ్యాల్సి ఉంటుంది. బస్సులో వెళ్ళటం ప్రమాదకరం అని వాళ్ళ భయం. కాని ఆ అభ్యంతరం అట్టే నిలవలేదు.

అక్కడికి వెళ్లాలంటే దాదాపు ఆరు గంటల ప్రయాణం చెయ్యాలి.

అందుకే శనివారం మధ్యాహ్నం స్పెషల్ బస్సులో వెళ్లాలని నిర్ణయించుకున్నారు.

కాని, బస్సుసమయానికి రాలేకపోవటంవల్ల, ప్రయాణం సాయంత్రం అయిదుకికానీ రాలేదు. అయిదుకి బయలుదేరితే పుష్పలోయ వెళ్ళేసరికి పదకొండవుతుంది. అంటే దాదాపు అయిదు గంటల పాటు రాత్రి ప్రయాణం చెయ్యాలి.

దీనికి తీవ్ర అభ్యంతరం ఎదురయింది. రాత్రిపూట ఘాట్ రోడ్డు మీద ప్రయాణం అంటే వయస్సు మళ్ళినవాళ్ళు నిజంగా భయపడ్డారు. కాని,

వంశీలాంటి యువకులు ప్రయాణం ఆపు చెయ్యడానికి ఒప్పుకోలేదు. "ఇంతదాకా వచ్చాక ఇప్పుడు కాదంటే ఎలా?" అని వాదించారు."రాత్రిపూట -అందులో ఆ రోజు పున్నమిరాత్రి - ఘాట్ రోడ్‌మీద ప్రయాణం ఒక గొప్ప థ్రిల్. థ్రిల్ లేని జీవితం అనవసరం" అన్నారు. కుర్రాఫీసరు కూడా ఒప్పుకున్నాడు. కాని బస్సు బయలుదేరే ముందు మాత్రం డ్రయివరుని పిల్చి చెప్పాడు చాలా జాగ్రత్తగా నడపమని. ఇలాంటి ప్రయాణాలు తనకు బాగా అలవాటేనని, భయపడాల్సిన పని లేదనీ హామీ యిచ్చాడు డ్రయివరు.

ఒకమారు బస్సంతా చూసాడు వంశీ.

అయిదారుగురు తప్ప మిగతా అందరూ నిద్రపోతున్నారు.

కొంచెం ప్రక్కగాచూసాడు. ఆ ప్రక్కన కిటికీ దగ్గరగా కూర్చుని సన్నగా విజిల్ వేస్కుంటూ మధ్య మధ్యలో సుమ వైపు చూస్తున్నాడు - జనార్దన్.

కోపంగా పళ్ళు కొరుక్కున్నాడు వంశీ.

అతనూ వంశీ ఇంచుమించు ఒకేసారి ఆఫీసులో జాయినయ్యారు. సుమ రాక మునుపు ఇద్దరి మధ్యా అంతంత మాత్రంగా ఉండే స్నేహం, ఆమె రాకతో పోయి, ఆ స్థానే వైరంవచ్చింది. ఒకరికొకరు 'కాంపిటీషన్'లా ఫీలవసారు. ఎవరికివారే ఆమెకు దగ్గరవ్వాలని తాపత్రయపడటం వారిద్దరిమధ్యా ఆ భావాన్ని తెచ్చింది.

ఇద్దరి ఆలోచనలూ సుమ గూర్చే ఉన్నాయి.

అయితే ఆమె ఏం ఆలోచిస్తుందో చెప్పటం కష్టం.

కిటికీ తలుపు తెరచే ఉంచిందామె. అసలే ఘాట్‌రోడ్డు. గాలి ఉక్కిరిబిక్కిరి చేసేస్తోంది.

వెన్నెల సర్వత్రా వ్యాపించియున్నది.

డ్రైవరు ఏకాగ్రతతో బస్సు నడుపుతున్నాడు.

రెండు సీట్ల వెనకాల ఆఫీసరు - భార్య చెవిలో, వంగి ఏదో చెప్తున్నాడు. ఆమె నవ్వుతోంది.

వెనక సీటులో పెద్దాయన కిటికీ తలుపు వేసేసి తలకు మఫ్లర్లు చుట్టుకొని నిద్రపోతున్నాడు.

సుమ ప్రక్కావిడ ఏదో నవల చదువుకుంటోంది.

# మాయ

సుమ బయటకు చూస్తోంది. వెన్నెల వెల్లువామె ముఖముపై పడి ఒక వింత అందాన్ని సంతరించుకుంటున్నాయి.

వంశీఆమె వైపు ముగ్ధుడై చూస్తున్నాడు.

క్షపాకరుడు వెన్నెల సోనలను కురిపిస్తున్నాడు. సర్వ ప్రకృతీ ఆ వెన్నెలలో తనిసి తదేకధ్యానమై తారాశశాంకుల ప్రణయ లీలలకు సాక్షిగాఉన్నదా యనునట్టుంది. ప్రతి పూవు, ప్రతి రెమ్మ, ప్రతి కొమ్మ, వెన్నెల స్నాతమై ఒక దివ్యానుభూతిలో తేలియాడుతున్నట్టుగా సుమనోహరంగా ఉంది ప్రకృతి.

ఒక వెన్నెల కిరణం ఆమెఅధరోష్ఠంపై పడి ఎరుపుదనాన్ని సంతరించుకుంది. ఊగే జూకా - గాలికి కదలాడే ముంగురులు - ఎగరే చేలాంచలము.

ఆ 'అలేఖ్యతనూవిలాసి'ని చూస్తూ ఉంటే వంశీ మనస్సు అననుభూతమైన ఒక అనుభూతికి లోనవుతోంది. అతని మనస్సున ఒకానొక భావం కలుగుతోంది. అది ప్రేమో- మోహమో- కామమో.

సీటు మధ్య నుంచి కనపడుతున్న ఆమె నడుము వంపుమీద పడిందాతని దృష్టి. అతని మనస్సు కోర్కెల సంద్రమైంది.

దృష్టి పైకి ప్రసరించింది.

'చక్షురుత్సవదాలు చన్నుదోయి'.

అతను చేయి నలుపుకున్నాడు. "ఒక్కసారి -"

"ఆమెమీద అతనికున్నది కేవలం కామమేనను కుంటే పొరపాటు. అతనామెను నిజంగా ప్రేమిస్తున్నాడు. పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాడు. నిద్రాహార భయ మైధునాలు సహజాలు, కోర్కెయూ సహజమే.

"ఒక్కసారి - ఆమె తనూలత నన్నల్లుకొని ఉంటే-" అతని ఒళ్ళు వేడెక్కింది.

కిటికీలోంచి విసురుగా వచ్చిన గాలికి ఆమె పైట తొలగిపోయింది.

అతని గుండె వేగం హెచ్చింది.

బస్సు మలుపు తిరుగుతోంది.

ఆమె పైట సరిచేసుకుంటోంది.

"ఆమె అధర సుధారసాన్ని గ్రోలి, ఆమె సౌందర్యాన్ని తనివితీరగా మనసారగా, అనుభవించి-" వంశీ ఆలోచనలు సాగిపోతున్నాయి.

ఎదురుగా వచ్చే లారీ - డ్రైవరు కళ్లల్లో నిద్ర మైకం.

"అలసిపోయి, సొలసిపోయి, మధురమైన కోర్కె మరలా మరలా-" డ్రైవరు కళ్లలో ఖంగారు - తిరిగిన చేయి - పట్టు బ్రేకు - ఢీకొన్న వాహనాలు చేసిన విస్ఫోటనం-

"అమ్మా-"

★ ★ ★ ★ ★

కీచురాళ్ళు చేసే శబ్దం తప్ప మిగతా అంతా నిశ్శబ్దంగా ఉంది. చలిగాలి శరీరాన్ని తాకితే ప్రాణం పోయినంత బాధ కల్గుతోంది.

వెన్నెల నిశ్శబ్దంగా కురుస్తోంది.

తల త్రిప్పబోయాడు వంశీ. ఎక్కడో కలుక్కుమంది. విపరీతంగా దాహం వేస్తోంది. చలి రక్తాన్ని గడ్డ కట్టించేలా ఉంది. ఎక్కడా ఏ రకమైన మూల్గులూ విన్పించట్లేదు. బహుశా ఇంకెవ్వరూ బ్రతికి లేరేమో.

పైకి లేవబోయాడు వంశీ. నడుం దగ్గర విరిగినట్లనిపించింది.

ఆ బాధకు మరొక పది నిమిషాలు అలాగే ఉండిపోయాడు. ఈ మాటు కాలు కదపబోయాడు. కొంచెం కదిలింది. చెయ్యి మెల్లగా కదల్చి చుట్టూ తడిమాడు. ఎవరో తగిలారు.

బలహీనంగా తలత్రిప్పి ప్రక్కకు చూశాడు.

వెన్నెల వెలుగు ఎక్కువైంది ఇందాకల కన్న.

స్పష్టంగా కన్పించిందా ఆకారం.

తలపైన పెద్ద గాయం - గడ్డ కట్టుకొనిపోయిన రక్తం

జనార్దన్ - విగతజీవుడు.

అసూయా కోపములారా! ఎక్కడున్నారు?

దూరంగా కన్పించారు అక్కడక్కడా విసిరేసినట్టుగా పడివున్న మిగతావాళ్ళు ఆఫీసరు, భార్య ఒక చోట పడిపోయి ఉన్నారు. వారి చుట్టూ రక్తం మడుగులా ఉంది.

దాహం.

దాహం విపరీతంగావేస్తోంది. "నీళ్ళు - నీళ్ళు కావాలి". ఇంతలో ఇంకో బాధ - నొప్పి, వెన్నెముక మధ్య నుంచి.

"అమ్మా -" మూల్గాడతను.

ఇంతలో ఏదో ఆలోచన వచ్చింది.

"అవును సుమ - సుమ ఏదీ?"

చూసాడు పరీక్షగా. ఎక్కడా కనబళ్ళేదు. ఈ మాటు తలని కుడి వైపుకి త్రిప్పి చూశాడు.

తల పక్కకు త్రిప్పగానే కనబడిందామె. వంశీకి కొంచెం దూరంలో నే పడి ఉందామె. ఆమె వంటిమీద ఎటువంటి గాయం కనబళ్ళేదు. నిద్రపోతున్నట్టుగా ఉంది.

"సుమా!" ఓపిక తెచ్చుకుని పిల్చాడు నెమ్మదిగా. అతని పిలుపు కీచురాళ్ల శబ్దంలో కలసిపోయింది.

"సుమా" ఈమాటు ఇంకొంచెం గట్టిగా



# భారతి

★ సాహిత్యాభిమానులకు చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా 'భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడు తుంది.

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!




---

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

చందాదారుని సంతకం

పిల్చాడు. సమాధానం రాలేదు.

అతని దృష్టి ఆమె కటికుచోద్వృత్తి మీద లేదు. అధరంమీద లేదు. మూసికొని వున్న ఆమె కన్నుల మీద ఉంది. ఎక్కడో ఆశ- ఆ కన్నులు తన పిలుపుకు కదుల్తాయని.

"సుమా" మరలా పిల్చాడు. ఇంకొంచెం కురిసిన వెన్నెలలో అతని పిలుపు దాగిపోయింది. ఆమె ముఖం వైపే చూస్తున్న అతని కళ్లకి ఈమాటు కన్పించాయి. వెన్నెలలో స్పష్టంగా - చీమలు. ఒకటొకటి చేరుతున్నాయి.

అర్థమైందతనికి.

"సుమా!" తీగ తెగిన వీణలా పిల్చింది మూగ గొంతు.

కన్నుల నశ్రు బిందువులెన్ని జన్మమ్ముల బంధమ్ము చూపునో!

"దాహం".

నాలిక తడుపుకున్నాడు. నీళ్లు కావాలి. కొంచెం తల పైకెత్తి చుట్టూ చూశాడు. నరసంచారం కనబళ్లేదు.

తలక్రిందకు దించుతూంటే అతని దృష్టి మరల ఆమెమీద పడింది.

దుఃఖం. దాహం - నొప్పి.

అతనికి హఠాత్తుగా ఒక విషయం బోధపడింది. ఏవో లోకపు తలుపులు తెరచుకున్నట్లుగా అన్పించింది. ఏవో ఆలోచనల కిరణాలు తనపై పడ్డట్లయ్యింది.

అతనికి తెలియకుండగనే అతని ఇరవై నాలుగేళ్ళ మనస్సు ఒక క్రొత్త విషయాన్ని ఆలోచించడం మొదలు పెట్టింది. చుట్టూ శవాలు- దూరంగా బస్సు, లారీ – రక్తం వాసన- కీచురాళ్ళ శబ్దాలు- వెన్నెల- మధ్యన ఉన్న అతనికి ఏదో జ్ఞాన చక్షువు వచ్చినట్లు అన్పించింది.

"తనకి ముందు కల్గిన ఆలోచన – నొప్పి, బాధ, దాహం- అప్పుడే సుమ, తనసుమ, తనదనుకున్న సుమ. కాని ముందుగా ఆమె గుర్తుకు రాలేదు.

రాలేదు కాదు- రాదు."

హఠాత్తుగా అన్పించిందతనికి "తనిప్పుడు చచ్చిపోతే- అవును చచ్చిపోతే ఏమవుతుంది?

# మాయ

వంశీ ఇంకొకటి గుర్తించాడు – భయం. మొదటిసారిగా మృత్యువు గూర్చిన ఆలోచన వచ్చినప్పుడు భయం.

"తనుపోతే ఆమె దగ్గరకు చేరుకుంటాడా? ఇప్పుడామెకాదు ఆమె ఆత్మ ఎక్కడుంటుంది? ఇక్కడ చుట్టూ తిరుగుతూనా? నేను చచ్చిపోతే- నేనూ అలాగేనా?"

వెన్నెముక ఖరేల్ మంది.

నొప్పి.

క్షణంలో వెయ్యి ఆలోచనలు.

ఆమె మీద పడింది అతని దృష్టి.

మిణుకులను దాటిపైకి చెదరిపోయిన చీర, పరికిణీ. వెన్నెల ఆమె కాళ్ళపై, తొడలపై నిర్జీవంగా ప్రతిఫలిస్తోంది. నడుం ఒంపు మీద పడిన వెన్నెల- తొలగి పోయిన పైట-

చూపు త్రిప్పుకున్నాడతను.

"తను, తనేనా? కొద్ది సేపటి క్రితంవరకూ ఆమె శరీరంలోని అంగాగాలని తమకంతో కోరికతో, మోహంతో చూచిన తనేనా చూపుత్రిప్పుకున్నది? ఇప్పుడు- ఛీ.

ఎందుకని?

"జీవం"- అవును జీవం. ఆమె ఇప్పుడు విగతజీవి. తను కూడా విగతజీవుడైతే, తన ముఖం మీదకు చీమలు వచ్చి-"

అతని ఒళ్ళు జలదరించింది.

అపరిమిత భావపరీవ్యాప్తుడై, సర్వమునందున జుగుప్సా సంకలిత మనస్కుడై, చేతనా చేతనావస్థల కలిగి- స్పృహ తప్పి పోయాడతను.

వెన్నెల కురుస్తోంది.

* * * *

తెల్లవారింది.

రాత్రి జరిగిన విషాదం పొతస్సూర్యునికి తెలియ జెప్పాలని ప్రకృతి మేల్కొంటోంది.

నడుస్తున్న ఆ కోయ యువతి, ఎదురుగా కన్పించిన దృశ్యం చూసి భయవిహ్వలయై చప్పున ఆగిపోయింది.

బస్సు లారీ చెరో వైపూ పడి ఉన్నాయి. మధ్యన ఎంత మంది ఒకరా? ఇద్దరా? పాతిక ముప్పై మంది- నిర్జీవంగా.

మడుగుకట్టిన రక్తం గడ్డ కట్టుకొని పోయి, చూడ్డానికి కళ్ళు తిరిగేలా ఉంది.

ఆ కోయ యువతి, గూడేనికి వెళ్ళి విషయం చెప్పాలని పరిగెత్తబోయి ఏదో అనుమానం వచ్చి ఆగిపోయింది.

ఎక్కణ్ణుంచో వస్తోంది- ఒక సన్నటి మూలుగు.

ఆమె సందేహంతో ఆగి పోయింది.

మళ్ళీ విన్పించిందా మూలుగు. చప్పున ఆ వైపుకు పరుగెత్తిందామె.

చుట్టూ శవాలు- మధ్యన పడి ఉన్నాడతను..

కదలలేక పోతున్నాడు. అతి కష్టం మీద నోట్లోంచి మూలుగు వస్తోంది.

ఆమె ఒక్క ఉదుటున పరుగెత్తింది.

దగ్గరే ఉందొక చిన్న వాగు.. ఆమె గభాల్న దోసిలితో నీళ్ళు తెచ్చి అతని ముఖంమీద చిలకరించింది.

"దాహం"- మూల్గాడతను.

మళ్ళీ వెనక్కు పరుగెత్తిందామె. ఈ మాటు నీళ్ళు కొంచెం జాగ్రత్తగా తెచ్చి అతని నోట్లో పోసింది.

ఆత్రంగా తాగాడతను.

తన పైట తీసి అతని ముఖం తుడిచిందామె.

కళ్ళు తెరచాడు వంశీ.

"నేను ఉన్నాను- నేను ఉన్నాను. నేను చనిపోలేదు. బ్రతికే ఉన్నాను."

కోయ యువతి, అతను కళ్ళు తెరవడం చూసి ఆనందంతో చిన్నగా అర్చి, మళ్ళీ వెళ్ళి కొంచెం నీటిని తెచ్చి అతని ప్రక్కన మోకాళ్ళ మీద కూర్చుని, అతని నోట్లో నీళ్ళు పోయడానికి ముందుకు వంగింది.

వంశీ చూపు ఆమె మీద పడింది.

ఆమె వంగింది.

అప్రయత్నంగా, అసంకల్పంగా అతని చూపు ఆమె వక్షోజాల మీద పడింది. సన్నని కంచుక దాచలేని కోయ యువతి నిండు గుండెలు.

అతనికి తెలియకుండగనే, అతనిలో ఒక ఆలోచన.

పెదాలు తడుపుకున్నాడతను, "ఒక్కసారి-"

సుఖము కొరకు కోరిక జనించును. కోరిక నుండియే విరక్తి కలుగును. విరక్తి నుండి మరల కోరిక జనించును. ఇది యొక మాయ. □

ఇదుగో! నేను ప్రారంభోత్సవం జరిపిన పాఠశాల భవనాలన్నీ
కూలిపోయాయి! జనం నామీద దుమ్మెత్తి పోసే లోగా
వాటిని నాగార్జున సిమెంటుతో మరమ్మత్తు చేయించండి - పోండి!!






గోద్రెజ్ సమర్పణ— అద్భుతమైన లగ్జరీ సబ్బు.

ఫ్రెస్కా విలాసవంతమైన, విలువైన సుగంధ పరిమళ భరితమైన సబ్బు

ఎంతో నురుగు—పాల మీగడ తరగలా త్వంగా తరగనిది అరగనిది ఫ్రెస్కా

లగ్జరీ సబ్బు మీకు నచ్చే, మిమ్మల్ని ఆశ్చర్య పరిచే తక్కువ ధరలో

# సినిమా విశేషాలు

-జి.వి.జి.



వినయ్ ఆర్ట్ పిక్చర్స్ చిత్రంలో కృష్ణ, శ్రీదేవి

## కె. విశ్వనాధ్ దర్శకత్వంలో సుదర్శన్ సినీ ఎంటర్‌ప్రైసెస్ చిత్రం

ప్రముఖ గాయని ఎస్. జానకి ఏకైక పుత్రుడు మురళికృష్ణతో పాటు సంగీత నాట్యాలలో ప్రావీణ్యం సంపాదించిన షణ్ముగం శ్రీనివాస్ అనే పదేళ్ల ఏలూరు బాలుడ్ని పరిచయం చేస్తున్నాం. సెప్టెంబరు 28 నుంచి అక్టోబరు 8 వరకు మైసూరులో ఒక షెడ్యూల్ జరిపాం. తదుపరి షెడ్యూల్ అక్టోబర్ 20 నుంచి మద్రాసులోనే జరుగుతుంది" అన్నారు కె. విశ్వనాధ్. ఈయన దర్శకత్వంలో మద్రాసు 'సవేరా హోటల్' మేనేజింగ్ డైరెక్టర్ ఎ . ఏ. కె. రెడ్డి సమర్పించే సుదర్శన్ సినీ ఎంటర్‌ప్రైసెస్ వారి చిత్రంలో సత్యనారాయణ, డాక్టర్ రాజశేఖర్, నరేష్, సాక్షి రంగారావు,మిశ్రో, వంకాయల, సుమలత, ముచ్చెర్ల అరుణ, జయలలిత, అంజలీదేవి పాత్రధారులు. ఆకెళ్ల మాటలు, సిరి వెన్నెల సీతారామశాస్త్రి పాటలు, కె. వి. మహదేవన్‌సంగీతం, జి. వి. సుబ్బారావు ఛాయ, అరుణ్ శిల్పం, జి. జి. కృష్ణారావు కూర్పు, నందూరి విజయ సహకార దర్శకత్వం, గురుదేవ్ నిర్వహణతో సుధాకర్, కమలా కర్ నిర్మాతలు.

## "కాబోయే అల్లుడు"

"కొడుకు పెళ్లికి లక్షలకొద్దీ కట్నం తీసుకుని, కూతురికి పైసా అయినా కట్నం లేకుండా పెళ్లి చేయాలనే పెద్దమనిషికి అతని కొడుకు , అల్లుడు కలిసి బుద్ధి గరపడం కథాంశం", అన్నారు రేలంగి నరసింహారావు. ఈయనస్క్రీన్‌ప్లే, దర్శత్వంలో ఎం. చంద్రకుమార్ నిర్మించే హాస్య ప్రధాన చిత్రంలో భానుప్రియ చెల్లెలు రేఖ పరిచయం గావింపబడుతోంది. చంద్రమోహన్, రాజేంద్రప్రసాద్, గొల్లపూడి మారుతీరావు, వేలు, వీరభద్రరావు, కల్పన, సంగీత, వై. విజయ, గెస్ట్‌గా కోట శ్రీనివాసరావు పాత్రధారులు. కాశీ విశ్వనాధ్ కథ, మాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, కోటేశ్వరరావు ఛాయ, లీలాకృష్ణ శిల్పం, బి. నాగేశ్వరరావు సంయుక్త దర్శకత్వం, కె. ఎస్. ఎస్. మూర్తి ప్రొడక్షన్, రవీంద్రబాబు కూర్పు, రాజేష్‌సహకార దర్శకత్వంతో ఎం. విజయకుమార్, ఎం. జీవన్‌కుమార్, ఎం. వెంకటరమణకుమార్, ఎస్. కృష్ణప్రసాద్ సహ నిర్మాతలు. హైదరాబాద్‌లో అక్టోబర్ 12 నుంచి నవంబర్ 7 వరకు ఒకేషెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది.

"లాయర్ సుహాసిని"లో ఎస్. వరలక్ష్మి, సుహాసిని, చిరంజీవులు



## తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో సుమన్

"నవంబర్ నెలాఖరుకు షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సి. కె. ఆర్ ప్రసాద్, సి. ఆర్. ఆర్. ప్రసాద్ నిర్మించే సత్యశక్తి పిక్చర్స్‌వారి తృతీయ చిత్రంలో సుమన్, రాజేంద్రప్రసాద్, నూతన్‌ప్రసాద్, భానుప్రియ, ఆదిగాగల వారు పాల్గొంటున్నారు. అంజనేయ పుష్పానం ద్ కథకు గణేష్‌పాత్రో సంభాషణలకర్త. చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయ, కళాధర్ శిల్పం, తాండవకృష్ణ ప్రొడక్షన్, గూనా నాగేంద్ర ప్రసాద్ సంయుక్త దర్శకత్వం నిర్వహిస్తున్నారు.



"చాణక్య శపథం"లో చిరంజీవి

## రేలంగి నరసింహారావు దర్శకత్వంలో "చిలిపి దంపతులు"

"అక్టోబర్ 1 నుంచి 10 వరకు ఒక షెడ్యూల్. ఇంకో షెడ్యూల్ నవంబర్ 12 నుండి డిసెంబర్ 5 వరకు", అన్నారు రేలంగి నరసింహారావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పెళ్లకూరు అమరేంద్రరెడ్డి నిర్మించే హరిత చిత్ర మూవీస్‌వారి ప్రై ద్వితీయ చిత్రంలో చంద్రమోహన్, పూర్ణిమ, నూతన్‌ప్రసాద్, వేలు, వీరభద్రరావు, రావికొండలరావు, వై. విజయ, నిర్మల, విజయవాణి నటిస్తున్నారు. దివాకర్‌బాబు కథ, మాటలు రాశారు. ఆత్రేయ, సి. నారాయణరెడ్డి, సీతారామశాస్త్రి గీతాలను, సాలూరు వాసూరావు స్వరపరిచారు. బి. కోటేశ్వరరావు ఛాయ, లీలాకృష్ణ శిల్పం, ఆంథోని నృత్యాలు, కమల్‌తేజ్ సంయుక్త దర్శకత్వం, డి. రాజగోపాల్ కూర్పు, డి. సహదేవరెడ్డి సహకార దర్శకత్వం, అల్లారెడ్డి జగన్మోహన్‌రెడ్డి నిర్వహణ, వి. రామసుబ్బారెడ్డి పర్యవేక్షణ, కంభం వెంకటరెడ్డి నిర్మాణతతో వెంకటహరీష్ సహ నిర్మాత.

## "జైలు పక్షి"లో మనోవ్యధ

బేబి షాలినికి నిర్మల ఒక శ్లోకం వినిపించి, "జీవులేల దుఃఖపడుచున్నారో, ఆ దుఃఖ కారణం ఈ శ్లోకంలో ఉంది", అంది. షాలిని విసుగ్గా "అబ్బబ్బా! నీకేం ముసలమ్మా, ఆ తల తెల్లగా సున్నంలాగయిపోయింది. పొద్దున్న లేస్తే రామాయణం, సాయంత్రం లేస్తే భారతం -చక్కగా కాలక్షేపం అవుతూ వుంది. ఎటు చూసి నేనేగా ఇబ్బందిపడేది? మా నాన్నని పెళ్లిచేసుకోమని ఇదుగో ఇప్పుడడుగుతాను; అప్పుడడుగుతాను - అంటావు. ఆయన వచ్చేసరికి అసలు నోరు తెరవ్వు", అంది.

"అడుగుతానమ్మా. ఏమిటో నేనంటే వాడికి గౌరవం. తల్లిదండ్ర మాటేగాని, మనస్సు విప్పి ఏ రోజూ ఇది నువ్వు చెయ్యరా - అని చెప్పలేదు. వాడి కోపం అలాంటిది. నేను వాడితో మాట్లాడకపోబట్టే కదా నువ్వింత అరిందాలా తయారయ్యావు?"

"ఇంతకీ, నువ్వడుగుతావా- నేనడగనా?" అని షాలిని అంటూండగానే శోభన్‌బాబు "రుద్రమదేవిగారూ!" అంటూ ప్రవేశించాడు.

"అమ్మో! రాణి రుద్రమదేవిగారు చాలా కోపంగా ఉన్నారు. కాస్త మాట్లాడండి, తల్లీ" అన్నాడు.

షాలిని కోపం అభినయిస్తూ, "ఎందుకు మాట్లాడను? మాట్లాడకపోతే నాకు గడవదుగా మరి? నా కోపానికి విలువేముందిలే ఈ ఇంట్లో", అంది.

"అయ్యో ఈ ఇంట్లో నీ కోపానికి విలువలేకపోతే, మా కోపానికి విలువేముంది, తల్లీ! చెప్పు!"

"నాయనమ్మ ముసలమ్మ అయిపోయిందిగా? పని చెయ్యలేకపోతూ ంది పాపం!"

"నీకేం కావాలో చూడ్డానికి నేనున్నాను కదమ్మా!"

"అవునూ ... కొత్త గౌనుకావాలంటే కొనిచ్చావ్. కొత్త అమ్మ కావాలంటే తీసుకురావే?"

శోభన్ ఖిన్న వదనుడయ్యేసరికి నిర్మల "బాబూ! ఇంత వయసొచ్చినా - నోరారా అమ్మా అని పిలవడానికి నీకు నేనున్నారా. మరి, దానికి ఆ ఆశ ఉండటం తప్పా?" అంది.

"తప్పు కాకపోవచ్చు. అమావాస్యనాటి చీకటి పోగొట్టడానికి ఉదయిస్తున్న సూర్యుడు రావచ్చు. కాని, నా గుండెల నిండా ఉన్న చీకటిని పోగొట్టడానికి మరో సరోజ ఎక్కడ్నుంచి వస్తుంది", అంటున్నప్పుడు శోభన్ కళ్లు చెమ్మగిల్లాయి.

"జైలు పక్షి"గా రాధిక నటించిన శ్రీ సారథి స్టూడియోస్‌వారి చిత్రాన్ని కోడి రామకృష్ణ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. శశిభూషణ్ నిర్మించారు. పరుచూరి సంభాషణలు, కె. వి.మహదేవన్ సంగీతం, ఎస్. గోపాలరెడ్డి ఛాయ, కె. సూర్యనారాయణ నిర్వహణ, ఐ. వి. కుమార్ - డాక్టర్ నారాయణరావు ప్రొడక్షన్‌తో సుబ్బరాజు వేగేశన పర్యవేక్షకుడు. నవయుగ విడుదల.

"హెచ్చరిక"లో భానుచందర్, శోభన, బేబీ షాలిని





"జైలు పక్షి"లో
బేబీ షాలిని, శోభన్‌బాబు

## "డబ్బేవరికి చేదు"

లాయర్ నూకరాజు (పొట్టి ప్రసాద్) వీలునామాను చదివాక "ఆ డబ్బు మీకు కావాలంటే, రెండే రెండు మార్గాలు. ఒకటి - నువ్వు తపీమనడం", అంటూ ఆగాడు.

లక్ష్మీకాంత్ (చంద్రమోహన్) ముఖం ప్రకాశవంతమైంది."ఇదైతే ఖర్చులేని పని అనుకోండి. కాని, నాకింకా 30 ఏళ్ల సర్వీసు ఉంది. ఇప్పుడే పోతే బోలెడు జీతం నష్టం".

"రెండు - విడాకులు తీసుకోవడం", అన్నాడు నూకరాజు.

లక్ష్మీకాంత్ భార్య స్వర్ణ (సులక్షణ) సంతోషంతో "అలా అయితే, విడాకులు ఇప్పించండి", అంది.

"యాభై లక్షలకోసం పండంటి సంసారం వదులుకుంటావటమ్మా?" అన్నాడు నూకరాజు.

"డబ్బేవరికి చేదండీ? మీ ఫీజెంతో చెప్పండి", అన్నాడు లక్ష్మీకాంత్.

"ఓ లక్ష ఇవ్వండి".

మూర్ఛిల్లిన భర్త మీద నీళ్ళు చల్లుతూ స్వర్ణ "లాయరుగారూ! ఆశకు కూడా అంతుండాలి", అంది.

"యాభై లక్షలు ఊరికే వస్తున్నప్పుడు ఓ లక్ష నాకిస్తే మీ సొమ్మేం పోతుంది? డబ్బేవరికి చేదు?" అన్నాడు నూకరాజు.

రేలంగి నరసింహారావు దర్శకత్వంలో ఎ. పోతరాజు సమర్పించే తారకనామా మూవీస్ "డబ్బేవరికి చేదు" చిత్రానికి ఎస్. రామలింగరాజు నిర్మాత.



## "అర్ధరాత్రి స్వతంత్రం"

నీడ, సంగీత, చిల్లరకొట్టు చిట్టెమ్మ, సీతారాములు, ఎం ఎల్ ఏ ఏడుకొండలు' వగైరా చిత్రాలలో నటించిన ఆర్ నారాయణమూర్తి స్నేహచిత్ర పిక్చర్స్ బా నర్‌లో, స్వీయ దర్శకత్వంలో నిర్మించిన చిత్రం 'అర్ధరాత్రి స్వతంత్రం' ఎక్కువగా రంపచో దవరంలో ని ఏజన్సీ పరిసరాలలో ని సుందర వనసీమలు, కోనలు, సెలయేళ్ళు, కోవెలలు ఈ చిత్రంలో చోటు చేసుకున్నాయి 'అర్ధరాత్రి స్వతంత్రం వచ్చినా - గిరిజనుల జీవితాలు ఇంకా తెలవారలేదు వారి జీవితాలలో వెలుగు తీసుకురావడానికి నలుగురు యువకులు, ఒకయువతి చేసే ప్రయత్నాలు, వారు ఎదుర్కొన్న ...లు చి తించాం' అనారు



ఒక పాత్ర ఇస్తేనే సరిగా చెయ్యలేకుండా వున్నావు- ఇక ద్విపాత్రాభినయం చేసే అవకాశం ఇప్పించమంటే ఎట్లా?

---

నారాయణమూర్తి ఈయనతో పాటల విప్లవ యువకుడుగా డైరెక్టర్ టి కృష్ణ, పోలీస్ ఆఫీసర్‌గా ప్రభాకరరెడ్డి, గ్రామకరణంగా రచయిత ఎం వి ఎస్ హరనాథరావు, విప్లవ నాయకుడుగా విప్లవ కవి వంగపండు ప్రసాదరావు, గిరిజన గూడెం నాయకుడుగా రాళ్ళపల్లి ఈయన కుమార్తెగా రాగిణి, ఈ చిత్ర సంభాషణలకర్త పి ఎల్ నారాయణ డైరెక్టర్ పురాణం సూర్య, నర్రా వెంకటేశ్వరరావు, రామరాజు, ప్రభాకర్, వరలక్ష్మి, అత్తిలి లక్ష్మి, జానకి నటించారు సత్యం స్వరకల్పనలో వంగపండు ప్రసాద్, అదృష్టదీపక్‌లు గిరిజన జీవితాలకు అన్వయించే విధంగా, వారి సమస్యలను ప్రతిబింబించే రీతిలో గీతాలను రాశారు ఆర్ రామారావు చాయ, రాజు నృత్యాలు, బి ఎస్ మోహన్ శిల్పం, తాతా సురేష్ కూర్పు నిర్వహించారు

# ఆంధ్రసచిత్రవారపత్రిక



## పాఠకులకు అభినేత్రి భానుప్రియ సమాధానాలు!

### త్వరలో ప్రారంభం!

తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలని విశేషంగా చూరగొన్న నటీమణి భానుప్రియ ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకు సమా... ఇస్తారని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము త్వరలో ప్రారంభ... ఈ శీర్షికకి పాఠకులు అర్ధవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతు... వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం భానుప్రియ ఎన్ని... ఉత్తమ ప్రశ్నని పంపిన వారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమై... బహుమతిగా లభిస్తుంది. ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది ... స్పష్టంగా సిరాతో లేదా బాల్ పాయింట్ పెన్‌తో రాసి తమపేరు, చిరునామాతో - సహా "భానుప్రియ సమాధానాలు" శీర్షిక పేర సంపాదకు... సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ -520003 అన్న చి... పంపాలి ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి విడిగా రాసి ... పరిశీలింప బడవు

పాఠకులు ఈ అవకాశాన్ని ఉత్సాహంతో వినియోగించు... ఆశిస్తున్నాము.

--- కూపన్ ---

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ____________________

____________________

____________________

పంపిన వారి పేరు ____________________

పూర్తి చిరునామా ____________________

____________________




# సినిమా

## చిత్రీకరణ ముగిసిన "పూజకు పనికిరాని పువ్వు"

"చివరి షెడ్యూల్ సెప్టెంబర్ 20 నుండి అక్టోబర్ 19 వరకు జరిగింది" అన్నారు అట్లూరి రామారావు. ఈయన నిర్వహణలో ఉషాకిరణ్ మూవీస్ అధినేత రామోజీరావు నిర్మించిన పై చిత్రంలో తులసి, శేఖర్ సుమన్, హరి ప్రసాద్, నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, చలపతిరావు, సాక్షి రంగారావు, బాలాజీ, కె. కె. శర్మ, ప్రమీల, వై. విజయ, రాజ్యలక్ష్మి, బిందు మాధవి, జయశీల, రేఖ, మహాజ, వేలు, పొట్టి ప్రసాద్, మాడా, వీరభద్రరావు, నజీర్ నటించారు. కాశీ విశ్వనాథ్ కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. డి. ప్రసాద్‌బాబు ఛాయ, భాస్కరరాజు శిల్పం, సాయికృష్ణ సహకారదర్శకత్వం, స్వామి ప్రొడక్షన్‌తో ఈ చిత్రానికి దర్శకత్వం వహించిన ఎ. మోహన్‌గాంధి "వారకాంతల జీవితాల చుట్టూ అల్లబడిన కథ. డిసెంబర్ రిలీజ్", అన్నారు.



"బ్రహ్మ నీ రాత తారుమారు"లో స్మిత

## "ఉమ్మడి మొగుడు" శోభన్‌బాబు డిసెంబర్‌లో

"శోభన్‌బాబు సరసన భార్యలుగా రాధిక, కీర్తి నటించారు. షూటింగ్ పూర్తయింది. డిసెంబర్ విడుదల", అన్నారు రాఘవేంద్ర మూవీక్రియేషన్స్ అధినేత కె. వి. వి. సత్యనారాయణ. ఈయన నిర్మించిన పై చిత్రంలో చంద్రమోహన్, గొల్లపూడి, జె. వి. సోమయాజులు, వై. విజయ, విజయవాణి, సూర్యకాంతం ఇతర నటవర్గం.కొంపెల్ల విశ్వం స్క్రీన్‌ప్లే, మద్దిపట్ల సూరి మాటలు, ఆత్రేయ - సీతారామశాస్త్రి గీతాలు, చక్రవర్తి సంగీతం, పి. చంగయ్య ఛాయ, కళాధర్ శిల్పం, విజయసారథి సహకార దర్శకత్వం, గాది సత్యం - రావు వెంకటేశ్వరరావు ప్రొడక్షన్‌తో బి. భాస్కరరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించారు. □




# అష్టలక్ష్మీవైభవము

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: **సి.యస్. రావు** B.A.,Litt  నిర్మాత: **వల్లభనేని లక్ష్మీదాసు**

కె.వి. మహదేవన్, సుదర్శనభట్టాచార్య, శ్రీకాంత్, వీరప్ప, రాజు, నాగరాజన్

# అభిమాన తారలపై అభిప్రాయం

నటనకే భాష్యం చెప్పిన నటి జయసుధ, నా అభిమాన నటి.

ఆమె నటించిన జ్యోతి, శక్తి, తిరుగుబాటు, ప్రేమాభిషేకం, ధర్మపీఠం దద్దరిల్లింది చిత్రాలు ఆమె నటనా చాతుర్యానికి తార్కాణాలు.



ప్రతిఘటనలో సహ నటియైన విజయశాంతి నటనను మనసారా అభినందించిన సహృదయశీలి జయసుధ.

గ్లామర్ క్వీన్‌గానే కాక ఏక్షన్ క్వీన్‌గా కూడా పేరు తెచ్చుకుంటున్న జయసుధ జాతీయ అవార్డు పొందాలని ఆమె అభిమానిగా నా కోరిక. "కళాతపస్వి" విశ్వనాథ్‌గారి దర్శకత్వంలో ఆమె నటించాలని నా/ఆశ.... ఆకాంక్ష.

– షాహీన్, అక్కయ్యపాలెం, విశాఖపట్నం

★ ★ ★

నా అభిమాన నటి 'సుహాసిని'. నేను ఆవిడ నటించిన మొట్ట మొదటి సినిమా 'మౌన గీతం' చూచి నప్పటి నుంచి ఆవిడ అభిమానిని అయ్యాను. 'స్వాతి' చిత్రం ద్వారా ఆవిడ ప్రేక్షకులలో చిరస్థాయిగా నిలిచినారు. "మౌన గీతం"లో ఆమెకు మన తెలుగు భాష రాక పోయినప్పటికి హావ భావాలతో ఎంత బాగానో నటించారు. తర్వాత మన తెలుగు భాషను బాగా నేర్చుకొని కొలది కాలములోనే సూపర్ హీరోయిన్‌గా అయ్యారు.

ఎంతటి కష్టతరమైన పాత్రనైన అవలీలగా



చేయగల మేటి నటి సుహాసిని. గలగల పారే సెల యేరులా, ఎప్పుడూ నవ్వుతూ, తుళ్ళుతూ ఉండే సుహాసిని, 'సిరి వెన్నెల'లో మూగదానిగా కూడా చాలా బాగా యాక్షన్ చేసినారు. ఈ ఉదాహరణ ఒక్కటి చాలు ఆమె ఏ పాత్రకైనా ఆమే సాటియని.

అనుమానపు భార్యగా నటించే చిత్రాలలో ఆమె బాగా నటిస్తారు. చిలిపి పాత్రలలో ఆమె నటిస్తారు అనడం కన్న జీవిస్తారు అని చెప్పవచ్చు. ఈ సంవత్సరము సావిత్రిగారి స్మారక అవార్డును సుహాసినిగారు అందుకోవడం ఎంతైనా ఆనందదాయకము.

ఆమె మోడరన్ డ్రస్సులలో కన్న చీరలలోనే అందంగా ఉంటారు. ముందు ముందు ఆవిడను మంచి కథాబలము ఉన్న పాత్రలలో చూడాలన్నదే ఆమె అభిమానిగా నా కోరిక.

-ఎల్. నాగమణి, చేబ్రోలు (గుంటూరు)

★ ★ ★

నా అభిమాన నటుడు మోహన్ బాబు చిన్నా పెద్దా, ఆడ మగా అందరితోనూ మంచి నటుడిగా గుర్తింపు పొందడమే కాకుండా అగ్రనటుల జాబితాలోకి చేరుకున్నాడు.

"కల్యాణి", "భలేదొంగలు", "సుజాత", "ఇదెక్కడి న్యాయం?", "దేవత", "ప్రతీకారం" లాంటి చిత్రాల్లో నటించి ప్రతిభ గల నటుడిగా నిరూపించు కున్నాడు. సాంఘిక చిత్రాలలోనే కాకుండా "సింహ గర్జన", "కురుక్షేత్రం" వంటి జానపద చిత్రాల్లో కూడా ఉత్తమ నటనను ప్రదర్శించి ప్రేక్షకుల మెప్పు పొందాడు.



అప్పుడు మోహన్‌బాబు ఏ చిత్రంలోనైన వున్నాడంటే తప్పక చూడాలనే భావన కలిగేది. మోహన్ బాబు పాత్రల ఎన్నికలో కనబరచే శ్రద్ధ, పాత్రను ప్రేక్షకులకు నచ్చే విధంగా, నటించి వాళ్ల అభిమానం సంపాదించేందుకు తీసుకొనే జాగ్రత్తలు, పాత్రపై మనసులగ్నం చేయడం నిరంతర కృషి ద్వార ప్రేక్షకులకు దగ్గరయ్యాడు.

కాని ఈ మధ్య వస్తున్న చిత్రాలు చూస్తే కొంత అసంతృప్తి కలిగిస్తున్నాయి. కారణం పాత్రకు బలం లేక పోవడం, కథాగమనానికి అతకక పోవడం, అన్ని చిత్రాలూ ఒకే మూసలో తయారు కావడం వలన ప్రేక్షకుల్లో మోహన్‌బాబు స్థానం కొన్ని మెట్లు క్రిందకి దిగింది.

ఇక ముందు పాత్రల ఎన్నికలో జాగ్రత్తగా వుంటూ గత ఘనకీర్తిని పోగొట్టు కోకుండా వుండడం మంచిది. తక్కువ చిత్రాలలో నటించినా ఫరవా లేదు. ఏకాగ్రతతో పాత్రకు ప్రాణం పోస్తే ప్రేక్షకులు బ్రహ్మరథం పడతారు.

-యన్. శివానంద్, బెల్లంపల్లి

★ ★ ★

నా అభిమాన నటి 'లక్ష్మి'. నేను ఆమె నటించిన 'మల్లెపూవు' చిత్రం చూచి ఆమె నటనా చాతుర్యమునకు, గాంభీర్యమునకును ఆకర్షితుడనైనాను. ఆమె నటన అమోఘం. ఆమె నటనలో ఎంతో వైవిధ్యం కన్పిస్తుంది. ఎంతో సహజత్వం వుట్టిపడుతుంది. ఆమె నటనలో జీవం వుంది. ఆమె సంభాషణలు పలికే తీరు చక్కగా వుండి, హృదయాలను హత్తుకుంటుంది. చిత్ర కథ



ఏవిధంగా వున్ననూ తన పాత్రను అవలీలగా నటించి, ప్రేక్షకుల మెప్పును సంపాదించగల గొప్ప నటి 'లక్ష్మి'. సినిమాలో ఆమె ధరించే దుస్తులు సంసారపక్షంగా, నిండుగా వుంటాయి. ఈ మధ్య ఆమె నటించిన చిత్రం "రావణ బ్రహ్మ" చూచాను. ప్రియురాలిగా, తల్లిగా ఆమె నటన అమోఘం. చాల రోజుల తర్వాత ఆమె నటించిన ఈ చిత్రం చూచి, చాల ఆనందించాను. ముమ్ముందు యింకా ఎక్కువ చిత్రాలలో నటించి, మమ్ముల నానందింప జేయగలరని ఆశిస్తున్నాను.

-కె. వి. నాగేశ్వరరావు, నార్తురాజుపాలెం, (నెల్లూరు)

★ ★ ★

నా అభిమాన హీరో నటశేఖర్ కృష్ణ. తన నటనతో ఆంధ్ర ప్రేక్షకులతో సూపర్ స్టార్‌గా ప్రశంసించబడి, పద్మాలయా సంస్థ ద్వారా అనేక భాషలలో హిట్ చిత్రములు నిర్మించి, సూపర్ నిర్మాతగా గుర్తించ బడి, తెలుగు, హిందీ భాషలలో ఒకేసారి దర్శకత్వము చేపట్టి ఆలిండియా సూపర్‌స్టార్ అండ్ డైరెక్టర్‌గా ప్రశంసించబడి, తెలుగు "సింహాసనం" 41కేంద్రా



లలో 100 రోజులు ప్రదర్శించబడి ఆంధ్ర రికార్డ్ సృష్టించి సుప్రీమ్ దర్శకుడుగా పేరు సంపాదించి ఆలిండియా చలన చిత్ర పరిశ్రమలో వెలుగుటయే కాకుండా, ఇతరులకు సహాయము చేయుటలో రియల్ హీరోగా 1983 వరదలలో సినీ పరిశ్రమలో అందరి కంటే ఎక్కువ సహాయము చేసి, నేటి వరదలలో తన తరపున 4 లక్షలు ఇవ్వగా ఆయన కుమారుడు రమేష్‌బాబు తన మొదటి సంపాదన 1 లక్ష ఇచ్చి తండ్రికి తగ్గ తనయుడుగా నిలిచినారు. వారికి నా శుభాకాంక్షలు.

-సి. హెచ్. సుధాకర్, రాజమండ్రి

నవలా నాయకుడు డా. అక్కినేని వారసుడు "నాగార్జున" చిత్రసీమకు పరిచయం అయిన తొలిచిత్రంతోనే అఖండ విజయాన్ని సాధించటం నిజంగా గర్వించదగిన విషయం. ఒకరిపై అభిమానంతో ప్రేక్షకులు ఆ చిత్రాన్ని ఆదరించారన్న వార్త సరైనదికాదు. చిత్రంలో ఏ ప్లస్ పాయింటూ లేకపోతే ప్రేక్షకులు అంతగా ఆదరించరు.



కనుక "విక్రమ్" చిత్రం విజయ సాధనం, చిత్రకరణ విజయానికి కారణమని చెప్పవచ్చును. ఒకే రకమైన నటనను ప్రదర్శించి ప్రేక్షకులను ఇబ్బంది పెట్టే విధంగా నటించటం "నటన" అనిపించుకోదు. అందుకే నాగార్జున అన్ని రకాల పాత్రలనూ పోషిస్తూ "నటన"కు అర్థాన్ని సమర్ధవంతంగా చెప్పగలుగుతాడు అన్నదానికి అరణ్యకాండ, సంకల్పం, మజ్ను వంటి చిత్రాలు ఉదాహరణలు. "నటన" తెలిసిన నాగార్జునకు భవిష్యత్తు బంగారు బాట కాగలదని, ఆంధ్రప్రేక్షకుల ఆశీస్సులు, అండదండలతో నాగార్జున ఉచ్ఛస్థితికి పునాదులు కావాలని ఆశిస్తున్నాను.

-పలివేటి నరసింహారావు,
గాంధినగరం, విజయవాడ

★ ★ ★

నా అభిమాన నటి, జాతీయ 'ఉత్తమ నటి' అవార్డు గ్రహీత, నేటి మేటి సూపర్ హీరోయిన్, సుమధుర చిరుదరహాసిని "సుహాసిని". మహిళా ఛాయాగ్రాహకురాలిగా చిత్ర సీమలోకి ప్రవేశించి, హఠాత్తుగా అవకాశం, అదృష్టం వెంటాడగా, నటిగా మారి, అనతికాలంలోనే అగ్ర నటీమణుల స్థానానికి చేరి, చిత్రసీమను, ముఖ్యంగా స్త్రీ లోకాన్ని తన నటనా ప్రతిభతో ఆకట్టుకుంది. ఎట్టి



నటనానుభవం లేకుండా, నటనాలయంలో ప్రవేశించి, అ, ఆ లు నేర్చుకుని, వానికి మెరుగులు దిద్ది, అందలి మెలుకువలను నేర్పుగా గ్రహించి, వాటిని తన హావభావ ప్రకటనలతో వెలువరించి, అత్యల్ప వ్యవధిలో ఊహకందని నటనాకాశంలో తానొక తారగా నిలిచింది. బహుశా ఇట్టి కీర్తి ప్రతిష్ఠలు ఈ ఒక్క నటికే పరిమితమేమో! 'స్వాతి'తో అటు పరిశ్రమ, ఇటు ప్రజల మెప్పు పొంది "స్రవంతి"గా నిర్మాత నాదుకుని 'సింధు భైరవి' తో జాతీయ ఖ్యాతి నార్జించి, దేశంలో దక్షిణాది సినీ పరిశ్రమకే వన్నె తెచ్చిన చిలిపి హాసిని.

తన నటనా శక్తితో, సమాజంలో స్త్రీని సబలగా నిరూపిస్తూ, పాత్రలకు జీవం పోసింది. కాని ఈ నటి తన మాతృ భాషారంగాన్ని చిన్న చూపు చూడటం అభిమానులను బాధిస్తుంది. తన నటనకు జన్మనిచ్చిన ఆ రంగాన్ని నీచంగా కాక, గౌరవంగా చూడడం నేర్చు కోవాలి. ఆమెనటిగా కాక, ఒక సామాన్య వ్యక్తిగా ఇది గ్రహించాలి. అంతే, ఇలానే తన ఇమేజ్ దెబ్బతినకుండా, అన్ని రకాల పాత్రలను పోషిస్తూ, అంతర్జాతీయ స్థాయిలో మన పరిశ్రమకు గొప్ప పేరు తేవాలని నా మనవి.

-బి. లీలావతి, తిరుపతి

★ ★ ★

అనతి కాలములోనే ఆరున్నర కోట్ల ఆంధ్రుల అభిమానాన్ని చూరగొన్న సక్సెస్ ఫుల్ హీరో యువకిశోరం నందమూరి బాలకృష్ణ నా అభిమాన నటుడు. బాలకృష్ణ గారు "రాం రహీం" చిత్రం ద్వారా తెలుగు వెండి తెరకు పరిచయమై, "ఇంతింతై వటుడింతయై" అన్నట్లుగా నేటి సినీరంగములో ఎంతో ఎత్తు ఎదిగి, నేడు సినీ వినీలాకాశములో సూపర్ స్టార్‌గా వెలుగొందుతున్నారు. "మంగమ్మ



గారి మనవడు" చిత్రములో క్లాసును మాసును సమానంగా మెప్పించి ప్రేక్షకులలో తనకంటు కొంత ఇమేజ్‌ను ఏర్పరచు కొన్నారు. ఆ తర్వాత "డిస్కోకింగ్", "ఆత్మబలం", "జననీ జన్మ భూమిశ్చ", "కత్తుల కొండయ్య", "నిప్పులాంటి మనిషి" మొదలగు చిత్రాలలో నటించి, "కథానాయకుడు"గా ఆరున్నర కోట్ల ఆంధ్రులతో "పట్టాభిషేకం" చేయించుకొన్న బాలకృష్ణ గారు నేడు "ముద్దుల క్రిష్ణయ్య", "సీతారామ కల్యాణం", "దేశోద్ధారకుడు", "అనసూయమ్మ గారి అల్లుడు" చిత్రాల విజయ పతాకాలను వరుసగా ఎగురవేసి, "కలియుగ కృష్ణుడు"గా ఆంధ్రప్రదేశ్ అంతటా విజయఢంకా మ్రోగిస్తూ " కాదు కాదు ఇది అక్షయనామ సంవత్సరము అచ్చంగా మన బాలకృష్ణయ్య సంవత్సరము" అని ఋజువు చేశారు. కథాబలం గల చిత్రాలలోనూ, వైవిధ్యం గల పాత్రలలోనూ నటించే బాలకృష్ణ తండ్రికి తగ్గ తనయుడు అని, సెన్సేషనల్ హీరో అని నిరూపించు కున్నారు. బాలకృష్ణ నటించిన 'నటరత్న' "అపూర్వ సహోదరులు", "స్మామాట్" చిత్రాలు కూడా విజయవంత మవుతాయని, ప్రేక్షకుల మన్ననలను పొంది "యువరత్న"గా ఉండిపోతాడని నా నమ్మకము.

-యక్కలి శ్రీనివాసరావు, నందిగామ

★ ★ ★

నా అభిమాన నటి శారద. ఆమె నటించే ప్రతి చిత్రాన్ని విడువకుండా చూస్తుంటాను. ఆమె ప్రతి చిత్రంలో నటిస్తారు అనే దానికంటే జీవిస్తారనే చెప్పాలి. నటన అన్న పదానికి అర్థం చెప్పగల



నటీమణులలో శారదగారొకరు. ఆమె నటనలో వైవిధ్యం కన్పిస్తుంది. ఆమె గొప్పనటి అని చెప్పడానికి "మనుషులు మారాలి" ఒక్క చిత్రం చాలు. ఈ చిత్రం ద్వారా శారద ప్రేక్షకుల హృదయాలలో చిరస్థాయిగా నిల్చిపోయారు. ఆమె మోడరన్ దుస్తులు ధరించరు. ఆమె కట్టు, బొట్టు తెలుగింటి ఆడపడుచులా నిండుగా వుంటుంది. ఆమె నిగర్వి. ఎంతో మందికి గుప్తదానాలు చేశారు. మంచి మనస్సున్న మహానటి శారద. "అనసూయమ్మ గారిఅల్లుడు" చిత్రంలో కాస్త శారద నటన ఎబ్బెట్టు అన్పించింది. ఇక మీదట జాగ్రత్త పడగలరు. ముందు ముందు మంచి కుటుంబ గాథా చిత్రాలలో నటించి మమ్ముల నానందింప చేయగలరని అభిమానిగా నా కోరిక.

-కె. సరస్వతి, నార్తురాజుపాళెం
(నెల్లూరు)

★ ★ ★

నా అభిమాన నటి జయప్రద. అందానికి మారు పేరు జయప్రద. ఆమె నటించిన సినిమాలు 50% చూసి ఉంటాను. నేను "సిరిసిరిమువ్వ" సినిమా చూసి అభిమానిని అయ్యాను. ఆమె పోషించని పాత్రలు చాల ఉన్నాయి. తెలుగు చిత్రాలే కాక హిందీ చిత్రాలలో కూడ మంచి పేరు సంపాదించడం



మన్నందరికు నాకు చాల సంతోషంగా ఉంది. ఆమె నటించే చిత్రాలు ఈ మధ్య చాల తక్కువగా విడుదల అవుతున్నాయని నేను అనుకుంటున్నాను. ఆమె లాయరు, ఇంజనరు, లెక్చరరు, కలెక్టరు, ఇప్పుడు వాటి వంటి పాత్రలు పోషించాలని నా కోరిక. 'సింహాసనం' చిత్రంలో యువరాణిగా చాల బాగా నటించారు.

-ఎ. అనంత లక్ష్మి, తాళ్ళూరు
(తూ. గో. జిల్లా) ☐

సీరియల్:

# నిశ్శబ్ద సంగీతం

బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

మర్నాడు సాయంత్రం ఆరు గంటలైంది వెంకాయమ్మతో కబుర్లు చెబుతూ డాబామీద కూర్చొంది రమ

గేటు తెరుచుకొని ఎవరో లోనికి వస్తూండటం గమనించింది వెంకాయమ్మ వాళ్లని రమకి చూపిస్తూ-

ఎవరో వస్తున్నారు' అంది

అన్నయ్య కోసం ఎవరో అనుకొంటా' అంది రమ

ఒక యువకుడూ, యువతీ మూడేళ్లబ్బాయిని కూడా తీసుకుని లోనికి వస్తున్నారు

గబగబా యిద్దరూ మేడ దిగారు వారిని లోనికి ఆహ్వానించి సోఫాలో కూర్చోమంది రమ

ఎవరమ్మా వచ్చారు? హాల్లోకి వస్తూ అడిగారు అనసూయమ్మ

అన్నయ్య స్నేహితులమ్మా' చెప్పింది రమ

అలాగా బాబూ' వాడు లేడు' అత్తయ్యగారికి సుస్తీగా వుందని కబురొచ్చింది' మనవణ్ణి తీసుకుని రాజమండ్రి వెళ్లాడు రెండు, మూడు రోజుల్లో వస్తాడు'

అన్నారు ఎదురుగా కుర్చీలో కూర్చుంటూ

రేపు మా అబ్బాయి పుట్టిన రోజండి' రఘునాధ్‌గార్ని వారి సతీమణిగారినీ ఆహ్వానించాలని వచ్చాం' సమయానికి వారు లేరు' నిరుత్సాహపడ్డారు వారు

అలాగా బాబూ' చాలా సంతోషం' ఆ జంటను చూసి ముచ్చటపడ్డారు అనసూయమ్మ

సరైన జోడు' చూడముచ్చటగా వుంది' అనుకున్నారు తల్లి ఒడిలో కూర్చున్న బాబుని చూసి-

పేరేమిటమ్మా? అడిగారు

నా పేరు జానకి' వారి పేరు జానకిరాం'' చెప్పిందామె. ఆమె అడిగింది ఆ దంపతుల పేర్లు కాదు' అయినా ఆమె చెప్పింది

చాలా బావున్నాయమ్మా పేర్లు' అంతటి అన్యోన్యతతో కలకాలం జీవించండి' అని దీవించి మీ అబ్బాయి పేరేమిటమ్మా' అంటూ అడిగారు

మా బాబుకి మా మావగారి పేరు పెట్టామండి' సత్యరామశర్మ' అని చెప్పి భర్తను ఓరకంట చూసిందా యిల్లాలు

వెంటనే అందుకొన్నాడు జానకిరాం

కాదండీ' మా మామగారి పేరే పెట్టాం'

భార్య స్టేట్‌మెంట్‌ని ఖండిస్తూ ఆమెపై చిరునవ్వులు విసిరాడు చిరుకోపం అభినయించిందా యువతి

వారి సరస సంభాషణలను విని సంబరపడ్డారు అనసూయమ్మ

అయితే వియ్యంకులిద్దరి పేర్లూ ఒక్కటేనన్న మాట' తేల్చి చెప్పారు

అదేమీ కాదు పిన్నిగారూ' మా మావగారి పేరు రామశర్మగార్లు మా తండ్రిగారి పేరు సత్యనారాయణ మా అదబడుచు పెళ్లి అన్నవరం కొండమీద చేశాం అప్పుడు బాబు కడుపులో వున్నాడు సత్యదేవుని పేరు పెట్టాలని మీలాంటి పెద్దలందరూ సలహా యిచ్చారు వారికేమో తండ్రిగారి పేరు పెట్టుకోవాలని వుంది అందుకని ముందు సత్యదేవుని పేరు పెట్టి తరువాత మావగారి పేరు తగిలించారు సత్యరామశర్మ అని

వివరంగా చెప్పిందామె భర్తను ఊరిస్తూ

'ఇంతకీ ఏ పేరుతో పిలుస్తారు?

కుతూహలంగా అడిగింది రమ

"బాబు' అని పిలుస్తాం' లేకపోతే ఆమెకు కోపం వస్తుంది' అన్నాడు జానకిరాం భార్యను ఉడికించాలని

భర్త మాటను వెంటనే ఖండించిందామె

'అది కూడా మామగారి పేరేనండి' మా మామగారు వారి తండ్రిగారికి ఏకైక పుత్రులు' వాత్సల్యంగా 'బాబూ'' అని పిల్చుకొనేవారట' ఇప్పుడు చెప్పండి పిన్నిగారూ' మా అబ్బాయిది ఎవరి పేరో' చొరవగా అడిగిందామె

జానకిరాం ఓటమిని అంగీకరించినట్టు మొహం పెట్టక తప్పలేదు

'పోనీండమ్మా' భర్త ఆనందమే భార్యకు ఆనందం' అలాగే పిలవండి' ఇలారా బాబూ' చేతులు జాపారు అనసూయమ్మ ఆప్యాయంగా

బాబు చొరవగా ఆమె దగ్గరకెళ్లాడు బిస్కట్లు అందించింది రమ

మీ పుట్టింటి వారిదే వూరమ్మా!' కుశల ప్రశ్నలు వేయనారంభించారు అనసూయమ్మ

"కాకినాడ దగ్గర సర్పవరమండి' నాన్నగారు పోయి పది సంవత్సరాలైంది అమ్మ నా పెళ్లయిన ఆర్నెల్లకి అంటే నాలుగేళ్ల క్రితం పోయింది ఒక్క అన్నయ్య ఉన్నాడు సునాబెడాలో ఎయిరోనాటిక్స్‌లో పనిచేస్తున్నాడు వాడి సంసారం వాడిది ఇప్పుడు నాకు తల్లీదండ్రి వీరేనండి' పుట్టినిల్లూ, మెట్టినిల్లూ యిదేనండి' నా పతి దేవుడే నాకు దైవం' కృతజ్ఞతగా భర్త వైపు చూసింది

'అంతేనమ్మా' పెళ్లయ్యాక తల్లీ, తండ్రి, దైవం అన్నీ భర్తే' వంత పాడారు అనసూయమ్మ

అందుకే నిద్ర లేవగానే వారి పాదాలకి నమస్కరిస్తానండి' ఆ తర్వాత దైవపటానికి నమస్కరిస్తా' మీరు నమ్మకపోవచ్చు' అంటూ భర్త మొహంలోకి మరో సారి చూసిందామె ఆ చూపుల్లో ఆప్యాయత' అనురాగం' కృతజ్ఞతాభావం'

**జరిగిన కథ-13** రమ గర్భవతయింది తనకి రఘుని వివాహం చేసుకొనే ఉద్దేశ్యం లేదని ఉష రఘుతో చెపుతుంది రేణుకాదేవిని కలిసానంటూ హనుమాన్‌ప్రసాద్ అనే అతడు లక్నో నుంచి పంపిన టెలిగ్రామ్ చదువుకుని లక్నో వెళ్లిన రఘుకి ఎప్పటిలా నిరాశే ఎదురయింది వ్యథిత హృదయంతో హైదరాబాదు చేరుకున్నాడు రఘు కలకత్తా డైమండ్ హవుస్ నుండి సుజాత సహాయంతో బయటపడి ఇంచుమించు మతిస్థిమితం లేని స్థితిలో నున్న రేణుకి శ్రీపతి- రాజేశ్వరి దంపతులు ఆశ్రయం ఇచ్చారు. ఆమెకు ఒక సైకియాట్రిస్టు దగ్గర ట్రీట్‌మెంటు ఇప్పించసాగారు శ్రీపతిగారి ఉత్తరం చూచుకొని కొడుకుతో ఖర్గపూర్‌కి ప్రయాణమయ్యాడు రఘు రఘు స్నేహితుడు జానకిరాం ఇంటికి వెళ్లింది రమ

ఆయన ప్రసన్నంగా భార్యను చూసారు.

ఆ దంపతుల అన్యోన్యానురాగాలను చూసి మురిసిపోయారు అనసూయమ్మ. ఎంత అదృష్టవంతురాలు అనుకొన్నారు. వెంకాయమ్మ ట్రేతో కాఫీ తెచ్చారు. ఒక్కొక్కరికీ అందించింది రమ.

"మీకు శ్రమిచ్చాం!" కాఫీ అందుకొంటూ అన్నారు జానకిరాంగారు.

"మీరే శ్రమ తీసుకొని అంత దూరంనుంచి వచ్చారు! తీరా వచ్చాక వాళ్ళిద్దరూ లేరు!" నొచ్చుకొన్నారు ఆమె.

"సరి మేం వస్తామండి!" అంటూ లేచారా దంపతులు.

"అన్నయ్య రావడానికి నాలుగు రోజులు పట్టొచ్చు!" అంది రమ, ఆమెకు బొట్టు పెడ్తూ.

"వారొచ్చాక మరోసారి కలుస్తాం!" అంటూ కదిలారు జానకి, జానకిరాం. బాబు చేతిలో రెండు ఆపిల్సు వుంచింది రమ. అనసూయమ్మకు నమస్కరించిందామె.

"ఏ ఎడబాటూ లేకుండా భర్త ఆదరాభిమానాల్తో నూరేళ్ళు జీవించు!" దీవించారు అనసూయమ్మ. వారు వెళ్తుంటే తన కొడుకు కోడలూ గుర్తొచ్చారు అనసూయమ్మగారికి ... నిట్టూర్చారు.

"ఆ దంపతులపై నీ అభిప్రాయం ఏమిటమ్మా!" అడిగింది రమ తల్లిని.

"అచ్చం సీతారాముల్లా వున్నారమ్మా! వారి అన్యోన్య దాంపత్యం చూస్తే ముచ్చటగా వుంది!"

"ఆ జానకి చాలా అదృష్టవంతురాలమ్మా!" అంది రమ.

"అవును రమా! భర్త అనురాగ సముద్రంలో మునిగి తేలాలనే కదా ప్రతి స్త్రీ కోరుకుంటుంది!"

"అది కాదమ్మా! సరిగ్గా ఒకసంవత్సరం క్రిందట ఏం జరిగిందో తెల్సా?" అంది తల్లితో తాను చెప్పబోయేదానికి నాందిగా.

"ఏం జరిగింది?" ఆతృత పడింది తల్లి.

అన్నయ్య చెప్పిన విషయాలన్నీ యథాతథంగా చెప్పింది రమ.

అంతా విని సంతోషించారు అనసూయమ్మ.

"ఆడదాని జీవితం పుష్పం లాంటిది రమా! భర్తతో సహజీవనం సాగించి మాతృమూర్తి అయినప్పుడే స్త్రీకి పరిపూర్ణత సిద్ధిస్తుంది. జీవితం సార్ధకమౌతుంది. అలాగే పుష్పంకూడా. మొక్కనుండి త్రుంచబడి మగువ జడలో తురుముబడినప్పుడే దాని అందం ద్విగుణీకృతం అవుతుంది. జడ నుండి జారిపడిందా పాదాల కింద పడి నలిగిపోతుంది. నశిస్తుంది. అటువంటి ఆదర్శపురుషుణ్ని, ఔదార్యమూర్తిని భర్తగా పొందిన జానకి నిజంగా అదృష్టవంతురాలే! వారి అన్యోన్యానురాగాలే వారి పునఃసంధానానికి దోహదం చేసాయ్! అందుకే జానకికి భర్తంటే ఎనలేని భక్తి! గౌరవం!! అభిమానం!"

తల్లి అభిప్రాయం విని "అమ్మా!" అంది రమ.

"ఏవిటి రమా?"

"ఆ జానకిలాగే నీ కోడలు కూడా సుడిగుండంలో చిక్కుకొందనుకో! ఏం చేస్తావ్?"

"ఏవిటి రమా నీవనేది?" భయాందోళనల్తో తల్లడిల్లారు అనసూయమ్మ.

"చెప్పమ్మా ఏం చేస్తావ్? ఆమె తిరిగి వస్తే, ఆమెను పరిగ్రహించి నూతన జీవితాన్ని ప్రసాదించమని సహృదయంతో నీ కొడుక్కి సలహా యిస్తావా? లేక త్యజించమని శాసిస్తావా?"

"నీ మాటలు అర్థంకావడంలేదు రమా!" భయంతో కంపించిపోయారు ఆమె.

"చెప్పమ్మా అటువంటి స్థితిలో రేణు తిరిగివస్తే ఏం చేస్తావ్?" రెట్టించింది రమ, తల్లి కళ్ళలోకి సూటిగా చూస్తూ.

"మా గృహలక్ష్మి తిరిగివస్తే అంతకన్నా ఆనందం ఏముంది! మీ అన్నయ్యకు నూతన జీవితం ప్రసాదించడమే నాక్కావాలి!

మా యిల్లు నందనవనం కావాలన్నదే నా కోరిక! చెప్పు రమా! రేణు ఎక్కడ వుంది? ఎలా వుంది?"

కూతురి చేతులు పట్టుకుని ఉద్రేకపడుతూ వూపారు అనసూయమ్మ.

"వస్తుందమ్మా! మన గృహలక్ష్మి తప్పకుండా తిరిగివస్తుంది. విషాదపుటలల తాకిడికి తల్లడిల్లుతూన్న ఈ యింటిని త్వరలో ఆనందసాగరపు వుప్పెన వచ్చి ముంచెత్తి వేస్తుందమ్మా! విషాదపుటలలు సృష్టించిన ఘోషను తరిమేసి ప్రశాంతత చేకూరుస్తుంది!"

"అంతటి అదృష్టం వుంటుందా?" దీనంగా తల్లి అడుగుతూంటే జాలేసింది రమకి.

"త్వరలో నే వస్తుందమ్మా!"

నమ్మలేని విషయంలా తోచినా నమ్మారు అనసూయమ్మ. ఆనందపరవశం చెందారు.

సాయంత్రం నాలుగ్గంటలయింది. డాక్టర్ రామారావుగారి దగ్గరకి చెకింగ్ కోసం శ్రీపతిగారి అమ్మాయి సరోజనిని తీసుకెళ్ళింది రేణు. ఇంట్లో వంటరిగా వున్న రాజేశ్వరికి ఏమి తోచలేదు. అటూ ఇటూ పచార్లు చేయసాగింది. రెండు చేతుల్లోనూ బుట్టల్తో వచ్చాడు రావులు. బుట్టల్ని గదిలో ఒక మూల వుంచి తిరిగి వీధిలోకి వెళ్ళాడు.



# నిశ్శబ్ద సంగీతం

"ఏమిటి ఏమ్మా!" అనుకొంటూ బుట్ట మూతని పత్తిగించి చూసింది రాజేశ్వరి. ఆశ్చర్యపోయింది. అందులో గులాబీలూ - చామంతులూ వున్నాయ్. ఇంకొక రెండు పొట్లాలతో మళ్ళీ వచ్చాడు రావులు.

"ఆ పొట్లాల్లో ఏమున్నాయ్?" అనడిగింది రాజేశ్వరి.

"పూలు స్వీట్లమ్మగారూ!" చెప్పాడు రావులు.

"ఏ ఇంజనీరుగారింటికో తీసుకొని వెళ్ళమనుంటర్రా! నువ్వొక వెంగళప్పాయిలా కానివి!" విసుక్కొంది రాజేశ్వరి.

"లేదమ్మగారూ! మనింటికే!" చెవిటో డన్నందుకు వాడికి కొంచెం పౌరుషం వచ్చినా సమ్మతిగా అన్నాడు.

"ఎవరికో పంపిస్తారు కాబోలు! జాగ్రత్తగా ఆ బీరువాలో పెట్టు!" అంది.

"ఎవరికో కాదు! మనకే!" అంటూ ప్రవేశించారు శ్రీపతిగారు.

"పువ్వుల వ్యాపారం కూడా చేద్దామనుకొంటున్నారా?" వేళాకోళంగా అడిగింది.

"మీ కోసమే తెచ్చా!" చెప్పారు.

"అన్ని పూలు మాకెందుకు? ఎవరైనా వూరికినే యిచ్చారా?" ఆశ్చర్యంగా అడిగింది.

"పూలు తెస్తే కోపగించుకొనే పూబోణిని నిన్నొక్కరినే చూసా!"

ఆరాధనగా చూస్తూ భార్యను సమీపించారు శ్రీపతిగారు. కొంచెం ఎడంగా జరిగింది రాజేశ్వరి.

"మరోసారి షష్ఠిపూర్తి చేసుకోవాలని వుందా?" అడిగింది క్రీగంట చూస్తూ.

"చేసుకొంటే నీకభ్యంతరం లేదుగా!" ఆశగా భార్య కళ్ళలోకి చూస్తూ బుగ్గ నిమిరారు.

"పోండి! సరసం!" భర్త చేతిని విదిలిస్తూ మూతి త్రిప్పుకొంది అనురాగాన్ని చిందిస్తూ.

"వయసు ముదురుతున్నకొద్దీ మరీ చిన్నవాళ్ళైపోతున్నారు!" అంది ఆనందాన్ని ప్రకటిస్తూ. ఆమెను మరీ ఆడించాలనుకొన్నారు శ్రీపతిగారు.

"నీలో అందమూ ఆకర్షణా వున్నంతకాలమూ నేను కుర్రవాణ్ణేనే పిచ్చిదానా!" అన్నారు మరి కాస్త దగ్గరగా జరుగుతూ. ఆమె చెంపలను రెండు చేతులతోనూ తాకారు. ముందుకి వంగారు.

"ముసలితనం ముంచుకొస్తున్నకొద్దీ ముద్దులూ ముచ్చట్లూ మరీ ఎక్కువైపోతున్నాయ్!"

భర్తను వెనక్కి నెట్టి పక్కకు చూస్తూ ముసిముసి నవ్వులు ఒలకబోసింది రాజేశ్వరి.

"ముసలైనప్పుడే ముద్దు పెట్టుకోమన్నాడో బుద్ధిమంతుడు! తరుణం మించిపోనీయకూడదవే తరుణీమణీ!" అంటూ భర్త తనను మరలా సమీపించబోతుంటే, ఎమురుగా వున్న నిలువుటద్దంలో రావుల్ని చూసింది రాజేశ్వరి.

"ఊరుకోండి రావులు చూస్తున్నాడు!" అంది గుసగుసలాడినట్లు మెల్లిగా...

తప్పని వెనక్కు తిరిగారు శ్రీపతిగారు. అంతవరకూ వారి చేష్టలు చూసిన రావులు ముసిముసిగా నవ్వుకుంటూ బయటకు నడవడం కంటపడింది.

"మన మాటలు విన్నాడంటావా?" అన్నారు.

"ఆ మన చేష్టలు కూడా చూసాడు!" అంటూ కిలకిలా నవ్వింది-

"చూస్తే చూడనీ! ముసలాళ్ళు ముచ్చటలాడుకొంటున్నారనుకొంటాడు!" తెగించారు.

"అయితే ముసలాడినని ఒప్పుకొన్నట్టేగా!" రెట్టించింది జాణలా.

"తల పండిందిగా! ఒప్పుకొన్నా! అది సరే! మరి పిల్లలేరీ?" అడిగారు.

"సరోజిని వారానికోసారి చెక్ చేయించుకోడానికి డాక్టరుగారు రమ్మన్నారుగా! రేణూ అదీ కల్సి వెళ్ళారు. వచ్చే వేళయింది! పిల్లలెక్కడో బయట ఆడుకొంటున్నారు!" చెప్పింది.

"సాయంత్రం ఆరుగంటలకి ఎక్స్‌ప్రెస్‌లో అల్లుడుగారొస్తున్నారు హైదరాబాదు నుంచి!"

భర్త మాటలకి ఆశ్చర్యపోయింది రాజేశ్వరి.

"మొన్ననే కదండి హైదరాబాదెళ్ళారు!" అంది.

"మన సరోజిని మొగుడు కాదే మొద్దు మొహమా! రేణు భర్త రఘునాథ్‌గారొస్తున్నారు! వస్తున్నట్టు టెలిగ్రాం యిచ్చారు!" వివరంగా చెప్పారు శ్రీపతిగారు.

రాజేశ్వరి మొహం చాటంతయింది.

"ఈ సంగతి తెలిస్తే రేణు ఎగిరి గంతేస్తుందండి! ఆ సమయంలో దాని మొహం ఎలా వుంటుందో చూసి ముచ్చటపడాలని వుందండి! పిచ్చి పిల్ల! భర్త సాన్నిధ్యం కోసం పరితపించి పోతోంది!

సంతోషంతో వుబ్బితబ్బిబ్బైంది రాజేశ్వరి.

"ఈ విషయం ఆమెతో ముందుగా చెప్పేవ్! కొంప మునుగుతుంది! అతను రావడం ఆలస్యం అయినా ఏ కారణంచేతనైనా రాలేకపోయినా మళ్ళీ అప్సెట్ అవుతుంది! తెల్సిందా?"

భార్యను హెచ్చరించారు శ్రీపతిగారు.

అంతలో సరోజినీ, రేణూ రావడంతో వారి సంభాషణ ఆగిపోయింది.

"స్వీట్సు అయితే ఎలాగో తినేస్తాం! ఇన్ని పూలు ఏం చేసుకోమంటారు?" భర్తను నిలదీసి అడిగింది రాజేశ్వరి.

ఆ అసందర్భపు ప్రశ్నకు ఆశ్చర్యపోయిన శ్రీపతిగారు సమాధానం చెప్పలేదు. తెల్ల మొహం వేశారు.

"ఏమిటమ్మా స్వీట్సూ, పువ్వులూ అంటున్నావ్?" తల్లిని సమీపిస్తూ అడిగింది సరోజిని.

"ఇంజనీర్‌గారింట్లో ఏదో ఫంక్షన్ వుందని పిలిస్తే స్వీట్సూ పువ్వులూ పట్టించుకొని వెళ్ళారమ్మా మీ నాన్నగారు! తీరా వెళ్ళేక తెల్సిందట! వారి తల్లిగారికి జబ్బుగా ఉందని ఫంక్షన్ కేన్సిలు చేసుకొని కలకత్తా వెళ్ళారని. ఇన్ని పూలు ఏం చేసుకొంటాం అని అడుగుతున్నా!"

కల్పించి చాకచక్యంగా భార్య చెబుతూంటే ఆమె సమయస్ఫూర్తికి అచ్చెరువొందారు శ్రీపతిగారు.

గబగబా పూలగంప దగ్గరకెళ్ళింది సరోజిని. గులాబీలూ, చామంతులూ వున్నాయ్. మురిసిపోయింది. గుప్పెట నిండా గులాబీలు తీసి రేణుకి అందించింది. నాలుగు పూలు తల్లో పెట్టుకొంది- కొన్ని పూలు తల్లికందించింది.

"ముగ్గురున్నారు కదా పెట్టుకోండి!" అన్నారు శ్రీపతిగారు.

"అవునమ్మా! గులాబీలు జడకుట్టుకొందాం!" సంబరపడింది సరోజిని.

"మీ ఆయన ఈవేళవరకూ వున్నా బాగున్ను! మరోసారి సీమంతం చేసి వుందుం!"

వేళాకోళం చేసింది రేణు.

అర్జంటు పని వుందంటూ బయటకు వెళ్ళారు శ్రీపతిగారు.

అంతవరకూ వీధిలో ఆడుకొని తిరిగివచ్చారు సరోజిని పిల్లలిద్దరూ. వస్తూనే రేణూని కావలించుకొని చనువుగా-

"ఆకలేస్తోంది ఆంటీ! అన్నం పెట్టు!" అంటూ మారాం చేయనారంభించారు.

"చీకటైనాపడలేదు! అప్పుడే భోజనమా!" పిల్లల్ని కసిరింది సరోజిని.

"పాపం! ఆడుకొని అలిసిపోయి వచ్చారు! ఆకలేస్తోంది కాబోలు!" జాలిపడింది రేణు. వాళ్ళిద్దర్నీ అన్నం పెట్టడానికి డైనింగ్ రూంలోకి తీసుకు వెళ్ళింది రేణు. ఆమె వెళ్ళాక కూతుర్ని దగ్గరగాపిల్చి ఏదో చెప్పింది రాజేశ్వరి.

పిల్లలకి భోజనాలు పెట్టి తిరిగివచ్చింది రేణు.

"చామంతి పూలు రెండు రోజులైనా వుంటాయ్! గులాబీలు జడ కుట్టుకుందాం రేణూ!" అంది సరోజిని.

"నాకెందుకు? నువ్ కుట్టుకో!" విరక్తిగా అంది రేణు.

"ఇద్దరూ కుట్టుకోండి! పూలు వద్దనుకూడదు!"

సమాధానపరచింది రాజేశ్వరి.

(ఇంకా ఉంది)

# శ్రీశైల దివ్యక్షేత్రములో నూతన శిల్పసౌందర్యాలు

## శ్రీ భ్రమరాంబాదేవి ఛత్రపతి శివాజీకి ఖడ్గ ప్రదానము చేయుట : -

క్రీ. శ. 1660 ప్రాంతములో మహారాష్ట్ర వీరుడైన ఛత్రపతి శివాజీ అలనాటి పాలకులైన మహమ్మదీయ సామ్రాజ్యవాసులు చేయు కిరాతక చర్యలను ఎదుర్కొని హిందూ సామ్రాజ్యము స్థాపించ సంకల్పించెను. వారిని ఎదుర్కొంటు ప్రారంభ దశ కాన సరియైన బలములో పించి తురుష్కులచేత పరాజితుడై మిగిలిన తన కొద్దిపాటి సైన్యమును తీసుకొని నల్లమల కొండలలోనికి పారిపోయెను. అక్కడ పార్వతీ పరమేశ్వర నిలయమైన శ్రీశైలములో విడిదిచేసి చిన్న ధ్యానమందిరము నిర్మించుకొని దగ్గరననే యున్న పరాశక్తి అయిన శ్రీ భ్రమరాంబాదేవి ఆలయములో కఠోర దీక్షతో తపము ఆచరించెను. దేవి సంతసించి కారణ జన్ములైన శివాజీకి మహత్తరమైన ఖడ్గము ప్రసాదించి విజయుడవు కమ్మని అంతర్థానమయ్యెను. సదరు ఖడ్గదారుడై వెయ్యి ఏనుగుల బలముతో తిరిగివచ్చి ఢిల్లీ పాలకుల అధీనములో నున్న పెక్కు ప్రదేశములపై దాడిచేసి స్వాధీనపరచుకొని తన శక్తియుక్తులతో తిరుగులేని వీరుడై హిందూ సామ్రాజ్యము స్థాపించెను. తన భక్తికి నిదర్శనముగా దేవస్థానమునకు ఉత్తరము వైపున బ్రహ్మాండమైన రాజ గోపురము క్రీ. శ. 1667లో నిర్మించెను. అదియే నేటి శివాజీ గోపురము. తను బసచేసి నిర్మించుకొన్న ధ్యానమందిరము వద్ద శివాజీ స్ఫూర్తి ధ్యాన మందిరమును ఒక ప్రయివేటు సంస్థవారు కోటి రూపాయల ఖర్చుతో బ్రహ్మాండమయినధ్యాన మందిరము, రాజదర్బారు నిర్మించుచున్నారు. దేవాలయము, ప్రాకారాదులను పరిరక్షించుట శివాజీ మహారాజు ఒక సైనిక పటాళమును నియమించి యుండెను. వారు 18వ శతాబ్ది ఆఖరు వరకు అక్కడనే యుండి దేవాలయ సంరక్షణలో కొనవూపిరి వరకు పోరాడిరి.

ఛత్రపతి శివాజీ మహారాజువారు శ్రీశైలము విచ్చేసి, అమ్మవారి చేత వరప్రసాదితుడైనది చరిత్రాత్మకమైన వాస్తవమైననూ, సదరు సంఘటనను తెలుపు సాంకేతిక విగ్రహాలు ఎక్కడనూ గోచరించకున్నవి. అందువల్ల శ్రీశైల దేవస్థానమువారు ప్రఖ్యాత అర్గగడ్డ శిల్పులచేత 8-0" అడుగుల శ్రీ భ్రమరాంబా దేవి విగ్రహమున్నూ జీవన పరిమాణంలో (లైఫ్ సైజ్) ఛత్రపతి శివాజీ విగ్రహమున్నూ మోకాలిపై భక్తి ప్రపత్తులతో మోకరించి ఖడ్గము స్వీకరిస్తున్నట్లు చిత్రింపబడినది. మందహాస వదనముతో అమ్మవారు ఖడ్గము ప్రసాదిస్తున్న దృశ్యము చూపరులను తన్మయులను చేయుచున్నది. అమ్మవారి ఆలయ ప్రక్కనున్న నాగావళి తోటలో తోటకు ఈశాన్యము వైపున 8-0" అడుగుల పీఠము పైన ప్రతిష్ఠింపబడినది. శ్రావణ మాసములో ఈ విగ్రహములను ఆవిష్కరించుటకు నిశ్చయించడమైనది.

## చంద్రావతి - శ్రీశైల మల్లన్న తొలి భక్తురాలు

పూర్వము చంద్రగుప్త పురమును ఏలు చంద్రగుప్త మహారాజు ఏకైక పుత్రిక చంద్రావతి. ఈమె పుట్టిన తర్వాత చంద్రగుప్త మహారాజు క్షేత్రయాత్రకు వెళ్లెను. బాల్యము నుండి శివభక్తిపరురాలు. పరమశివుని తప్ప మరే ధ్యాసలేని ఈ భక్తురాలు ఎప్పుడూ శివభక్తితో కాలము గడుపుచూ ఉండెను.. యుక్తవయస్కురాలైన తర్వాత శివాన్వేషణకై బయలుదేరి సమీపములో నున్న కీకారణ్యములో పరమశివునికై వెదుకుచుండెను. క్షేత్రయాత్ర ముగించుకొని తిరిగివచ్చుచున్న చంద్రగుప్త మహారాజునకు అడవులలో తిరుగుతున్న అపురూప సౌందర్యవతియైన కన్న కూతురుని గాంచెను. కారణజన్మురాలైన చంద్రావతి కన్నకూతురని తెలియక మోహావేశ పరుడయ్యెను. విషయము గ్రహించిన ఆ పరమ భక్తురాలు తన తండ్రిని ఘోరముగా శపించి శివాన్వేషణకై కీకారణ్యములోకి వెళ్లిపోయెను. ఒకప్రదేశమున ఆవుల మందలోనుంచి సాక్షాత్తు కామధేనువు అని భ్రమించే ఒక గోవు మందనుంచి బయటకు వచ్చి, పుట్ట వద్ద పాలు సేపుచుంత అపూర్వ దృశ్యము చూచెను. ఈ వింత దృశ్యమునకు పులకితురాలైన చంద్రావతి పుట్ట వద్దకు పోయి మట్టిని తీయగా లింగాకారములో పరమేశ్వరుని గాంచెను. పరవశించిన ఆ పరమ భక్తురాలు అదే ఈశ్వర నిలయముగా భావించి చిన్న గుడిని కట్టించి అపార భక్తితో అక్కడ దొరుకు అడవి మల్లెలతోనూ, అర్జున పుష్పములతోను పూజలు సలుపుచుండెను. ఆ భక్తికి మెచ్చి పరమేశ్వరుడు ఆమెను తనలో ఐక్యము చేసుకొనెను. ఆమెచే పూజింపబడిన పరమేశ్వరుడు మల్లికార్జునుడయ్యెను.

ఈ ఘట్టమును తెలుపు సాంకేతిక విగ్రహాలు ఒక శ్రీశైలం ప్రాకార గోడపై తప్ప మరెక్కడాలేదు. అందువల్ల జీవనప్రమాణములో చంద్రావతి శిలా విగ్రహమున్నూ, మల్లిఖార్జునస్వామి శివ లింగాకారమున్నూ శిలలో చేయించి దక్షిణము వైపున నున్న హరిహర రాయ గోపురము ప్రక్కన 4-0" అడుగుల పీఠము పైన బిగించబడినది. వీటిని కూడా శ్రావణ మాసములో ఆవిష్కరణచేయ నిశ్చయించబడెను.

ఇప్పటికే బహుళ ప్రచారము పొందిన ఈ విగ్రహాలు చూపరులను విశేషముగా ఆకర్షించుచున్నవి. ముఖ్యముగా సూర్యాస్తమైన పిదప విద్యుద్దీప కాంతులలో కన్నుల పండుగగా యున్నది.

వ్యాసం, ఫోటోలు — పి. నాగిరెడ్డి

శ్రీ భ్రమరాంబాదేవి ఛత్రపతి శివాజీకి ఖడ్గ ప్రదానము చేయుట



చంద్రావతి - శ్రీశైల మల్లన్న తొలి భక్తురాలు



పులిగడ్డ విశ్వనాథరావు

# అంతు చిక్కని అంతరిక్ష అతిథులు

అమెరికాలో కెంటంకీలో గాడ్‌మన్ వైమానిక దళం స్థావరం ఆ రోజు అంతవరకు అక్కడ నుంచి ఏ విమానాలు ఎగురలేదని ధృవపరిచింది. దగ్గరగా ఉన్న మార్ర్వెస్ విలేఅనే ఊరిలో పోలీస్ అధికారి అది ఫోనులో విని, "అలాగా! ప్రజలు ఆకాశంలో చిత్రమైన ఆకారాలను చూసినట్లు ఫోన్లు చేస్తున్నారు. గాడ్‌మన్ విమానాశ్రయం నుంచి ఏమైనా ఎగుర వేశారో అని అనుకున్నాను," అని అన్నాడు.

మధ్యాన్నం ఒంటిగంటన్నరకు ఒక అన్ ఐడింటిఫైడ్ ఫ్లయింగ్ ఆబ్జెక్ట్ (క్లుప్తంగా యు. ఎఫ్. ఓ.) అనగా గుర్తు తెలియని ఆకారం విమానాశ్రయం వైపు వస్తున్నట్లు గాడ్‌మన్ రాడార్ సూచించింది. ఈ ఆకారం నైఋతి దిక్కుగా 15 వేల అడుగుల ఎత్తున పయనిస్తోంది. కొన్ని క్షణాల్లో విమానాశ్రయం పైన ఆకాశంలో ఒక విశాలమైన పళ్ళెం (సాసరు) లాంటిది కనబడింది. అది దాదాపు 500 అడుగుల వ్యాసం కలిగి ఉంది. మెరుస్తూ అలా ఆకాశంలో అర్ధగంట తచ్చట్లాడి అది కొన్ని వందల అడుగుల పైకి దూసుకుపోయి మేఘాల్లోకి ప్రవేశించింది. అది అక్కడ లేత ఎరుపు రంగు కాంతి వెదజల్లుతూ మిణుకు మిణుకు లాడసాగింది. విమానా శ్రయం నియంత్రణ కేంద్రంలో సాంకేతిక ఉద్యోగులు ఆ కనబడేది విమానం కాని గాలి బుడగ కాని కాదని ఏకగ్రివంగా నిర్ధారించు కున్నారు.

స్థావరానికి దక్షిణాన పది మైళ్ళదూరంలో అప్పుడు నాలుగు ఎఫ్-51 ముస్టాంగ్ యుద్ధ విమానాలు గాడ్‌మన్ విమానాశ్రయానికి తిరిగి చేరుకుంటున్నాయి. అవి మార్ర్వెస్ విలే పోలీసు అధికారి విమానాశ్రయానికి ఫోను చేసిన తర్వాత బైలుదేరినవి. ఆ దళం నాయకుడు థామస్ మాంటెల్‌ను ఆ ఆకారాన్ని పరిశీలించమని విమానాశ్రయం నియంత్రణ కేంద్రం ఆదేశించింది.

మాంటెల్ తోటి మూడు విమానాల చోదకలను మేఘాల క్రిందనే ఉండమని పురమాయించి తన విమానాన్ని ఎర్రని కాంతి వెదజల్లుతున్న ఆ ఆకారంవైపు తీవ్ర గతితో మళ్ళించాడు. వెంటనే నియంత్రణ కేంద్రం రేడియోలో అతడి గొంతు వినిపించింది. "ఇప్పుడు నేను మేఘంలోకి దూసుకు పోతున్నాను.... చాలా చిత్రంగా ఉంది. అది సరిగ్గా నాపైనే ఉంది. అది అద్భుతంగా ఉంది. అది లోహంతో నిర్మించబడినట్లు ఉంది..... విశాలంగా గుండ్రంగాఉంది. ఒక కొస నుంచి రెండవ కొసకు 500 నుంచి 1000 అడుగులుండవచ్చు.

"అది గంటకు దాదాపు 250 మైళ్ళ వేగంతో ఎగురుతోంది. నేను దాని దగ్గరకు చేరు కుంటున్నాను. అది ఎంత పెద్దదో !!"

"నేను ప్రయత్నించి దాని పైకి పోదామని చూస్తున్నాను..... నేను ఇరవై వేల అడుగుల ఎత్తుకు వెళుతున్నాను. అది పైకి పోతోంది..... అదిగో పైకి పోవనారంభించింది...... అయ్యో, ఎంత చిత్రం. ఇక్కడ వేడిగా ఉంది. ఎంత వేడి! నేను భరించ....." తర్వాత మౌనం. రేడియోలో చప్పుడు ఐంది. అంతే, అంతా నిశ్శబ్దం.

మేఘాల్లో ఎర్రని కాంతి నారింజరంగుకు మారి మాయమైంది. మేఘం క్రింద తిరుగుతున్న మాంటెల్‌తోటి విమానాల చోదకులు,"మాంటెల్ విమానాన్ని మేఘంలోకి చొచ్చుకుపోతూ చూశాం. తర్వాత అతడి విమానం కనబడలేదు, "అని రిపోర్టు చేశారు. మాంటెల్ విమానం ఆచూకీ తెలియక పోయేసరికి దాని అన్వేషణకు గాడ్‌మన్ విమానాశ్రయం నుంచి కొన్ని విమానాలు బైలుదేరాయి. విస్తృత విస్తీర్ణంలో చెల్లా చెదురుగా పడిఉన్న మాంటెల్ విమానం అవశేషాలు వాటికి కనబడ్డాయి. విపరీతమైన వేడిమి వల్లనేమో ఆ అవశేషాలపై గంట్లు, మరకలు ఏర్పడ్డాయి.

అమెరికన్ వైమానిక దళం మాత్రం విమాన నిర్మాణంలో లోపంవలన, దుస్సాహసమైన విన్యాసాలు చేయడంవలన విమానం కూలిపోయిందని ప్రకటించింది. మరి అతడు వెంబడించిన ఆ ఆకారం మాటేమిటి? అబ్బే, అది శుక్ర నక్షత్రం, అది విశాలంగా కనబడి ఉంటుంది అని సర్ది చెప్పింది.

ఐతే ప్రపంచంలో అంతరిక్ష శాస్త్రజ్ఞులు, "శుక్ర నక్షత్రం సామాన్య విమానాశ్రయం రాడార్‌లో కనబడుతుందా? శుక్ర నక్షత్రం లోహంతో నిర్మితమైందా? దాని వ్యాసం వెయ్యి అడుగులా? ఆకాశంలో అది 15 వేల అడుగుల ఎత్తున గంటకు 250 మైళ్ల వేగంతో ప్రయాణం చేయగలదా?" అని ప్రశ్నించికుని నవ్వుకున్నారు.

తమ ప్రకటన హాస్యాస్పదంగా ఉందని అమెరికన్ వైమానిక దళం గ్రహించింది కాబోలు. "వాతావరణ శాస్త్రజ్ఞులు ఆకాశంలో ఎగురవేసే గాలి బుడగను మాంథెల్ విమానం ఢీకొని కూలిపోయింది," అని మరొక వాంగ్మూలం జారీ చేసింది. మొత్తం మీద అమెరికన్ వైమానిక దళం అది ఎగిరే సాసరు (పళ్లెం) అని ఒప్పుకోలేదు.

నిజానికి అమెరికన్ వైమానిక దళం సుదీర్ఘమైన దర్యాప్తు జరిపి ఎగిరే సాసర్ల అస్తిత్వం గురించి యిద మిద్ధంగా ఏమి చెప్పలేక పోయింది. అది యు. ఎఫ్. ఓల గురించి 22 ఏళ్లు దర్యాప్తు జరిపి 1969లో 400 పుటలు గల నివేదిక సిద్ధం చేసింది. అది దర్యాప్తు చేసిన 12618 ఉదంతాలలో 95 శాతం నిరాధారమైనవని నిర్ధారించింది. అనగా

ఇటలీలో బెరినా ఆల్ప్సు పర్వతాలపై జూలై 1951లో కనబడిన ఎగిరే సాసర్. దింట్లోంచి ఒక వింత మానవుడు బైటకు వచ్చి, తిరిగి దాంట్లో ప్రవేశించి ఎగిరిపోయాడట.



ఉల్కలు, గాలి బుడగలు, మేఘాలపైన పడే సర్చిలైట్ల ప్రకాశం, రాకెట్లు, ఎండమావులు, శుక్ర నక్షత్రం, బాల్‌లైట్‌నింగ్ (వాతావరణంలో ఏర్పడ్డ వాయురహిత స్థలంలో వెలుతురు పడగా అది పెద్ద బల్బులా ప్రకాశిస్తుంది అది ఆకాశంలో కదులుతుంది కూడా దీన్ని బాల్‌లైట్‌నింగ్ అంటారు), విద్యుత్ తీగలలోంచి వచ్చే మెరుపులు మొదలగు వాటిని చూసి అవి యు ఎఫ్ ఓ లని కొందరు భ్రమపడ్డారని, మరి కొంతమంది వినోదం కోసం యు ఎఫ్ ఓ లను చూసినట్టు రిపోర్టు చేశారని అమెరికన్ వైమానిక దళం నిర్ణయించింది మొత్తం కేసుల్లో కొన్ని నిజమైన కేసులు లేకపోలేదు కాని వాటి గురించి ఏదో సంజాయిషీ చెప్పి అది తప్పుకుంది కాని యు ఎఫ్.ఓ ల ఉనికిని మాత్రం అది అంగీకరించలేదు అంగీకరిస్తే నిరూపించే బాధ్యత మీద పడుతుందని, అది అసాధ్యమని దాని సమస్య కాబోలు

యు ఎఫ్ ఓ లను చూసినట్టు రిపోర్టు చేసిన వారిలో శాస్త్రజ్ఞులు, డాక్టర్లు, ఇంజనీయర్లు, రచయితలు, ఉన్నతాధికార్లు, ఖ్యాతిగాంచిన మేధావులు కూడా ఉన్నారు వారు పూర్తిగా నమ్మకంలేందే ఉత్త పుణ్యానికి ఇటువంటి రిపోర్టులు చేయరు అంతేకాక అన్ని ఉదంతాలు భ్రమజనితమైనవి కాదు కదా మరొక ముఖ్య విషయం ఏమిటంటే యు ఎఫ్ ఓ ల గురించి ఎన్నడూ విననివారు కూడా వాటిని చూసినట్టు రిపోర్టు చేస్తూ చెప్పిన వివరాలు ఒకే మాదిరిగా ఉంటాయి ప్రపంచంలో మూల మూలల్లో ఉండే ఆ వ్యక్తులు కూడబలుక్కోలేరుకదా. ఒకేమాదిరిగా ఉండే వివరాలు ఏమనగా యు ఎఫ్ ఓ ల గొట్టాల ఆకారంలో కనబడ్డా అవి సామాన్యంగా సాసర్ల రూపంలో ఉంటాయి అవి వివిధ కాంతులను వెదజల్లుతూ తీవ్రగతితో ప్రయాణం చేస్తాయి అవి కనబడిన చోట విద్యుత్ పరికరాలు, రేడియోలు, ఇంజన్లు పని చేయడం మానేస్తాయి

యు ఎఫ్ ఓ లు సామాన్యంగా అమెరికా, లాటిన్ అమెరికా దేశాలలో కనబడుతాయి భారతదేశంలో కూడా వాటిని చూసినట్టు రిపోర్టులు వచ్చాయి కాని వాటి గురించి లాంఛనప్రాయంగా దర్యాప్తు జరుగలేదు యు ఎఫ్ ఓలు చాలాకాలం నుంచి కనబడుతున్నట్టు దాఖలాలు ఉన్నాయి క్రీ శ 763లో ఐర్లాండ్ రాజు రాజ్యాభిషేకం జరుగుతున్నప్పుడు ఆకాశంలో చిత్రమైన యానాలు కనబడ్డాయట క్రీ శ 1752లో స్వీడన్‌లో ఆకాశంలో మెరిసే గొట్టంలోంచి ప్రకాశవంతమైన గోళాలు బైటకు వచ్చాయట ఇరవయివ శతాబ్దంలో యు ఎఫ్ ఓను మొదటిసారిగా ఫ్రాన్సెస్ చైసెస్టర్ అనే ప్రఖ్యాత నావికుడు 1931లో తాస్మాన్ సముద్రంలో చూశాడు

యు ఎఫ్ ఓలను చూసిన వారిలో ఇరవై ఆరుగురు అమెరికన్ అంతరిక్ష యాత్రికులు కూడా ఉన్నారు అమెరికాకు చెందిన జెమిని-4 అంతరిక్ష నౌకలో జేమ్స్ మాక్‌డెవిట్ అనే అంతరిక్ష నావికుడు జూన్

మధ్య బ్రాజిల్‌లో ఏరియల్ అనే గ్రామం వద్ద కనబడ్డ ఎగిరే సాసర్.

1965లో అంతరిక్షంలో బుజాలు కలిగిన గొట్టంలాంటి ఆకారం చూశాడు అప్పుడు అతడి అంతరిక్ష నౌక భూమికి 90 మైళ్ల ఎత్తులో భూమిచుట్టు పరిభ్రమిస్తోంది ఆ ఆకారం ప్రశాంత మహాసముద్రంపైన జెమిని-4కు మూడు మైళ్ల ఎత్తులో ఎగురుతోంది అది అంతరిక్ష నౌకతో సమానంగా కక్ష్యలో ఎగురుతూ దానికి సమీపంగా వస్తోంది మాక్‌డెవిట్ ఇది గమనించి దాన్ని తప్పించుకుందామని అనుకుంటూండగా అది అదృశ్యమైంది మాక్‌డెవిట్ దానిఫొటో కూడా తీశాడు ఐతే అమెరికన్ ప్రభుత్వం అతడు మరొక అంతరిక్ష నౌక పెగాసస్‌ను చూసి భ్రమపడ్డాడని అభిప్రాయ పడింది కాని ఫొటోలు తీసే నిమిత్తం అంతరిక్షంలో పరిభ్రమిస్తున్న పెగాసస్ అప్పుడు అక్కడకు 1200 మైళ్ల దూరంలో ఉందట

యు ఎఫ్ ఓ లలో ప్రయాణీకులను కొంత మంది చూసిన సంఘటనలు కూడ ఉన్నాయి 24 ఏప్రిల్ 1964 తేదీన న్యూమెక్సికోలో సాకొర్రొ అనే ఊళ్ళో లోన్నీ జమెరా అనే గస్తీ పోలీసు మనిషికి యు ఎఫ్ ఓ కనబడగానే దాన్ని తన మోటారు సైకిలుపై వెంబడించాడు అది ఒక మైలు దూరం పోయి భూమిపై దిగింది అది లోహంతో తయారయిన అండాకారపు వస్తువులా ఉంది తిరగబడిన కారు పరిమాణంలో ఉన్న ఆ విమానం ప్రక్కగా పదేళ్ళ పిల్లల సైజులో ఇద్దరు వింత మానవులు నిలబడి ఉన్నారు అతడు తన వద్దనున్న వైర్‌లెస్‌లో తన ముఖ్య కార్యాలయానికి ఈ విషయం చెప్పేలోగా ఆ మానవులు ఆ విమానంలో మాయమయారు

నవంబరు 5, 1975 తేదీ సాయంకాలం ఆరుంపావు గంటలకు అమెరికాలో అరిజోనాలో హెబర్ అనే ఊరి వద్ద ఏడుగురు కట్టెలు కొట్టే కార్మికులు ట్రక్కులో ఇంటికి వస్తున్నారు వాళ్ళకు ఒక ఎగిరే సాసరు కనబడింది వాళ్ళలో ట్రావిస్ వాల్టన్ అనే అతడు దాన్ని పట్టుకోవడానికి ట్రక్కు నుంచి గెంతాడు అతడి తోటి కార్మికులు భయపడి ట్రక్కులో పారిపోయారు కొద్ది రోజులకు వాల్టన్ తిరిగి వచ్చాడు అతడు ఆ సాసరులో వింత మానవులు తనను అపహరించుకుని తీసుకుపోయి సూక్ష్మంగా పరీక్షించినట్టు చెప్పాడు తర్వాత అతన్ని హిప్నటైజ్ చేసి ప్రశ్నించగా ఆ వింత మానవులు మీటరున్నర ఎత్తు ఉన్నారని, బాగా ఎదిగిన గర్భస్థ పిండంలా ఉన్నారని, వాళ్ళకు జుత్తు లేదని, వాళ్ళ కళ్ళు పెద్దవిగా, గోధుమ రంగులో ఉన్నాయని చెప్పాడు అతడు అసత్యం చెప్పడం లేదు కదా అని అతడిపై లయిడిటెక్టర్‌ను (అసత్యవాదాన్ని కనుగొనే యంత్రం) ప్రయోగించారు దాంట్లో అతడు ఉత్తీర్ణుడయాడు

ఈ మానవులు ఇతర లోకాల నుంచి వస్తున్నారని, వారు మనకంటె అన్ని విధాలా ఎన్నో రెట్లు అభివృద్ధి చెందారని, అందువలన వారు మనతో ప్రస్తుతం లావాదేవీలు పెట్టుకో దలచలేదని కొందరు- జావిస్తారు ఏదో సుదూర చల్లబడిన గ్రహంలోని నివాసులు నివాసయోగ్య మైన గ్రహం కోసం అన్వేషిస్తున్నారని కొంత మంది ఊహిస్తున్నారు ఈ సందర్భంలో అమెరికాలో అరిజోనా విశ్వ విద్యాలయానికి చెందిన భౌతిక శాస్త్రజ్ఞుడు చెప్పిన మాటలు గమనించ దగ్గవి యు ఎఫ్ ఓ ల గురించి రెండేళ్ళు నిశిత అధ్యయనం చేశాను అవి ఇతర గ్రహాల నుంచి వస్తున్నా యేమోనని నా సొంత అభిప్రాయం అవి మనను పరిశీలించడానికి వస్తున్నాయేమో! అని అయన పేర్కొన్నాడు

మీ ఇంట్లో అద్దెకిచ్చే పోర్షన్లు ఏమైనా వున్నాయాండీ

రెండు రూంలు ఖాళీ చేయించి ఇస్తా!!

నూతన్

దీపావళి కథల పోటీలో రు.700/- బహుమతి పొందిన కథ

# శిఖరం మీద....

సూర్యుడు నారింజ పండులా పైకి వచ్చేశాడు.

కుళాయి దగ్గర స్నానం చేస్తున్నాడు పట్టాభి. ఆకాశగంగలా నీరు! ధారగా పడుతోంది. ఆ ధారలో వొళ్ళంతా తడుపుకున్నాడు, చల్లగా హాయిగా వుంది.



దోసిలి నిండా నీళ్ళు పట్టి నోట్లో పోసుకుని పుక్కిలించాడు. బట్టతలని కుళాయి క్రిందికి తీసుకొచ్చి, తలని అటూ ఇటూ వంచుతూ కొద్ది సేపు చిన్న పిల్లవాడిలా ఆడుకున్నాడు.




బాత్ రూమ్ గోడలకు అమర్చిన పాలరాళ్ళని చేత్తో తడిమి చూసి, లీలగా వాటి మీద 'శ్రీరామ' రాశాడు. నున్నగా చల్లగా వుంది స్పర్శ.

కుళాయి మూతి దగ్గర అరచేత్తో అదిమి నీటి తుంపరలు ఫౌంటెన్‌లా పడుతుంటే సన్నగా నవ్వుకున్నాడు.

అంగవస్త్రాన్ని విడిచి వొళ్ళంతా రుద్దుకున్నాడు. మళ్ళీ నీటి ధార దేహాన్నంతా తడిపేటట్టు కుళాయి క్రింద కూర్చున్నాడు

శరీరం మీద వెన్నెల సోనలూ, తేనెవాకలూ ప్రవహిస్తున్నట్టు అనిపించింది

స్నానం అయింది స్తోత్ర పఠనం చేస్తూ లేచి

నిలబడ్డాడు ఒళ్ళు తుడుచుకుని బయటికి రాబోయి క్షణం సేపు ఆగేడు వోమూలాగా గోడకి వున్న ఇనప షెల్ఫ్‌లో నాలుగు బట్టల సబ్బులూ, ఆరు స్నానం సబ్బులూ పేర్చివున్నై వాటి ప్రక్కగా వొక పెద్ద సర్ఫ్ పాకెట్, నాలుగు శీకాయ సబ్బులు, రెండు సబ్బు పెట్టెలు వున్నై

వాటి వైపు చిత్రంగా చూసి బయటికి వచ్చాడు ఎన్ని నీళ్ళు ఎన్ని నీళ్ళు! చల్లగా హాయిగా వుంది ప్రాణం గాలిలో తేలిపోతున్నట్టుగా వుంది' అనుకున్నాడు

ఆనంద తరంగాల్లో వోలలాడుతున్న మనస్సు హఠాత్తుగా చూపు మరల్చుకుంది మరుక్షణం పట్టాభి ముఖ కవళికలు మారిపోయినై దేహం ముడుచుకు పోతున్న భావన కలిగింది క్షణం క్రితం తాను అనుభవించిన ఉత్సాహం, ఆనందం, ఆహ్లాదం, హాయి, చల్లదనం కరగిపోయినట్టయినై

దీర్ఘంగా నిట్టూర్చేడు నెమ్మదిగా. యాంత్రికంగా వంటింట్లోకి నడిచి, ఇంత విభూతి తీసి ముఖాన్ని పెట్టుకుని ఓ ప్రక్కగా వేసి వున్న పీట మీద కూర్చోబోతూ ప్రక్కకి చూసేడు

గ్యాస్ స్టవ్ మీద వొక వైపు పాలు కాగుతున్నై పెద్ద స్టీలు గిన్నె నిండా తెల్లని పాలు! మీగడకట్టబోతున్నై మరో వైపు ఇడ్లీపాత్ర వాటి వైపు నింపాదిగా చూస్తూ వుస్సురని నిట్టూర్చేడు

"ఓవర్ హెడ్ టాంక్ వలన నీళ్ళ బాధ లేదు బాగున్నై కదూ!" అడిగింది శారద

ఉలిక్కిపడి ఈ లోకంలో కొచ్చాడు పట్టాభి

"ఆఁ ఆఁ చాలా బావున్నై' అంటూ ఆమె కేసి చూశాడు

అప్పటి కప్పుడే తలారా స్నానం చేసి జుట్టుని వొదులుగా ముడి వేసుకుని, ఫెళఫెళలాడుతున్న సంపంగి రంగు కోటా చీరె కట్టి, అదే రంగు జాకెట్‌తో స్వచ్ఛంగా వుంది శారద నొసట ఎర్రని బొట్టు, చెవులకు ఎర్రరాళ్ళ దిద్దులు, ఎడమ ముక్కుకు వజ్రపు ముక్కుపుడక, మెడలో ముత్యాల దండ, నల్లపూసలు, రెండు పేటల గొలుసు, ఒక్కో చేతికి ఆరేసి బంగారు గాజులు – సిరిసంపదల కలయికకు రూపకల్పనగా కనిపిస్తోంది నిలబడి క్యాబేజీ తరుగుతోంది శారద

చూపు మరల్చుకుని పీట మీద కూర్చుని గాయత్రికి వుపక్రమించాడు

ఒక అరగంట గడిచింది

వాణి, రాజు, రాణి లేచి వచ్చారు తాతయ్యని చూస్తూనే వాళ్ళకి సంతోషమైంది ఉత్సాహంగా కబుర్లలో పడ్డారు పిల్లల ప్రశ్నలకు సమాధానాలు చెప్తున్నాడు పట్టాభి

వాళ్ళేమో తమ యింటిని గురించీ, స్కూలు గురించి విశేషాలన్నీ ఏకరువు పెడుతున్నారు మధ్య మధ్య అవసరమైన వివరణల్ని ఇస్తూ, తన పని తాను చేసుకుంటున్నది శారద

పిల్లలు ముగ్గురినీ తేరిపార చూశాడు పట్టాభి వులుగడిగిన ముత్యాల్లా అందంగా ఆరోగ్యంగా వున్నారు పచ్చేరాని వయసులో గుమ్మటంలా వుంది



"ఆంధ్రా ఫిలిమ్ సొసైటీ" ఆంధ్ర సంఘం న్యూఢిల్లీవారి సంయుక్త ఆధ్వర్యంలో ఆజాద్ భవన్‌లో కూచిపూడి నాట్య ప్రదర్శన యిచ్చి "నృత్య కళారత్న" బిరుదు, అభినందనం స్వీకరించిన "నాట్యమయూరి", "రాజ నర్తకి", చిరంజీవి మద్దాలి అపర్ణ.

# శిఖరం మీద

వాణి తల్లి పోలిక పచ్చని కళ గల మొహం పచ్చి చక్కెర కేళిలా పొట్టిగా బొద్దుగా వున్నాడు, పదేళ్ళ రాజు ఐదేళ్ళ రాణి రబ్బరు బొమ్మలా మిస మిసలాడుతోంది కళ్ళు విచ్చుకుని వాళ్ళనే చూస్తూ ఆలోచనలో పడ్డాడు పట్టాభి

"ఇంక మీరు లేచి తయారుకండి టైమవుతోంది" పిల్లల్ని హెచ్చరించింది శారద ముగ్గురూ కదిలేరు

గృహ ప్రవేశానికి మీరు రానేలేదు ఇల్లు ఎలా వుంది? అడిగింది శారద

తండ్రికి ఇంట్లో అన్ని గదులూ, పెరడూ, ఆవరణా అన్నీ చూపించి మార్నింగ్ వాక్‌కి వెళ్ళాడు రామ్మూర్తి

చాలా బాగుంది మీరిద్దరూ దగ్గరుండి కష్టపడి కట్టించుకుంటిరి అన్నీ పొందిగ్గా అమరినై' అని, వద్దామని ఎంతో ప్రయత్నించాను వీలు కాలేదు జాబు రాశాను కదా' అన్నాడు

"అవును' అని వూరుకొంది శారద ఆ సంభాషణని ఇంకా పొడిగిస్తే మామగారి మనస్సు నొచ్చుకుంటుందని అక్కడితో ఆపేసింది

పట్టాభి వంటగదిని కలయ జూశాడు నల్లని చలువరాతితో పదడుగుల గట్టు దాని చివర నీటి కొళాయి, సింక్, చలువరాతి దిగువన వివిధసైజుల్లో అరలు అరలుగా చెక్కలతో షెల్ఫులు, రెండో ప్రక్క రాతితో అరలు – డబ్బాలు, సీసాలు, గిన్నెలతో నిండి వున్నై వొక అరనిండుగా పింగాణీ, గాజు సామాన్లు గ్లాసులు – స్త్రీలు ఆధునిక గృహిణికి అందుబాటులో వుండాల్సిన వస్తువులన్నీ నిండుగా వున్నై వంట గదిని ఆనుకుని ఆరడుగుల నడవా వంటగదికి ఎదురుగా డైనింగ్ రూమ్

పూజ పూర్తయిందనిపించి వంటింట్లో నుంచీ కదిలేడు పట్టాభి పిల్లలు మొహాలు కడుక్కుని వచ్చి డైనింగ్ టేబుల్ దగ్గరికి చేరేరు. తాతయ్యను ఆహ్వానించి తమ ప్రక్క కుర్చీలో కూర్చోబెట్టేరు

మూడు స్టీలు గ్లాసుల నిండా పాలు కలిపి తెచ్చింది శారద పిల్లలు ముగ్గురూ అందుకున్నారు

వీళ్ళకి కాఫీ అలవాటు లేదు రోజూ పొద్దున్నే పాలే తాగుతారు " అంటూ కాఫీ గ్లాసుని మామగారి ముందు వుంచింది కాఫీ తాగుతూ పిల్లల కేసి చూశాడు పట్టాబి హఠాత్తుగా ఒక భావన కలిగింది 'ఇందుకనే కాబోలు కూడే మెరుపు' అన్నారు – అనుకున్నాడు

చూపులు తిప్పుకున్నాడు. శారద వంట యింట్లో గాజు గ్లాసులోని నిమ్మరసంలో తేనె కలుపుకుని తాగుతోంది

పిల్లలు స్నానాలకు లేచారు పట్టాభి కూడా అక్కణ్ణుంచీ ముందు హాల్లోకి కదిలేడు చూసిన గదే అయినా కొడుకూ, కోడలూ తమ కోసం ఎంతో ప్రత్యేకంగా కట్టించుకున్న పడగ్గది గడప దగ్గర నిలబడ్డాడు తలుపును ఆనుకుని నిలిచి, డోర్ కర్టెన్ తొలగించి లోపలికి చూసేడు

విశాలమైన డబుల్ కాట్ దాని మీద ఖరీదైన పరుపూ, దుప్పట్లూ, దిండ్లూ ఉదారంగు పెయింట్ వేసి వున్న గోడలు కిటికీలకి ముదురు ఎరుపు తెరలు. గోడలకి రెండు మూడు ప్రకృతిని చిత్రించిన పటాలు వ్రేలాడ దీసి వున్నై మంచం పక్కగా టేబుల్ లైట్, డెకొలామ్‌తో చేసిన టీపాయ్, వీటికి ఎదురుగా గోడకి నిలువు టద్దం ఆ గదిని ఆనుకుని ఒక బాత్‌రూమ్ వుంది దాన్లోనూ పాలరాతి గోడ, షవర్ కనిపిస్తున్నై బయటికి.

ఎందుకో హఠాత్తుగా ఒక భావన కలిగింది పట్టాభికి హాల్లో రామ్మూర్తి గొంతు వినిపించింది చేతిలోని తెర వదిలేసి దీర్ఘంగా నిట్టూరుస్తూ అక్కణ్ణుంచీ కదిలేడు గబగబా అడుగులు వేస్తూ హాల్లో కొచ్చి వాలు కుర్చీలో కూర్చుని దినపత్రికని చూడసాగేడు

పిల్లలు స్కూలుకు వెళ్ళిపోయారు ఆసరికి రామ్మూర్తి స్నానం చేసి వచ్చి తండ్రి కెదురుగా కుర్చీలో కూర్చున్నాడు

'ఇంటికి ఇంక వొక్కపని మిగిలింది డాబామీద వొక గదీ వరండా వేయించాలి ప్లానులో వుంది గానీ, త్వరగా ఇంట్లో చేరిపోవాలనే వుద్దేశ్యంతో ఆపించాము అవి పూర్తయితే, స్నేహితులూ – వాళ్ళూ ఎవరొచ్చినా ఫర్వా లేదు డాబా మీద వాళ్ళకి ప్రత్యేకంగా అతిథి గృహం వున్నట్టుంటుంది " తండ్రి ఏమీ అనలేదు రామ్మూర్తి ఆయన వైపు చూశాడు. ఆయనేదో పరధ్యానంలో వున్నాడు.

ఇంతలో శారద వచ్చింది. చేతిలోని మజ్జిగ గ్లాసుల్ని చెరొకటీ ఇచ్చింది వెన్న చిలికిన మజ్జిగ నురుగులు తేల్తూ గ్లాసు నిండుగా వున్నై

మజ్జిగ తియ్యగా కమ్మగా వున్నై పట్టాభికి ఖాళీ గ్లాసును ఇస్తూ మెచ్చికోలుగా శారదను చూసి,

రామ్మూర్తి కేసి చూపులుమరల్చి 'చాలా బావున్నై మజ్జిగ' అన్నాడు భార్య వైపు చూస్తూ సన్నగా నవ్వేడు రామ్మూర్తి ఆమె కూడా సన్నగా నవ్వింది

ఇద్దర్నీ గమనించాడు పట్టాభి ఎందుకో హఠాత్తుగా వొక బావన కలిగింది ఆ భావన ఆయన్ని అపాదమస్తకం వుడికించి చీల్చి పారేస్తున్నట్లనిపించింది దినపత్రికని పక్కన పడేసి, లేచి, బయటికి నడిచేడు

పట్టాభికి మనసంతా వికలమై వుంది ఏఁవీ తోచడం లేదు

రోడ్డువార కొంత దూరం నడిచేడు

కొడుకూ – కోడలూ – పిల్లలూ, ఆ యింటి వాతావరణం, పరిస్థితులూ – ఆయనలో అనేక భావాలు కలిగిస్తున్నై

కాసేపు – ఆ భావాల్లో చిన్నతనం, సిగ్గు, బిడియం కూడా వున్నాయనిపిస్తోంది దుఃఖమో, ఆనందమో తెలియకుండా కళ్ళు చెమరుస్తున్నాయి

జీవితంతో తాను పట్టిన కుస్తీపట్లన్నీ సినిమా రీలులా గిర్రున కళ్ళ ముందు తిరిగినై అందునా ముగ్గురు ఆడపిల్లల పెళ్ళిళ్ళూ, భార్య మరణం

వైపంచెతో కళ్ళొత్తుకున్నాడు పట్టాభి

నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఇంటికి తిరిగి వచ్చాడు

మధ్యాహ్నం –

భోజనాల దగ్గర,

వెండి కంచంలో చాలా పదార్థాలు వడ్డించి వున్నై

'షడ్రసోపేతమైన విందు' అనుకున్నాడు పట్టాభి

పచ్చి కారెట్‌ని కోరి కొబ్బరి కలిపి పెట్టింది, శారద చాలా రుచిగా వుంది సంతృప్తిగా తినబోతుండగా, వొక చిత్రమైన భావన కలిగింది

ముద్ద గొంతు దిగలేదు పొలమారినట్లయింది మంచినీళ్ళు తాగి సంభాళించుకున్నాడు

ఆ తర్వాత –

# శిఖరం మీద

అక్కడ ఎక్కువ సేపు మౌనమే రాజ్యమేలింది కొడుకు వేసిన ఒకటి రెండు ప్రశ్నలకి పొడి పొడి సమాధానాలు చెప్పాడు

భోజనం అయిందనిపించి లేచాడు పట్టాభి

గడ్డ పెరుగు కూడా సరిగ్గా వేసుకోలేదని బాధ పడింది శారద

పిల్లల గదిలో మంచం వేశాను విశ్రాంతి తీసుకోండి – శారద చెప్పింది

యాంత్రికంగా గదిలోకి నడిచాడు పక్క మీద నడుం వాల్చేడు ఫోమ్ బెడ్ మెత్తగా తగిలింది చాలా హాయిగా అనిపించింది

కానీ, అంతలోనే ఏదో భావన!

ఆ బావన ఆయన్ని అపాద మస్తకమూ ఉడికించి, చీల్చి పారేస్తున్నట్లనిపించింది రక్కున లేచి కూర్చున్నాడు

గదిలో పచార్లు చేయసాగేడు

ఆలోచనలతో, అస్థిమితంతో - గంట గడిచింది

నిమ్మళంగా పడగ్గది దాకా నడిచేడు ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది ఏ చడీ చప్పుడూ లేదు రామ్మూర్తీ, శారదా విశ్రాంతి తీసుకుంటున్నట్లుంది

పట్టాభికి ఏఁవీ పాలు పోలేదు ఆయన మనస్సు మనస్సులో లేకుండా పోయింది

మొండి చెట్టులా అయిపోయేడు

ఉదయం పిల్లలు కోరిన కోరిక గుర్తుకొచ్చింది నువ్విక్కడే ఇంచక్కా మా దగ్గరే వుండిపో తాతయ్యా అన్నారు వాళ్ళు శారద కూడా చెప్పింది – పది రోజులు విశ్రాంతిగా వుంటుంది ఇప్పుడిప్పుడే వెళ్ళే ఆలోచన చెయ్యకండి!" రామ్మూర్తి అన్నాడు, చెప్పుల్లో కాళ్ళు పెట్టు కూర్చోకు కొన్నాళ్ళుండి వెళ్ళొచ్చు

కానీ, అంతరంగంలో ప్రవహిస్తున్న భావన ఆయన్ని నిలవ నీయడం లేదు

క్షణం సేపు అటూ ఇటూ చూసి, హఠాత్తుగా తన సంచీ చేతిలోకి తీసుకున్నాడు గబగబా అడుగులు వేస్తూ బయటికి వచ్చేశాడు

మళ్ళీ వెనక్కి వెళ్ళి వీధి తలుపుని వేసేసి వచ్చాడు

ఆయన కాళ్ళు బస్ స్టాండ్ కేసి పరుగులు తీసినై బస్ కదిలింది

రామ్మూర్తి ఇంట్లో జరిగిన బలీయమైన మానసిక సంఘర్షణ గుర్తుకొచ్చింది పట్టాభికి

కళ్ళ ముందు మసక మసగ్గా ఏవేవో దృశ్యాలు కదలాడినై

అటెండర్ చలపతి నివసిస్తున్న రెండు గదుల అద్దె కొంప, మాసికల చీరలో కడుపులో కాళ్ళుంచి కాలాన్ని వెళ్ళ దీస్తున్న చలపతి భార్య సుమతి, గోగు కాడల్లా నలుగురు పిల్లలు తెల్లవారితే ఎదురయ్యే నీటి ఎద్దడి! సమస్యల బుట్టని నెత్తికెత్తుకుని, సహనం చెప్పుల జతతో బతుకీడుస్తున్న చలపతీ - అతని సంసారం!

"ప్రాపంచిక శక్తికీ, నైతిక శక్తికీ జరిగిన ఘర్షణ – నన్నూ – నా ప్రవర్తననీ కొద్ది సేపు కత్తి అంచు మీద నిలబెట్టింది అనుకున్నాడు పట్టాభి

ఆ వెంటనే అనిపించింది నేను సరిహద్దులుదాటి వెళ్ళలేదు

* * * *

శేష జీవితాన్ని రామ్మూర్తి వాళ్ళింట్లో గడుపుతానని వెళ్ళి, రెండో రోజునే తిరిగి వస్తున్న పట్టాభిని చూసి ఆశ్చర్యపోయారు – చలపతీ, సుమతీ!

వాళ్ళిద్దరి వైపూ తదేకంగా చూస్తూ, అప్రయత్నంగా నవ్వేడు పట్టాభి

ఎంతో తేలికగా, హాయిగా, వెన్నెలలా – హార్దికంగా వున్నట్లనిపించింది!

నులక మంచం మీద నడుం వాల్చి చూరు కేసి చూస్తూ తృప్తిగా వూపిరి పీల్చుకున్నాడు!

బుద్ధి తెలిసి నప్పట్నుంచీ తనతో పాటు కాడి మెడ మీద వేసుకుని, రామ్మూర్తిని ఇంజనీరుని చేసి, ఇంతవాణ్ణి చేయటమే కాక, ఇంటి బాధ్యతల్నీ నెత్తిన వేసుకుని ఆడపిల్లల పెళ్ళిళ్ళూ వగైరాలన్నీ నిర్వహించిన పెద్ద కొడుకు పట్ల – పట్టాభి గుండె నిండా కృతజ్ఞత నిండిపోయింది

తండ్రి వైపు చిత్రంగా చూశాడు – చలపతి. అతనికి ఆయన కొంత అర్థమయ్యాడు – కొంత అర్థం కాలేదు సాలోచనగా భార్య కేసి చూశాడు నాకు అంతా అర్థమైంది అన్నట్టు కళ్ళు చికిలించింది సుమతి! శిఖరం మీద చిరంజీవిలా – గంభీరంగా భవిష్యత్తు కేసి చూస్తున్నాడు – పట్టాభి!

పట్టాభిగారి ట్యూషన్ పిల్లలు బిలబిలా వచ్చేస్తున్నారు!

అక్కడ – రామ్మూర్తీ, శారదా – పట్టాభి గారి బలహీనతల్ని గురించి చర్చించుకుంటున్నారు! □

ఇటీవల సేలం స్టీల్ ప్లాంటులో జరిగిన వివిధ భాషల నాటికల పోటీలలో "లేపాక్షి" తెలుగు సమితి సమర్పించిన "తెరవెనుక" నాటికలోని ఒక దృశ్యంలో సర్వశ్రీ జి ఎస్ ఎన్. మూర్తి, ఎల్ ఎన్. ఎస్ రామకృష్ణ, ఎం పి కోటేశ్వరరావు మరియు బి మాల్యాద్రి



## బైద్యనాథ్ ..............

### ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా
మీరు భాగస్వాములు కనుక
మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు
ఆనందముగా ఉండుటకు
శ్రద్ధ తీసుకుంటారు.



మీకు శక్తిని, బలమును కలుగచేసి
రోజు రోజుకు సంవత్సరముల తరబడి
విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును.

స్త్రీ పురుషులకు బలవర్థకమైన ఔషధము.

## బైద్యనాథ్ విటా-ఎక్స్

### మొటిమలా?

మొటిమలు, మచ్చలు, ఉడుకు పొక్కులు మరియు
చర్మరోగములకు ఆదర్శమైన నివారిణి
మంచి రక్తశుద్ధికరము, చర్మమును పరిశుద్ధముగా
ఉంచును,






## బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్

రక్తమును శుద్ధి చేయును. చర్మమును నిర్మలముగా ఉంచును.




## బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ్ స్పెషల్

### కుటుంబాని కంతటికీ ఉత్తమమైన ఆయుర్వేద టానిక్

BJP/102 T

సీక్రెట్ ఏజెంట్
విక్రమ్
మోహన్ * దిలీప్‌కదమ్
10
మిస్టర్ కపూర్! ఈయనే జైలు ప్రధానాధికారి మిస్టర్ అక్బర్.
చాలా సంతోషం మిస్టర్ కపూర్! రోసీ మన వ్యాపారాన్ని గురించి అంతా చెప్పింది.
మంచిది. మరి నా వాటా సంగతేమిటి?
చెరి సగం!
31/10
నాకు సమ్మతమే. ప్రస్తుతం దేనికి గిరాకీ ఉన్నది?
మాదక ద్రవ్యాలకి. మీరు సరఫరా చేస్తారా?
తప్పకుండా. అయితే ఒక షరతు మీద. నా ఖాతాదార్లని నేను స్వయంగా చూడాలి.
అది సాధ్యం కాదేమో–
అయితే వ్యవహారాన్ని విరమించుకుందాము. మత్తు మందులకి అలవాటు పడ్డ వారికి సరైన ఆరోగ్యం ఉందో లేదో నేను తెలుసుకోవాలి. నేను సరఫరా చేసిన వాటి వల్ల వాళ్లలో ఎవరికి ఏమైనా నేను చిక్కుల్లో పడతాను.
బాగానే ఉంది. మరి మాకు కొన్ని హామీలు కావాలి.
ఏమిటవి?
మీరు ఎంత అందించగలరు మీ సరుకు నాణ్యతకి సంబంధించినవి.
బాగుంది. మీరు పరీక్షించు కోడానికి మచ్చుకి కొంత ఇసాను.
అయితే సరే. మళ్లీ ఎప్పుడు కలుద్దాం?
రేపు రాత్రికి, నా హోటల్‌లో
అంత వరకూ సెలవ్.
అతను వెళ్లిన తర్వాత–
ఇంకా నావల్ల ఏదైనా సహాయం కావాలా?
అవును. ఠాకూర్‌తో నా వీపు తట్టాలని చెప్పాలి. అతనికి అర్థమవుతుంది.
(ఇంకా ఉంది)

# ఆదరణలేని "ఆంధ్రా ఊటీ" అరకులోయ



అద్భుతమైన బుర్రా గుహలు

ఎటు చూసినా ఎత్తయిన కొండలతో, ఆకుపచ్చని చెట్లతో, లోతయిన లోయలతో నిండుగా, ఆహ్లాదంగా కనిపిస్తూ ప్రకృతి మాత సౌందర్యం అంతా వికశిస్తున్నట్లు మనోహరంగా కనిపించే "ఆంధ్రా ఊటీ"గా ప్రసిద్ధి చెందిన అరకులోయ హోయగాలు సరయిన ఆదరణ లేకపోవడంతో దేశ, విదేశీ యాత్రికులను అంతగా ఆకర్షించడం లేదు.

సముద్ర ఉపరితలానికి 3060 అడుగుల ఎత్తులో విశాఖపట్నం జిల్లాలో, తూర్పు కనుమల నడుమ నెలకొన్న అరకులోయ వంద సంవత్సరాల క్రితమే బ్రిటిష్ పాలకులను ఆకర్షించి, వేసవి విడిదిగా మార్చింది. అయితే స్వాతంత్ర్యం తదుపరి ప్రభుత్వ ఆదరణ లేకపోవడంతో ప్రముఖ పర్యటనా స్థలంగా రూపొంద లేదు.

గుంటూరుకు చెందిన పత్రికా ప్రతినిధులు ఇటీవల అరకులోయ సౌందర్య దృశ్యాలను సందర్శించినప్పుడు తగు ప్రోత్సాహం ఉంటే ప్రముఖ పర్యటనా కేంద్రంగా ప్రసిద్ధి చెందగలదనే భావన కలిగింది.

విశాఖ పట్టణం నుండి 132 కి. మి. దూరంలో గల అరకులోయకు డి. బి. కె. రైలులో ప్రయాణించటం మధురమైన అనుభవం. ఎడమ ప్రక్క ఎత్తయిన కొండలు, కుడి ప్రక్క లోతయిన లోయలతో వింత అనుభూతులను కల్గిస్తుంది.

అయితే అరకులోయలో యాత్రికులకు సరయిన వసతి, భోజన సౌకర్యాలు లేవు. మెరుగయిన జిల్లా పరిషత్ అతిధిగృహంలో గల మూడు గదులు పలుకుబడి గల వారికే అందుబాటులో ఉంటున్నది. రోడ్లు భవనాల శాఖ అతిధి గృహం పాడుపడిన గృహం వలె దర్శన మిస్తుంది.

ఇక యాత్రికులకు అందుబాటులో ఉన్న టూరిస్ట్ హోమ్‌లో కనీస సౌకర్యాలు మృగ్యం. నిర్వహణ అత్యంత దీనావస్థలో ఉన్నది. సరయిన తలుపులు లేవు. వంట గది వంట మనిషి ఉన్నప్పటికి వంట సామగ్రి లేదు. అద్దె మాత్రం చాలా ఎక్కువ.

ఇక భోజన సౌకర్యాలు పరిమితం. స్వచ్ఛమైన శాఖాహారులకు భోజనమే లభించదు. గిరిజనుల జీవన విధానం తెలిపే ఒక ప్రదర్శనను అక్కడ ఏర్పర్చితే ఆసక్తికరంగా ఉండగలదు.

పద్మపురం గార్డెన్స్‌లో 26 ఎకరాల విస్తీర్ణంలో పలురకాల ఫలాల వృక్షాలు కనిపిస్తాయి. దీనిని మరింత అందంగా తీర్చిదిద్ది విజ్ఞాన, వినోదాత్మకంగా రూపొందిస్తే బాగుంటుంది.

ఈ ప్రాంతాన్ని ఏజన్సీ ప్రాంతంగా ప్రకటించడంతో గిరిజనేతరులకు భూసేకరణ వీలులేక పోవడంతో వ్యాపారాత్మక వాతావరణం నెలకొండా సహజ సౌందర్యం పరిరక్షింప బడింది. అయితే తగినంత సౌకర్యాలు మెరుగు పడలేదు.

అయితే విద్యాలయాల పేరుతో క్రైస్తవ మిషనరీలు, ప్రైవేటు వ్యక్తులు విలువైన స్థలాలను ఆక్రమించడం, ఇతర ప్రయోజనాలకు వాడుకోవడం కనిపించింది.

## బుర్రాగుహలు

అరకులోయ నుండి విశాఖపట్టణం వైపు 30 కి. మి. దూరంలో గల బుర్రాగుహలు సహితం పర్యాటకులను ఆకర్షిస్తూ అద్భుత అనుభూతిని కల్గిస్తున్నవి. ఎత్తయిన కొండలలో సహజసిద్ధంగా ఏర్పడిన లోతయిన ఈ గుహలలోకి వెలుగు కాగడాలు చేతబూని వెడుతుంటే మనస్సులో అనుకొన్న రూపాలన్నీ అక్కడ కనిపిస్తుండటం విశేషం.

రైల్వేస్టేషన్ నుండి రెండు కి. మి. కొండలలో నడుస్తూ గుహలకు చేరుకోవడం ఆహ్లాదకరంగా ఉంటుంది. రైల్వే లైను ఏర్పాటులో బ్రిటీష్ వారు ఈ గుహలను కనుగొన్నట్లు తెలుస్తున్నది.

అయితే అక్కడ ఆ గుహల విశేషాలను యాత్రికులకు చెప్పేనాథుడు లేడు. అక్కడకు రోడ్డు నిర్మాణంలో ఉన్నప్పటికి యాత్రికులకు ఇతర సౌకర్యాలు లేవు. ఆ గుహలలో వినోద, విజ్ఞానాత్మక ప్రదర్శన ఏర్పర్చితే మరింత ఆకర్షణీయంగా రూపొంద గలవు.

బొర్రా గుహల నుండి అరకులోయ వరకూ బస్ సౌకర్యం ఏర్పర్చితే యాత్రికులకు సౌకర్యంగా ఉంటుంది. ప్రభుత్వం తగు శ్రద్ధ, ఆసక్తి చూపితే తూర్పు కనుమలలో ప్రసిద్ధ యాత్రా కేంద్రంగా ఆకర్షింప గలదు.

ఈ ఏజన్సీ ప్రాంతాన్ని పర్యటనా కేంద్రంగా రూపొందించడానికి రాష్ట్ర ప్రభుత్వం రు. 3 కోట్లు కేటాయించినట్లు తెలియ వచ్చింది.

– చలసాని నరేంద్ర

బుర్రా గుహలలో మనసులో కోరుకున్న ప్రతిమ కనిపించే దృశ్యం



అమాయకతకు చిహ్నం గిరిజనులు



సీరియల్

# కరిగినశిల

రావినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

ప్రభాకర్ శ్యామలా కలిసి పంశదారలో అడుగు పెట్టారు చెప్పా పెట్టకుండా కూతురు అల్లుడు దిగేసరికి కాస్త తికమక పడ్డాడు రామారావు కంగారుగా ఆహ్వానించాడు

డేడీ! ఎంత వరకు వచ్చింది మీ అన్వేషణ? వస్తూనే అడిగింది శ్యామల

అన్వేషణా? తెల్లబోయాడాయన

గుర్తు లేదు కదూ? నిష్ఠూరంగా అంది శ్యామల

హటాత్తుగా గుర్తొచ్చింది ఆయనకి సరయు సంగతి

ఓ! సరయు సంగతి కదూ వెతికిస్తూనే వున్నాన్రా! అంటంగా అబద్ధం ఆడాడు రామారావు

ఇంక మీరేం వెతికించక్కర్లేదు!

అదేమిటి?

సరయు జాడ తెలిసింది

ఎక్కడ? తెచ్చిపెట్టుకున్న కుతూహలంతో అన్నాడు రామారావు

ఈ లోకంలోనే! కసురుమంది శ్యామల

అదేమిట్రా?

లేకపోతే ఏమిటి డేడీ నేనేం చెప్పాను మీకు?

'అరే శ్యామ్! ఈ విశాల ప్రపంచంలో ఓ అమ్మాయి జాడ తెలుసుకోవడం అంత తేలికైన పనా ఒక వేళ మంది మూర్ఖులంతో వెళ్ళి ఎలాగో పట్టుకున్నాననుకో!

నేనేం నేరం చేశానని నా వెంట పడుతున్నారు అంటూ నలుగురిలో పట్టుకుని నన్ను కడిగినా కడుగుతుంది అసలే గడుగ్గాయని విన్నాను' బయం నటించాడాయన

తండ్రి మాటలకి పకపక నవ్వింది శ్యామల

తర్వాత నానా హడావిడ చేసి తండ్రిని, బొమ్మనీ కూడా ప్రయాణం చేయించింది

* * * * * * * * *

హటాత్తుగా మెలకువ వచ్చింది సరయుకి

తృళ్ళిపడి లేచి కూర్చుంది ఒళ్ళంతా నీరసంగా వుంది ఓ సారి గదంతా పరికించి చూసి తానొక్కతే రమణ గదిలో వున్నట్టు గ్రహించి కంగారుగా చూసింది

క్రమేపీ రాత్రి జరిగిందంతా గుర్తొచ్చింది

తమ యజమాని ఇక్కడికొచ్చినప్పుడు ఈ గదిలోనే వుంటాడనీ, ఈ కిటికీలోంచి అనేక సుందర దృశ్యాలు కనిపిస్తాయి కనుక వాటిని చూస్తూ గంటలు నిమిషాల్లా గడిపేస్తాడనీ తనొచ్చిన కొత్తలో వార్డెన్ చెప్పింది అతన్ని దైవంగా చిత్రించింది అందుకే తన మనసులో అతనో వున్నతుడుగా నిల్చిపోయాడు ఓసారి అతన్ని చూడాలన్న ఆకాంక్ష కూడా పెరిగిపోయింది తనలో

కానీ ఆ మహానుభావుడే ఇతడని తెలిసినప్పుడు కొయ్యబారి పోయింది బయపడి పారి పోయింది తిరిగి ఇదే గదిలో బంది అయిపోయింది ఆకలిగొన్న సింహం తనని పూరికే ఒదుల్తుందా? తల్చుకున్న కొద్దీ ఆమెకి దుఃఖం తన్నుకొచ్చేస్తోంది

ఆతృతగా తలుపు కేసి చూసిన సరయు తృళ్ళిపడింది తను భయపడినట్టు తనని బందించలేదెవరూ– తలుపులు బార్లా తీసున్నాయి

అయితే తను పారి పోవచ్చు!' అనుకుని ఒక్క అంగలో తలుపు దగ్గరికెళ్ళి క్షణం ఆగి వెనక్కి తిరిగి చూసింది స్టూల్ మీద రెపరెపలాడుతున్న కాయితం, దాని మీద మిస్ సరయు అన్న అక్షరాలు కనిపించి రెండడుగులు వెనక్కి వేసి ఒణుకుతున్న చేతులతో దాన్నందుకుని విప్పింది

సరయూ!

నీకీ వుత్తరం రాస్తుంటే విధి మీద నాకు బలే కోపం వస్తోంది లేకపోతే ఏమిటీ ఇంతకాలం మనిద్దరం అర్థం లేకుండా దోబూచులాడుకున్నాం నువ్వు దగ్గరైనప్పుడు నేను, నేను దగ్గరైనప్పుడు నువ్వు ఒకర్నొకరం తప్పించుకోవడమే ధ్యేయంగా పరుగులు తీశాం ఇది తప్పకుండా విధి ఆడుకునే ఆటే!

సరయూ! నీనుంచి శాస్వతంగా విడిపోతున్న ఈ సమయంలో ఎలాంటి ముసుగు లేకుండా స్వచ్ఛమైన హృదయాలతో మనసులు విప్పి

**జరిగిన కథ-19** మామగారు అన్న మాటలకు ఆవేశంగా జవాబిస్తాడు ప్రభాకర్ సరయు అడ్రసు డాక్టరు శ్యామల దగ్గర తీసుకుని డా సుగుణ, రమణ ప్రభాకర్ దగ్గరకు వెళ్తారు సరయు డా ప్రభాకర్ నర్సింగ్‌హోమ్ నుండి వెళ్ళిపోయిందని తెల్సుకుని నిరుత్సాహంగా తిరుగు ముఖం పట్టారు ప్రభాకర్‌వాళ్ళ వంటావిడ కాంతమ్మ శ్యామలకి అసలు జరిగిన విషయం వివరించింది శ్యామల తన తప్పు తెలుసుకుని భర్త దగ్గరకు వచ్చేసింది సరయు మేరీ వాళ్ళతో అమెరికా వెళ్ళిపోయిందని వనజ రమణతో చెప్పింది సరయు మేరీ గారబ్బాయి జేమ్స్‌ని వివాహం చేసుకుంటుందని ఎవరో అనగా విన్న రమణ నిస్త్రాణగా మంచం మీద కూలబడిపోయాడు ఆశ్రమంలో క్లర్క్‌గా కొత్తగా చేరిన సరయు అక్కడ రమణని చూచి పారిపోయింది స్పృహ తప్పిన సరయుని తన గదిలో పడుకోబెడతాడు రమణ సరయు డైరీ చదివిన రమణ ఆమెకు ఒక లేఖ రాసి ఆమె మంచం ప్రక్కగా స్టూలుమీద పెట్టి మరో గదిలోకి వెళ్ళిపోయాడు

మాట్లాడుకుందాం. ఎదుట పడి మాట్లాడుకునే అదృష్టం ఎలాగూ లేదు. అందుకే నా హృదయాన్ని అక్షర రూపంలో ఇక్కడ పొందు పరుస్తున్నాను.

నేను నిన్ను చూసిన తొలి క్షణంలోనే నువ్వు నా మనసులో నిల్చిపోయావ్. నీ మాటలు, ఫ్రెండ్స్‌తో కలిసి చేసే అల్లరి చూస్తుంటే అంత బాధలోనూ నాకు నవ్వొచ్చేది.

రాను రాను అమాయకత్వం, అభిమానంతో కూడిన మొండితనం నన్ను మరీ ఆకర్షించాయి. దాన్ని ప్రేమ అను! మరోటను. కానీ నువ్వు మాత్రం నన్ను విపరీతంగా అసహ్యించుకున్నావ్! దానిక్కారణం కూడా నాకు తెలుసు. నీ దృష్టిలో నేను ఓ తిరుగుబోతుని, తాగుబోతుని ఇంకా చెప్పాలంటే చరిత్ర హీనుణ్ని!

నిజానికి అలా ప్రవర్తించకపోతే నేను ప్ర... ష్ట అయిన ఓ యువకుడిగా ఆ సాగర్ ముందు నిలవగలిగే వాణ్ని కాదు. వాళ్ళ స్థావరంలో అడుగు పెట్టే వాణ్ని కాదు.

వాళ్ళిచ్చే మందుల కోసం తహతహ పడుతున్నట్టు, ఏ కార్యం చెప్పినా చెయ్యడానికి సిద్ధ పడినట్టు ప్రవర్తించి వాళ్ళ ఆశ్రయం సంపాదించాను. అనుకున్నది సాధించాను.

నా రహస్యాలన్నీ కడుపులో దాచుకున్న మీ అమ్మ గారు నా మీద ఓ పెద్ద భారం మోపారు.

అదే నీ పెళ్ళి సమస్య!

నీ ఇష్టమైన వ్యక్తితో నీ పెళ్ళి జరిపించమని కోరారు మీ అమ్మగారు.

"మా అమ్మాయిని నువ్వు చేసుకో" అంటారని ఎంతో ఆశగా ఎదురు చూసిన నాకు నిరాశే మిగిలింది.

"మీరు సరయు గురించి దిగులు పడద్దు. ఆమె బాధ్యత నాది" అని ప్రమాణం చేశాను. ఆవిడ నిశ్చింతగా కన్ను మూశారు. ఎక్కడో నీకు నా మీద ప్రేమలాంటి భావం కలుగుతుందన్న ఆశ మినుకు మినుకు మనేది.

నా మనసు, నా గతం ... ముందుంచి నీ నిర్ణయం కోసం ఎదురు చూడాలనుకున్నాను. కానీ.... అంతలో నేనో చేదునిజం విన్నాను. నువ్వో వ్యక్తికి మనసిచ్చావనీ, అతన్నే చేసుకోబోతున్నావనీ!

నా మనసుకి మరో గాయం అయింది.

నాకు శాశ్వతంగా దూరం అయిపోతున్నావని కృంగి పోయాను. మళ్ళీ నాకు నేనే ... ప్పుకున్నాను.

అలాంటి సమయంలో ఓ రోజు నిన్ను ప్రేమించిన వ్యక్తి వచ్చి-

"సరయు, నేనూ ప్రేమించుకున్నాం. త్వరలో పెళ్ళి కూడా చేసుకోబోతున్నాం. ఆవిడ మంచి చెడ్డలన్నీ ఇకనించి నావే! మీరు వెళ్ళి పొండి!" అన్నాడు.

నేనేదో అనబోతే-

"అసలు మీ ఉనికే ఆమెకి అసహ్యం అని నాతో చెప్పింది. మీరు ఆమె మంచి



# కరిగిన శిల

చెప్పలు చూస్తం అసలే ఇష్టం లేదామెకి ఎలాగైనా మిమ్మల్ని పంపెయ్యమని బతిమాలింది, అన్నాడతను నా మొహం వాడిపోయింది

నేనిలా చెప్పినట్టు ఆమెకి తెలియనీకండి ఇవేమీ చెప్పకుండా మిమ్మల్ని పంపమంది కానీ అది సాధ్యం అయేలా లేదని మీకు చెప్పాను! కాస్త రహస్యంగా అన్నాడు

నాకంతా అయోమయంగా వుంది అప్పట్నించి మిమ్మల్ని ఎక్కువగా గమనించడం ప్రారంభించాను

మీ ఆఫీసు దగ్గర హోటల్లోనూ మరో చోటా మీ ఇద్దరూ కలిసి వుండగా చూశాను హాయిగా నవ్వుకోవడం చూశాను పక్క పక్కనే రాసుకుంటూ నడవడం చూశాను

అంతే! నాలో అసూయ బయల్దేరింది నా మీద నువ్వు ప్రేమించిన అతని మీదా నన్ను నా చేతుల్లో పెట్టని మీ అమ్మగారి మీదా పిచ్చి కోపం వచ్చింది

అందర్నీ ఏదో చేసెయ్యాలి! అవమానించాలి అంటూ ఎన్నో అర్థం లేని ఆలోచనలు చేశాను అయితే నాలోని వివేకం నన్ను మందలించింది పూరడించింది శాంతింప చేసింది

అందుకే హఠాత్తుగా మీ ఇంటి నుంచి పారిపోయాను ఆ తరువాత నిన్ను కోర్టులో చూశాను నీ కళ్లల్లోని మెరుపుకి ముగ్ధుణ్నయ్యాను మీ ఇంటికి రావాలనీ హాయిగా నీతో కాసేపు మాట్లాడాలనీ ఎంతగానో అనిపించింది కానీ నిన్ను చూసిన నా మనసు నా మాట వినదు అందుకే మళ్లీ పారిపోయాను

తరువాత ఎన్నోసార్లు ఇద్దరం దాగుడు మూతలాడుకున్నాం

నీకు పెళ్లి కాలేదన్న సంగతి నాలో మళ్లీ ఆశ చిగురించేలా చేసింది ఎలా అయితేనేం నా ఆశ్రమంలోనే నువ్వు దర్శనం ఇచ్చావు! నా గుండె ఆనందంతో పొంగిపోయింది తొందరపాటు తప్ప నీ మనసు చాలా మంచిదని నాకు తెలుసు నీ హృదయంలో నాకు స్థానం వుందని కూడా పిచ్చి నమ్మకం

అందుకే నిన్ను వెంటాడ పట్టుకున్నాను

అయితే నా స్పర్శకే నువ్వు స్పృహ కోల్పోయావు! అంటే నీకు నేనంటే ఓ కీచకుణ్నే భావం వుండి వుండాలి! ఆనాటి సంఘటన అయి వుండదు ఎందుకంటే ఆ తర్వాత నువ్వు నాతో ఆప్యాయంగానే మాట్లాడావు

ఆలోచించి ఆలోచించి ఓ నిర్ణయానికొచ్చాను నాకిష్టంలేని పనే మరొకటి చేశాను

అదే నీ గదికెళ్లి నీ డైరీలు చూడడం!

నన్ను మాయ మాటలతో పంపేసిన ఆ మాధవ్ నా గురించి ఎంత ఘోరంగా చిత్రించాడో అర్థమయింది ఎందుకు నా నించి నువ్వు అలా దూరంగా పారిపోతున్నావో కూడా తెలిసింది




కానీ సరయూ! అతనన్నట్టు నేనేమీ జీవితంతోనూ ఆడుకోలేదు ఆమె నన్ను అవమానించినందుకు ఆమె మీద పగతీర్చుకుంటాను అని అనుకోలేదు

తెలివిగా మన మధ్య వున్న మనస్పర్థలు తెలుసుకున్న మాధవ్ నువ్వెక్కడ నాకు దగ్గరౌతావో అని భయపడి తనకున్న బలహీనతల్ని నాకు అంటగట్టాడు

సరే! ఇంక జరిగిందేదో జరిగిపోయింది ఇంక నీ జోలికి రాను ఈ ఆశ్రమం అంతా ఎవరికో ఒకరికి అప్పజెప్పి ఎక్కడికైనా దూరంగా వెళ్లిపోతాను కానీ సరయూ! నువ్వు మాత్రం ఇక్కడే వుండు నామీద కోపాన్ని విడిచి ఈ ఆశ్రమాన్ని కనిపెట్టుకుని వుండు!

సరయూ నా దిన్నామీద ప్రమాణం చేసి చెబుతున్నాను ఆ మాధవ్ చెప్పిందంతా అబద్ధం! నిన్ను పిచ్చిగా ఆరాధించిన మాట నిజం! సెలవు ఎప్పుడైనా ఈ నీ శత్రువు గుర్తొస్తే హాయిగా! కాదు! జాలిగా నవ్వుకో! ఇం ఇంతే!

ఎవరికీ ఏమీ కాని

రమణ (నీ దృష్టిలో రావణ)

ఉత్తరం చదవడం పూర్తిచేసిన సరయు చిగురుటాకులా కంపించి పోయింది ఒక్క వుదుటున వార్డెన్ దగ్గరికి పరిగెత్తింది

ఏమ్మా సరూ! లేచావా? ఒంట్లో ఎలా వుంది? ఆదుర్దాగా అడిగింది వార్డెన్

ఆంటీ! ఆయన ఆయనేరి? వణుకుతున్న గొంతుతో కంగారుగా అడిగింది సరయు

ఎవరూ?

అదే రమణగారు

ఎందుకు?

ప్లీజ్ ఆంటీ!

ఆ చివర గదిలో వున్నారు! అయినా ఆయనతో నీకేం పని? ఆశ్చర్యంగా చూసిందామె

థాంక్యూ! ఆంటీ! థాంక్యూ వెరీ మచ్! అంటూ ఆవిడకి జవాబు చెప్పకుండానే రివ్వున దూసుకుపోయిన సరయుని అయోమయంగా చూసింది వార్డెన్

గదిలోకి పరిగెత్తిన సరయు ఠక్కున ఆగిపోయింది

గదిలోని టేబిల్ ముందు కుర్చీలో కూర్చుని ఎడంచేతిని మడచి టేబుల్ మీద పెట్టి ఆ చేతిమీద తలాన్చి నిశ్చలంగా పడుకుని వున్నాడు రమణ

కుడి చెయ్యి టేబిల్ చివర పట్టుకున్నట్టు చాచి వుంది అతని కంటి నించి జారిన కన్నీరు చెంపల మీద ఎండి చారికలుగా కనిపిస్తున్నాయి పేన్‌గాలికి జుట్టు కాస్త చెదిరి ముఖంమీద పడి కొత్త అందాలు కనిపిస్తున్నాయి

మెల్లగా అతనికి చేరువగా వచ్చింది సరయు అతన్ని చూస్తుంటే ఆమెకిప్పుడు భయంగాలేదు అసహ్యంగా అంతకన్నాలేదు సాగరమంత అనురాగం పొంగి ప్రవహిస్తోందామె హృదయంలో

ప్రేమంటేనే చిరాకుపడే సరయు ప్రేమవాహినిలో పడి ఉక్కిరిబిక్కిరి అయిపోతోంది శిలలా కరడు గట్టిన ఆమె మనసు వెన్నలా కరిగిపోయింది రమణ హృదయంలో కలిసిపోవాలని ఆత్రుత పడుతోంది

తడబడుతున్న కాళ్లని స్వాధీనంలోకి తెచ్చుకుంటూ అతనికి మరింత దగ్గరగా వచ్చి మెల్లగా వంగి అతని మీద చెంప ఆన్చింది చిగురాకులాంటి మెత్తని గులాబీ పెదవులతో అతని పెదవుల్ని సున్నితంగా తాకింది

తృళ్లిపడి కళ్లు తెరిచాడు రమణ

సరయు పొడవాటి జడ అతని భుజం మీదుగా కిందికి వేలాడుతోంది

కెంపు వర్ణానికి తిరిగి కాంతులు విరజిమ్ముతున్న మెత్తని ఆమె చెక్కిలి అతని గరుకు దేరిన చెంపపై కితకితలు పెడుతుంటే ఉద్వేగంతో తిసె ఆమె వెచ్చని ఊపిరి మెడకి తగిలి శరీరమంతా పులకించి పోతుంటే అదో రకమైన స్వప్నావస్థలో వున్న రమణ కదిలితే ఆ తియ్యని కల ఎక్కడ చెదిరిపోతుందో అన్నట్టు కదలకుండా అలాగే వుండిపోయాడు

క్షణాలు దొర్లిపోతున్నాయి

# ఈ రెండు రకాల సిమెంట్ ఉత్పత్తి విధానాలను ఒక్కసారి చూడండి.

**వారిది.**

**మాది.**

వారిది?
అది 1500°C వద్ద మండే సిమెంట్ కిల్న్‌ని అదుపులో వుంచే క్లిష్టమైన విధానాన్ని మనుషులుమాత్రం నిర్వహించే కర్మాగారాలలో తయారుచేసే సిమెంట్

మాది?
మా సిమెంట్ ప్రపంచమంతటా దశాబ్దాలకు పైగా సంకలన పరచిన సిమెంట్ ఉత్పత్తి మేటి విజ్ఞానంగల యఫ్.యల్. స్మిత్ ఫజ్జీలాజిక్ కంప్యూటర్ కార్యక్రమం సహాయంతో, 'కంప్యూటరైజ్‌డ్ కిల్న్ కంట్రోల్' విధానంతో తయారు చేయబడుతోంది.

ఫలితం-దేశంలోనే సాటిలేని నాణ్యతగల సిమెంట్ ప్రతిబస్తాలోనూ అంతటా ఏకరీతిగా వుండేది, శక్తివంతమైనది ఉత్పత్తి అవుతుంది. మీ ధనానికి అధిక విలువ యివ్వడానికే మేము ఎల్లప్పుడూ కృషిచేశాము. ఈ రోజున పారిశ్రామిక ప్రపంచంలో మద్రాసు సిమెంట్స్ లిమిటెడ్ ఎంతగానో గౌరవాన్ని సంపాదించుకోవడంలో అశ్చర్యంలేదు. ఇప్పటికి 25 సంవత్సరాలకు పైగా తమిళనాడు, కేరళలలో రామ్కో సిమెంట్ అత్యధికంగా విక్రయించబడుతోంది. సాంకేతిక విజ్ఞానంలో ప్రథమస్థానం అక్రమించడమే అందుకు కారణం

**కంప్యూటర్ పర్యవేక్షణలో నాణ్యత**

# రామ్కో సిమెంట్

1987 జనవరి నుంచి విజయవాడ వద్దనున్న మా జయంతిపురం ఫ్యాక్టరీనుంచి లభిస్తుంది




మద్రాస్ సిమెంట్స్ లిమిటెడ్
739 మౌంట్ రోడ్
మద్రాసు 600 002

CLARION M MCL 27A 86 TEL

## కరిగిన శిల

ఎంత మదురమైన కల! అదంతా కలగా అనుకున్న రమణ పైకే అనేసాడు తన్మయత్వంగా కళ్ళు మూస్తూ

ఊహుం! ఇది కలకాదు! అతని చెవిలో గుసగుసలాడింది సరయు

అతని చేతులు ఆర్తిగా ఆమెని అల్లుకున్నాయి

లేదు! ఇది కచ్చితంగా కలే! లేకపోతే నాకింత తియ్యని అనుబవమా? నేనంటే మండిపడే నా ఆరాద్య దేవత కోరకుండానే ఇంత చేరువై ఇంతటి అపూర్వ వరాలిస్తుందా? రమణ గొంతు ఆదోళా కంపించింది

కాదు! నిజంగానే ఇది కలకాదు! ఒక్కసారి కళ్ళు తెరిచి మీ సరయు కళ్ళలోకి చూడండి! అందులో మీకు ఆకాశమంత అనురాగం కనిపిస్తుంది! అతని చేతుల్లోకి మరింత ఒదిగిపోతూ అంది సరయు

రమణ బయం బయంగా కళ్ళు తెరిచాడు

అంతే! అతని కళ్ళలో కోటి సూర్యులు ప్రకాశించారు

నిజమే! ఇది కలకాదు నా దేవి నన్ను కరుణించింది సరూ!నా సరయూ ? ఇంక మనల్ని ఆ మృత్యువు కూడా వేరుచెయ్యలేదు గబాల్న లేచి ఆమెని రెండు చేతులతో చుట్టేసి ముద్దులతో వుక్కిరిబిక్కిరిచేశాడు

సరయు సిగ్గుపడి పోయింది అతన్నించి దూరం జరిగింది

అయ్యో! అయ్యో! ఇదెక్కడి అన్యాయమమ్మా! పెళ్ళికానివాళ్ళు ఆ వ్యవహారం ఏమిటీ బయం బక్తీ లేకుండా!

అయినా వుప్పు నిప్పులా వుండే మీరేమిటి ఇంత పాలూ నీళ్ళలా కలిసిపోయారు అంటూ వచ్చింది వనజ

వాస్తవంలోకి వచ్చిన ప్రేమికులు సిగ్గుపడిపోయారు మరింత దూరంగా జరిగారు

అమ్మా! సరయూ! ఒక్కసారి వచ్చి అందరికీ దర్శనం ఇవ్వమ్మా! అన్నాడు రామారావు నవ్వుతూ

అప్పుడు చూశారు సరయు రమణ గుమ్మంకేసి అక్కడ వనజా రామారావే గాక ప్రబాకర్ అతని తలిదండ్రులు శ్యామలా వాళ్ళ బామ్మగారూ మొత్తమంతా కట్ట కట్టుకొచ్చినట్టు వచ్చారు

రమణ తేరుకొని బైటికొచ్చి అందర్ని ఆప్యాయంగా పలకరించాడు వార్డెన్‌ని పరిచయం చేశాడు క్షణాలమీద కాఫీ టిఫిన్స్ ఏర్పాటుచేసి అందరికీ అందించిందావిడ రమణ ఆవిడ కలిసి ఆశ్రమం అంతా చూపించారు

ఈ సరయూనది దర్మమా అని అరవిందాశ్రమాన్ని మించినట్టున్న ఈ ఆశ్రమాన్ని చూడగలిగాం! తృప్తిగా అంది బామ్మగారు

నిజం! నిజం! అన్నారంతా

నవ్వులతో కబుర్లతో బోజనాలు కూడా అయ్యాయి అందరూ కొన్సేపు రిలాక్సింగ్‌గా తోటలో చెట్ల క్రింద కూర్చున్నారు

శ్యామల క్షమార్పణ చెప్పడం సరయు నవ్వెయ్యడం జరిగిపోయింది

అమ్మాయ్! సరయూ! నువ్వింకా నా మనవరాలి దగ్గర వుద్యోగం చేస్తావా? ముసి ముసిగా నవ్వుతూ అంది బామ్మగారు ఆమె బావాన్ని అర్థం చేసుకున్న సరయు -

అమ్మ బాబోయ్! అంది గుండెల మీద చెయ్యుంచుకుని బయంగా శ్యామలకేసి చూస్తూ

అందరితో బాటు శ్యామల కూడా నవ్వేసింది

సరయుకి వుద్యోగం చేసే కర్మేమిటి బామ్మా! వుత్తముడు కోటీశ్వరుడు అయిన వ్యక్తి బర్త కాబోతున్నాడు అంతగా కాకపోతే నా దగ్గర పురుడు పోసుకోడానికి ఒస్తుంది! ఏం సరయూ! అంది శ్యామల నవ్వుతూ

సరయు చెంపలు కందిపోయాయి మాటల్లో రామారావు కూడా సరయుకి క్షమార్పణ చెప్పుకున్నాడు ఆమె తేలిగ్గా నవ్వేసింది

అందరూ కలిసి ఇంత పొద్దున్నే ఎలా వచ్చారు? అన్న ప్రశ్నకి రమణ తను ఫోన్ చేశానని ఒప్పుకున్నాడు

ఇంతమందిని రప్పించిన మీరు మీ స్నేహితురాలైన సుగుణగార్నెందుకు

ఎలవలేదు? అంది వనజ

ఓ! మీకా విషయం చెప్పలేదు కదూ! మా సుగుణ త్వరలో పెళ్ళిచేసుకో బోతోంది! అన్నాడు రమణ

నిజమా? సుగుణ ప్రేమగాథంతా తెలిసినవాళ్ళు అన్నారు ఆశ్చర్యంగా

అవును ఓ ఇద్దరు పిల్లలకి తల్లిగా యాభై యేళ్ళున్న వ్యక్తికి భార్యగా వెళ్ళబోతోంది సుగుణ!

ఏవిఁటీ? తుళ్ళిపడ్డారు శ్రోతలు

అవును లాయర్ రవికాంత్‌గారి పేమిలీ డాక్టర్ సుగుణ - ఆయన భార్య కేన్సర్‌తో కన్నుమూసింది పిల్లలు అనాధలయ్యారు అందుకే ఆలోచించి ఆ నిర్ణయం తీసుకుంది రెండు రోజుల తర్వాత తన నిర్ణయం ఆయనకి చెప్పింది అయితే ఆయనగానీ ఆమె పేరెంట్స్‌గానీ ఆ పెళ్ళికి ఒప్పుకోలేదు ఎలాగో వారికి నచ్చచెప్పి సరే అనిపించింది భారంగా నిట్టూర్చాడు రమణ

ఓ! ఆయనా? ఆయన నాకు బాగా తెలుసు! చాలా మంచి వ్యక్తి! అన్నాడు రామారావు

అవును! ఆ పెళ్ళికి సంబంధించిన పనిమీదే వాళ్ళ పల్లెకెళ్ళింది సుగుణ రాగానే ఇక్కడికి వస్తుంది అన్నాడు రమణ

సాయంత్రం అవుతూండగా అందరూ తిరుగు ప్రయాణం అయ్యారు

నీ పెళ్ళికి పిలవడం మర్చిపోయేవు సరయూ! తమాషాగా అన్నాడు రామారావు సరయు సిగ్గుపడింది

అందరూ మరోసారి ఆశ్రమాన్ని చూసి రమణకి, వార్డెన్‌కీ కృతజ్ఞతలు చెప్పి బయల్దేరారు

గేటుదాకావెళ్ళిన వనజ–

సరూ! ఓసారిలారా! అంది గంభీరంగా సరయు రాగానే చెవిలో రహస్యంగా–

జాగ్రత్త! అంది

ఏమిటే జాగ్రత్త? అమాయకంగా చూసింది సరయు

అదే అదీ ఎలా చెప్పనే! అబ్బ! ఒట్టి అడవిగొడ్డువి! చెప్పిన విషయం ఓ పట్టాన అర్థంకాదు! పెళ్ళయ్యేదాకా ఆ రమణగారి కౌగిట్లోకి ఆమె మాట పూర్తి కాకుండానే–

చీ! అంది సరయు ఆమె చెంపలు మందారపూల్లా అయిపోయాయి

ఇదిగో! రాక్షసిలా పక్కన నేన్నేనూ! మీకా బెంగ అక్కర్లేదు! ఇంకనించి పెళ్ళయ్యేదాకా సరయు మంచం నా మంచం పక్కనే! అంతా విన్న వార్డెన్ తమాషాగా తనూ రహస్యంగానే అంది

బిత్తరపోయారు స్నేహితురాళ్ళిద్దరూ

ఏవిఁటర్రా ఆ గుసగుసలు? అంది బామ్మగారు నవ్వుతూనే వార్డెన్ నవ్వింది సరయు వనజ మాత్రం–

అబ్బే! ఏంలేదు కంగారుగా అనేశారు

"సరి! సరి! ఇంక బయల్దేరండి పొద్దు పోతోంది." హెచ్చరించాడు రామారావు

బిలబిల్లాడుతూ అంతా కార్లు ఎక్కారు ఒకదాని తర్వాత ఒకటి వరసగా నాలుగు కార్లూ కదిలాయి

సంధ్యవేళ చల్లనిగాలి ముంగురుల్ని చెరిపేస్తుంటే అలవోగ్గా వాటిని పైకి తీసుకుంటూ ఇంకా అలాగే వరండాలోని స్తంభాన్నానుకుని వెళ్ళిపోతున్న వారికి చెయ్యి వూపుతున్న సరయుకేసి తన్మయత్వంగా చూస్తూ లోకం మరిచాడు రమణ

వాళ్ళ పరిస్థితి చూసిన వార్డెన్ మెల్లిగా పక్కకి తప్పుకుంది

రెండు క్షణాల తర్వాత రమణ మెల్లగా ఆమె దగ్గరగా వెళ్ళి–

ఏమిటీ మీ ఫ్రెండ్ అంత రహస్యంగా చెప్పింది? అన్నాడు ఆమెకి మాత్రం వినిపించేలా గుసగుసగా తుళ్ళి పడిన సరయు అతనువేసిన ప్రశ్నకి మరింత తెల్లబోయి–

'ఏ ఏంలేదు' అంది తడబడుతూ

ఆమె చెంపలు మరీ కందిపోయాయి

కళ్ళు భారంగా వాలిపోయాయి

నాకు తెలుసు నేను చెప్పనా?' ఓరగా చూస్తూ అన్నాడు రమణ

ఏమిటి? చివ్వున తలెత్తి చూసింది సరయు

ఓసారి అటుచూసి ఆమెని రెండు చేతులతోనూ చుట్టేసి ఆమె పెదవులమీద గట్టిగా తన పెదవులతో ముద్రవేసి–

ఇలాంటివన్నీ పెళ్ళయ్యాకే అన్నారు వనజ అవునా? చిలిపిగా అన్నాడు రమణ

సరయు ఒళ్ళంతా అదోలా పులకించి పోయింది మనసు తనువు కూడా చక్కిలిగిలిపెడుతున్నట్లు అయిపోయింది. అతని చేతుల్లోంచి తప్పించుకుని రెండు చేతుల్లోనూ కందిన మొహాన్ని దాచుకుని–

చీ! సిగ్గులేదు! అంటూ రివ్వున తనగదికేసి దూసుకుపోయింది

ఆమె వెళ్ళినవైపే ఆనందంగా చూస్తూ లోకాన్ని మరచిన రమణ తన్మయత్వంగా అలాగే నిల్చుండిపోయాడు

శిల కరిగింది! వారి కథంతా తెలిసిన వార్డెన్ తృప్తిగా నిట్టూర్చింది

(అయిపోయింది)

## గడుసులోకం

—బాబు







### అంకితం

స్నేహానికి నిర్వచనం అతను చెల్లమ్మా అంటూ నన్ను నోరారా పిల్చే వ్యక్తి

మెడికల్ ప్రొఫెషన్‌లో వున్నా డ్రగ్ ఎడిక్ట్‌వల్ల జరిగే పరిణామాలు తెలిసినా, మత్తు మందులకు ఆకర్షితుడై ఈ నవలలోని చిన్నాలాగే అతిచిన్నవయసులో నే నూరేళ్ళూ నిండిన, మా వారి ఏకైక ప్రాణస్నేహితుడు శ్రీ నర్రా జయరామ్‌గారికి.

—సువర్ణా కన్నన్

## వ్యక్తిగతం



సామాజిక న్యాయానిక త్రికరణ శుద్ధిగా కట్టుబడి ఉండటమే మతం అన్న ప్రగాఢ విశ్వాసంగల స్వామి రంగనాదానందకి 'ఇందిరాగాంధి అవార్డు లభించింది బారత జాతీయకాంగ్రెసు శత వార్షి కోత్సవ సందర్భంగా జాతీయ సమైక్యతకి, వివిధ మతాలు, వర్గాలు, జాతుల మధ్య సదవగాహనకి, సాన్నిహిత్యానికి విశేషమైన కృషి సలిపిన వారిని సత్కరించటానికి నెలకొల్పబడిన ఈ అవార్డుని అందుకుంటున్న మొట్టమొదటి వ్యక్తి ఈయన మొత్తం 101 పేర్లని ఈ అవార్డు కోసం పరిశీలించారు లక్ష రూపాయల నగదు, ఒక ప్రశంసా పత్రం ఈ అవార్డు ద్వారా లబిస్తాయి దీనిని శ్రీమతి ఇందిరాగాంధి ద్వితీయ వర్ధంతి సందర్భంగా అక్టోబరు 31న స్వామి రంగనాదానందకి ప్రదానమంత్రి రాజీవ్‌గాంధి అందజేస్తారు 78 సంవత్సరాల వయసుగల స్వామి రంగనాదానంద కేరళలోని ట్రిక్కూర్‌లో 1908 డిసెంబరు 15న జన్మించారు ఈయన తమ 10వ ఏటనే స్వామి శివానంద శిష్యరికం స్వీకరించారు తర్వాత ఆయన ద్వారానే 1933లో సన్యాసం పుచ్చుకున్నారు స్వామి వివేకానందుని అడుగు జాడలలో నడుస్తూ రామకృష్ణమఠంలో చేరి సంప సేవకి అంకిత మైనారు భారతీయ, పాశ్చాత్యతత్వ రీతులని విస్తృతంగా అధ్యయనం చేసివివిధ విషయాలపై అనేక గ్రంథాలని రాసారు దేశ విదేశాలలో ఆయనకి ఎంతో మంది శిష్యులు ఉన్నారు ప్రపంచంలో దాదాపు అన్ని ప్రాంతాలనీ పర్యటించిన ఆయన ప్రస్తుతం హైదరాబాదులో ఉంటున్నారు గతంలో ఈయనకి పద్మశ్రీ, పద్మ విభూషణ్‌వంటి బిరుదులు ఇచ్చినా ఆయన స్వామిని నాకెందుకీ బిరుదులని వాటిని నిరాకరించారు మానవునిలో దైవత్వాన్ని సంపాదింప చేసేదే మతం అనీ, ప్రపంచంలోని మతాలన్నీ మవులికంగా ఒకటేనన్న సత్యాన్ని గ్రహించినప్పుడే విభిన్న మతాలు, వాటిని అనుసరించేవారు చేరువ కాగల అవకాశం ఉంటుందని ఆయన నమ్ముతున్నారు □

# వారఫలం

**7-11-1986 శుక్రవారం మొదలు**
**13-11-1986 గురువారం వరకు**

★ **మేషం:** సులభంగా ఒకానొక వ్యవహారం సానుకూల మవుతుంది మంచివారి సాంగత్యం లభిస్తుంది వ్యవహారరీత్యా అనుకూల సమయం విద్యా విధానాన కొందరకు కొంత మేలు జరుగుతుంది నూతన వ్యాపారం లాభకరం 12, 13 తా లు యోగ్యప్రదాలు

★ **వృషభం.** ఇంట శుభం జరుగుటకు అవకాశ మున్నది అనవసరంగా ప్రయాసకు గురికాగలరు ఏది మంచియో, ఏది కాదో తెలిసికో లేక తికమక పడుతారు వస్తు సేకరణకు అవకాశ మున్నది, రాజకీయంగా మేలున్నది, గమనించాలి స్త్రీలకు వృత్తియందు పెంపు, ఉద్యోగమందు అనుకూలం వస్తు సేకరణకు అనుకూలం గమనించండి

★ **మిధునం :** ఈ వారం మీకు సర్వానుకూలం అనుకొన్న పనులు అనుకొన్నట్టు జరుగుట వారవిశేషం అప్పుల ఆదరణ కనిపిస్తుంది ధనాదాయమున్నది కృషి లోపం లేకపోతే రావలసిన డబ్బు ఉంటే రాగలదని గ్రహించాలి స్త్రీలకు వృత్తియందు అనుకూలం ముఖ్యులను సందర్శిస్తారు

★ **కర్కాటకం:** వ్యవహారం ఉంటే మీకే అనుకూలం ఇటీవల బాగా దెబ్బతినిన భూములు మీ నిరంతర కృషిచే బాగుపడుతాయి స్తోత్ర పాఠకులున్నారు, దూరంగా ఉంచితే మేలేగా! ఎవరికో యివ్వ వలసిన డబ్బును గూర్చిన వత్తిడి తాక నున్నది గ్రహించండి. స్త్రీలకు నూతన వ్యక్తులతో కొన్ని పనులు నెరవేరుతాయి

★ **సింహం.** దరిదాపుల్లో మేలు జరుగ గలదని. గ్రహింప గలవారం ఆదాయముంటుంది అనవసర ప్రస్తావనలకు పోవటం, వ్యవహారాల్లో ప్రవేశించటం జరుగుతుంది వృత్తి యందు వికాసం ఉంటుంది ఎంతో కాలంగా యత్నించుచున్న, వాహన లాభం చేకూరుతుంది స్త్రీలకు కొందరకు హోదా పెరిగే సన్నివేశాలుంటాయి,

★ **కన్య.** ఎంతో మంచివారం అంటే దనసంపత్తి, ఆరోగ్యం, అప్పులు వసూలగుటకు, పనులన్నీ సక్రమంగా జరిగి పోవుటకు అనుకూలం విశేషాదరణ గలవారం ఒకానొక విషయంలో ఎంతో కాలంగా ఉన్న పేచీ నివృత్తి యగుటకు అనుకూలం స్త్రీలకు ,యాత్రానుకూలం; శుభకార్యానుకూలం, ఆదాయానికి ఆస్కారమైన వారం

★ **తుల:** రాజకీయంగా కాలికి బలపం కట్టుకొని తిరిగే వారికి అనుకూలమే' చేసే ఉద్యోగమంద అంతో యింతో మేలు కనిపిస్తుంది పరుల చేతిలో చిక్కిన డబ్బు అందే అవకాశమున్నది వారమంతా శుభాశుభ మిశ్రమఫలం స్త్రీలకు: కొందరైనా శనిబాద రుచి చూస్తారు

★ **వృశ్చికం :** ఇంకా శుభఘడియలు రాలేదనిపిస్తుంది శనిగ్రహానుకూలత కనిపించలేదనిపిస్తుంది 'జాయింటు' వ్యాపారాన అనుకూలత లేదనిపిస్తుందీ వృత్తి యందు వికాసం కనిపించదు ఉద్యోగరీత్యా ఏవో బేదాబిప్రాయాలుంటాయి స్త్రీలకు ఆదాయం, సబామర్యాద వృత్తి యందు గౌరవం, పత్రికా గౌరవం, అదికవ్యయం

★ **ధనుస్సు** సజ్జన సాంగత్యం అబ్బుతుంది ఇదేమి? ఇంత అనుకూలంగా ఉన్నదీవారం! అనిపిస్తుంది శుభకార్యానుకూలత గలవారం! అధికవ్యయం చేయవలసిన పరిస్థితులూ ఉంటాయి తెలిసీ తెలియక ఒకానొక పొరపాటు చేసి, యిబ్బందుల పాలవుతారు 'అదీ వారఫలం' అని కూడ అనిపిస్తుంది స్త్రీలకు సుఖశాంతులు, స్వల్పంగా దనాదాయం

★ **మకరం.** ఉత్తమ ఫలదాయకవారం సర్వానుకూలం ఉత్తముల స్నేహం అబ్బుతుంది ఒకానొక వ్యవహారం సునాయాసంగా సానుకూలం కాగలదు అనుకోకుండా బంధు మిత్రులు యింటికి రానున్నారు దనలబ్ధి, గౌరవంలో పెంపు, ఉద్యోగంలో మేలు సమకూడుతుంది స్త్రీలకు : సర్వ విదాలా మేలే, గ్రహించండి

★ **కుంభం :** విద్యా పరిశ్రమ సరిగా సాగదు కళారంగాన చిక్కిన అవకాశాలు జారిపోతాయి ఆశించిన విదంగా పనులు సాగవు అప్రయోజకుల పరిచయం మానుకొండి శ్రేయోదాయకం గాదు స్త్రీలకు : వస్తు విక్రయమందు ఆశించిన లాభం రాదు ఉద్యోగంలో పెద్దగా లాభించే మార్గం లేదు

★ **మీనం** · ఎవరితో మాటాడినా యిబ్బందులే ఏ వ్యవహారంలో తలదూర్చినా తల దిమ్మెక్కి పోతుంది, ప్రకృతి సంక్షోభంతో చెడిన భూముల, యిండ్లను కొందరు శ్రద్ధతో సవరించుకోగలరు పదిమందిలో ప్రతిష్ఠకు ఆస్కారం గలవారం ఉద్రేకపూరిత సన్నివేశాలుంటాయి జాగ్రత్తగా సంచరించాలి స్త్రీలకు అనవసర గొడవలు, ఆదాయలోపం

—విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి

ఆంధ్రప్రదేశ్ ఎంతో వైవిధ్యం గల రాష్ట్రం – విభిన్న రీతుల సమ్మేళనాలు, రంగు రంగుల విచిత్రాలు – దేవాలయాలు, సముద్ర తీరాలు, విహార ప్రదేశాలు, చారిత్రాత్మక స్థలాలు, ఆరామాలు – ఎన్నో హిందూ బౌద్ధ, ముస్లిం, మతాల అపురూప సంగమం – ఈ ఆంధ్రప్రదేశ్.

వరంగల్లులోని రామప్ప దేవాలయం, కాకతీయ తోరణం, జంతుశాలలు, పక్షుల విడుదులు – పాకాల శ్రీశైలం, పులికాట్, కొల్లేరు సరస్సులు – అరకు లోయలు, హార్సిలీ కొండలు మొదలగు కొండలలోని విహార కేంద్రాలు. విశాఖ పట్టణంలోని బంగారు రంగులొలికే సముద్ర తీరాలు – ప్రపంచ ప్రఖ్యాతి చెందిన తిరుపతి, భద్రాచలం, శ్రీశైలం, సింహాచలం మొదలగు పుణ్యక్షేత్రాలు.



నాగార్జునసాగర్ – ప్రపంచంలో కెల్లా ఎత్తైయిన రాతికట్టడపు ఆనకట్ట – మానవ నిర్మిత జలాశయం మధ్యలో పడవ సౌకర్యం. నాగార్జున కొండ – త్రవ్వకాలలో బయల్పడిన చారిత్రక బౌద్ధ అవశేషాల ప్రదర్శనశాల.



ఆంధ్రప్రదేశ్ – కూచిపూడి నాట్యానికి పుట్టినిల్లు – రంగు రంగుల నిర్మల్ చిత్ర లేఖనాలు – కంటికింపైన కొండపల్లి బొమ్మలు, ప్రసిద్ధి చెందిన కలంకారీ వస్త్రాల అద్దకాలు – అమరావతి తోలు బొమ్మలు – సప్తవర్ణాల అందాలు.

రాష్ట్ర రాజధాని హైదరాబాద్ – ప్రాచీన సంస్కృతినీ, నవీన నాగరికతనూ చక్కగా మేళవించుకున్న నగరం – చార్మినార్ – హిందూ – అరబ్బీ వాస్తు శిల్ప నైపుణ్యానికి గీటురాయి. కేవలం ఒకే వ్యక్తిచే సమకూర్చబడ్డ సాలార్‌జంగ్ మ్యూజియంలోని చిత్రవిచిత్ర వస్తు సముదాయం – బిర్లా వేధశాల, ప్రాచీన గోల్కొండ కోట – కుతుబ్‌షాహీ రాజుల స్మృతి చిహ్నాలు, చలువరాతితో అత్యంత సుందరంగా రూపొందిచబడిన వేంకటేశ్వర దేవాలయం, రమణీయమైన జంతు ప్రదర్శనశాల మరెన్నో విహార యాత్రాస్థలాలు.



**ఆంధ్రప్రదేశ్‌ను విహరించండి!**
**మరపురాని మధురానుభూతిని పొందండి!!**



# ఆంధ్రప్రదేశ్ – వర్ణ వర్ణాల చిత్ర విచిత్రం
# మరపురాని మధురానుభవం

ఆంధ్రప్రదేశ్ పర్యాటక విభాగం
మొదటి అంతస్తు, గగన్ విహార్,
యం.జె.రోడ్డు, హైదరాబాద్ - 500 001.
టెలిఫోన్లు : 556493, 42835, 77192, 70087, 233384, 233385.



# పోస్టాఫీస్ కథ

## డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

గురువారం. పంచమి. చాల మంచిరోజు రాహుకాలం గడచింది. వర్జ్యం అదీ లేకుండా చూచి కథరాయడం ముగించాడు రమణమూర్తి.

కథంటూ రాయడం జీవితంలో అదే మొదటిసారి. అది సరిక్రొత్త ప్రేమకథ. చదువుతుంటేనే ఒడలు పులకరించి పోతోంది. తృప్తిగాలేచి చొక్కా, పంట్లాము వేసుకొని, లుంగిని కుర్చీమీద పడేసి రిజిష్టర్డ్ పోస్టు చేయడానికి పోస్టాఫీస్‌కు బయలుదేరాడు రమణమూర్తి.

అది హెడ్ పోస్టాఫీస్. ఫిష్ మార్కెట్ యార్డ్‌లా ఉంది. రద్దీ తిరుమల క్యూను మరిపిస్తోంది.

పోస్టేజీ ఎంతో తూకం వేసుకోడానికి మూర్తి నిలబడ్డాడు. చేంతాడంతా వరుస ఉంది. కవుంటర్ గుమాస్తా క్రొత్త కాబోలు. తూకం వేయడానికి అరగంటా- లెక్కలు వేయడానికి గంటా తీసుకొంటున్నాడు.

జనాల్లో అసహనం పెట్రేగిపోతోంది. అయినా కిమ్మనకుండా ఉన్నారు. ఎందుకో రమణమూర్తికి అర్థం కాలేదు.

అటూ ఇటూ చూసాడు. ఎడమవైపు స్టాంపులమ్మే కవుంటర్‌కు ప్రక్కన ఒక అందాలరాశి కూర్చుని ఉంది. తెల్లని ఫుల్ వాయిల్ చీరలో అదేరంగు బ్లవుజుతో పాలరాతి శిల్పంలా గుభాళిస్తోంది. ఇన్నాళ్ళు ఈ శాల్తీ లేదు. బహుశా క్రొత్తగా డ్యూటీలో చేరిందేమో!

అందరు కళ్ళార్పకుండా ఆమెనే చూస్తున్నారు.

"ఏమయ్యా! ఏ ముందక్కడ. నాలుగూ పది. అర్థమయిందా"- అన్నాడు. తూకం గుమాస్తా రమణమూర్తిని.

అందరూ నవ్వుకొంటున్నారు. ఆమైతే ముసి ముసిగానే నవ్వుకొంటోంది. ఒళ్ళు మండి పోయింది రమణమూర్తికి.

"ఎక్కాలకు ఏడేళ్ళు తీసుకొంటుంటే ఏం చైనూ"- అన్నాడు.

"రికమెండేషన్ బాపతేమో. ఒంట్లో రానోళ్ళ్ని సీట్లో కూర్చొబెడితే గంటలేం ఖర్మ రోజులే అయిపోతాయ్"- ఎవరో గడుగ్గాయి అన్నాడు.

గుమాస్తా అంతెత్తున లేచాడు.

"ఏవరు, ఎవరా మాటన్నది అసలు నాసంగతి మీకు తెలుసా. అని రమణమూర్తి ఏమి పట్టనట్లు స్టాంపుల కవుంటర్ దగ్గరి కొచ్చి క్యూలో నిలబడి చేతిలో పదిరూపాయల నోటును పెట్టుకొని తెల్ల చీర శాల్తీని పరీక్షగా చూస్తున్నాడు

తూకం క్లర్కు ఇంకా ఊగిపోతున్నాడు. మైకం వస్తుందేమో!

స్టాంపులమ్మే చోట ఉన్న క్లర్కు ఒకటే విసుక్కొంటున్నాడు. చిల్లర లేదని గొడవ చేస్తున్నాడు. చీటికి మాటికి చిందులాడుతూ రెండు చేతులూ త్రిప్పుతున్నాడు. నవరసాలొలికించే నటన ప్రదర్శిస్తున్నాడు.

ఒకాయనకు మండి పోయింది. ఇంతెత్తున లేచి- "ఏంరా! చేతులు త్రిప్పుతున్నావ్. తిక్క రేగిందంటే టాపు లేపేస్తాను. పిచ్చి పిచ్చిగా వాగకు. ఏం ఆమాత్రం చిల్లరలేదా. పది కార్డులకు ఐదు రూపాయ లిస్తే చిల్లర లేదంటే ఎక్కడ చావాలి"? అన్నాడు.

"గంగలో" అన్నాడా క్లర్కు.

"చావడం కాదురా. చంపుతాను. ఇక్కడే ఇప్పుడే....." అన్నాడీయన.

"ఆ! నన్ను చంపుతారా! చంపండి చూద్దాం" క్లర్కు తైతక్కలాడాడు.

ఒకరు కథకళీ ఆడితే మరొకరు భరతనాట్యం!

ఒకరు పాప్ మ్యూజిక్ వినిపిస్తే మరొకరు డిస్కో సంగీతం!

మొత్తానికి రాద్ధాంతం జరగకుండా జనం అడ్డువచ్చారు.

ఆ మహాను భావుడు వెళ్ళిపోయినా ఈ క్లర్కుగాడు తిడుతూనే ఉన్నాడు. చేతులు త్రిప్పుతునే ఉన్నాడు. మూతి బిగిస్తూనే ఉన్నాడు.

రమణమూర్తి వంతు వచ్చింది.

నాలుగూ పది స్టాంపులు కావాలన్నాడు.

"నాలుగు పదులా" కసిరాడు క్లర్కు.

"నాలుగు రూపాయలా పది పైసలు" అన్నాడు రమణమూర్తి విసుగ్గా తెల్ల చీర శాల్తీని చూస్తూ.



చిల్లం లేచు' క్లర్కన్నాడు

ఎక్కడ చావను అసహనంగా అరిచాడు రమణమూర్తి

ఏటో అన్నాడు అప్పటికే మండిపడుతున్న ఆ క్లర్కు

తెల్లచీర శాస్త్రి కిసుక్కున నవ్వింది రమణమూర్తి ఉగ్రనరసింహుడై పోయాడు

ఏరా క్లర్కుగా! నీ భార్య పడి చచ్చిందే ఆ ఏటోనేనా? అన్నాడు

నోరుముయ్! నా భార్యను . నా భార్య నంటావా. అదెక్కడ చస్తే నాకేం ఎవడోనో లేచి పోయింది ఈ పాటికి చచ్చే ఉంటుంది అయినా నా పర్సనల్ విషయాలు ఎత్తుతావా! నిన్ను నిన్ను 'అంటూ క్లర్కు శివతాండవం చేసాడు

క్లర్కు గారి భార్య లేచిపోయిన సంగతి రమణమూర్తికి వాస్తవంగా తెలియదు "సారీ' అనబోతున్నా తోక త్రొక్కిన త్రాచులా క్లర్కు చేసిన నాట్యానికి పోస్టల్ గుర్తులు ముద్రించే సిరాబుడ్డి ఎగిరిపడి ముక్కలై పోయి తెల్ల చీర శాస్త్రి మీద పడి చక్కటి ఎంబ్రాయిడరి రంగుల్లో మాడ్రన్ ఆర్టులాగా రూపు దిద్దుకొంది కవర్లు, కార్డులు ఇంకు మయమై పోయాయి

తన కళ్ల ముందే తను కట్టుకొన్న చీర వర్ణ సంకరమై పోవడంతో ఎంతో సంకటంగా చూసిందా గరలు ఒక కొంటి కోణంగి ఈ లోగానే కిసుక్కున పుసుక్కున పక్కున నవ్వనే నవ్వాడు ఆమెకు నఖశిఖ పర్యంతరం మండి పోయింది

స్టాంపు క్లర్కుకు ఏమి కనిపించడం లేదు కదనరంగంలో విశృంఖల విహారం చేసే వాడిలా గుఃయ్ మంటున్నాడు గుర్రు మంటూనే గంతు లేస్తున్నాడు

ఆమె వైపు చూచి కోపంతో సారీ కూడ చెప్పక ఎక్కడ బడితే అక్కడ ఇంకు సీసాలు పెడతారా అంటూ గట్టిగా అనేసరికి యూ! అంటూ ఆమె బయంకరంగా కేక వేయడంతో పోస్టాఫీసు దద్దరిల్లి పోయింది క్లర్కుకు నోట మాట రాలేదు నిశ్శబ్దం తాండవించింది

ఈ లోగా వాటీజ్ దిస్ నాన్‌సెన్స్ అంటూ పోస్ట మాస్టర్ స్పీడుగా రావడము ఇంకులో జారడము, గ్లాసు పెంకులు గ్రుచ్చుకోవడము, అమ్మయ్యో అంటూ గావు కేకలు వేయడము- వరుసగా జరిగిపోయాయి

సార్ అంటున్నాడు స్టాంపు క్లర్కు

ఏమైందండి? అంది తెల్ల చీర శాస్త్రి

నా శ్రార్థం, నా పిండా కూడు, నా కర్మ అంటూ లేవలేక లేచి షర్టు ప్యాంటూ చూచు కొన్నారు

ఈస్ట్‌మన్ కలర్ సినిమాలా ఉంది చేతులు, మోచేతులు చూసుకున్నారు రక్తం వస్తోంది

దీనికంతా బాధ్యు లెవరు? అంటూ తీక్షణంగా అడిగారు తెల్ల చీర శాస్త్రిని ఆమె స్టాంపు క్లర్కును చూపెట్టింది స్టాంపు క్లర్కు

బిక్కమొగం వేసాడు అంత లోనే కోపంగా రమణమూర్తి వైపు చూచి ఇతడు' అన్నాడు

ఆ ముగ్గురు బయటికి రావడానికి ప్రయత్నించ డంతో రమణమూర్తి మెల్లగా తప్పించుకొని బయట పడ్డాడు

పట్టుకోండి పట్టుకోండి', అంటూ స్టాంపు క్లర్కు వెంబడించాడు

రమణమూర్తి పరుగో పరుగు కవరు జారిపడ్డా చూచుకోలేదు

ఓ గంట గడిచాక

రమణమూర్తి రొగరుస్తూ చెట్టు నీడన నిలబడి ఉంటే ఒక గాడిద కాగితాలను తింటూ కనిపించింది

ఆ కాగితాలు, ఆ అక్షరాలు తనవి మాదిరే ఉంటే దాని మూతిలోంచి గట్టిగా లాగి చూచాడు

అది తను రాసిన కథే! అయ్యో ఏడుపొచ్చింది తన ఆహారం పోయిందన్న కోపంతో గాడిద పెద్దగా ఓండ్ర పెట్టడంతో పులి గాండ్రించినట్లు భయపడి పరుగెత్తబోయి. ఒక పోలీసుకు డాష్ ఇచ్చాడు

కంగారు కంగారుగా 'కంగారు జంతువులా గెంతుతున్న రమణమూర్తిని చూడడంతోనే 'అమ్మయ్య! ఇవాల్టికి కేసు దొరికింది' అనుకొంటూ రేయ్ అని పోలీసు అనడంతోనే స్పృహ తప్పి పోయింది రమణమూర్తికి! □



# హైదరాబాదు నోట్‌బుక్

## తెలుగు భవనాలకు శంకుస్థాపన -

తెలుగు భాషా సాహిత్య కళా సంస్కృతుల అభివృద్ధికి తమ ప్రభుత్వం నిర్విరామ కృషితో అంకితమై వుందని ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు అక్టోబర్ 15 ఉదయం తెలుగు బాషా సమితి ఆవరణలో తెలుగు భవన సోమూనిక (కాంప్లెక్స్ అనడానికి బాసుడు స్తోమమని వాడాడు) శంకుస్థాపన చేస్తూ ఉద్ఘాటించారు ఈ సందర్భంలో తెలుగు బాషా సమితి లాంచనంగా తెలుగు విశ్వవిద్యాలయంలో లీనమయింది తెలుగు బాషా సమితి అద్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి కార్యదర్శి డాక్టర్ మోటూరి సత్యనారాయణ లాంచనంగా సమితిని తెలుగు విశ్వవిద్యాలయం కులాధిపతి అయిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావుకు అందజేశారు ఈ సందర్భంలో డాక్టర్ గోపాల్‌రెడ్డి ప్రసంగిస్తూ కొద్ది పాటి వనరులతో, కొద్దిపాటి సిబ్బందితో సమితి 40 సంవత్సరాలు సమర్థంగా పని చేసిందని సమితి తెలుగు విశ్వవిద్యాలయంలో లీనం కావడం ఆశ్రమవాసిని అయిన శకుంతల దుష్యంతుని అంతఃపురాన్ని ప్రవేశించినట్లు ఉందని దానిని విశ్వవిద్యాలయ కులాదిపతి అయిన ముఖ్యమంత్రి శ్రద్ధగా చూసుకోవాలని చలోక్తి విసిరారు తమ సంస్థ అభిశప్త కాదని కలకలలాడుతున్న సిమంతినివంటిదని అన్నారు ముఖ్యమంత్రి శ్రీ రామారావు దినికి సమాదానం చెబుతూ, వారు కన్యను 64 ఏళ్ల వరునికి ఇస్తున్నారని, ఈ ప్రౌఢను వరుడెలా నిబాయించగలడో చెప్పలేనని అనగా, శ్రోతలలో నవ్వు వెలరేగింది ఏదప డాక్టర్ గోపాల్‌రెడ్డి, డాక్టర్ మోటూరి సత్యనారాయణ సమితి చరిత్రను, కృషిని విశదీకరించి తాము వెలుపల వున్నా తెలుగు విశ్వవిద్యాలయంతో సహకరిస్తూనే వుంటామని అన్నారు ఈ సమావేశానికి అద్యక్షత వహించిన విద్యాశాఖామంత్రి శ్రీ ముద్దుకృష్ణమనాయుడు ప్రసంగిస్తూ, తెలుగు మాట్లాడే వారు దేశంలో ఎనిమిది కోట్లు మందని, హిందీ భాషా ప్రజల తర్వాత బారతదేశంలో తెలుగుదే ద్వితీయ స్థానమని, కనుక తెలుగును ఉత్తర బారతంలో త్రిబాషా సూత్రం ప్రకారం బోధించవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని పదే పదే కోరుతున్నామని అన్నారు తెలుగు కన్నడ లిపుల సాదృశ్య సన్నిహిత్వాలను బట్టి ఉభయ భాషలకు సమాన లిపిని రూపొందించడానికి ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ హెగ్డేతో చర్చలు జరుపాలని విద్యామంత్రి కోరారు తెలుగు విశ్వవిద్యాలయానికి ఇంతవరకు ప్రభుత్వం ఏడు కోట్ల రూపాయలు కేటాయించిందని అన్నారు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డాక్టర్ తూమాటి దొణప్ప ప్రారంభంలో స్వాగతం చెబుతూ తెలుగు బాషా సమితి తలపెట్టిన కార్యక్రమాన్ని విశ్వవిద్యాలయం కొనసాగిస్తుందని, సమితి 61 లక్షల రూపాయల విలువ చేసే ఆస్తిని తెలుగు విశ్వవిద్యాలయానికి బదిలీ చేసిందని అంటూ దన్యవాదాలు సమర్పించారు ఈ సందర్భంలో తెలుగు బాషా సమితి నిర్వాహకులను శాలువలతోను, సిబ్బందిని జ్ఞాపికలతోను సత్కరించారు తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు శ్రీ ప్రసాదరావు వందన సమర్పణతో ఉత్సవం సమాప్తమయింది ఈ సందర్భంలో ఒక సంగతి జ్ఞాపకపరచడం అవసరం విద్యామంత్రి శ్రీ ముద్దుకృష్ణమనాయుడు సూచించిన తెలుగు కన్నడ లిపుల ఏకీకరణ ప్రయత్నం ఇది వరకు 60 వ దశకంలోను 70 వ దశకంలోను రెండు సార్లు జరిగింది మొదటి దానిని రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేసింది, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ అద్యక్షత వహించారు శ్రీయుతులు వవ్వూరు రామాచార్యులు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, మద్దాలి రాఘవరామచంద్రరావు మున్నగు అనదికారులు అదికారులు పాల్గొన్నారు నేను మన లిపి పుట్టు పూర్వాలు అనే గ్రంథం రచించినందున లిపి శాస్త్రజ్ఞుని హోదాలో ఆహ్వానింపబడ్డాను రెండవ సమావేశం తెలుగు ఎకాడెమీ అద్వర్యాన జరిగింది అప్పుడు శ్రీ ఎ వి నరసింహారావు విద్యామంత్రి ప్రదాన విషయం లిపి సంస్కరణ దానిలో బాగంగా ఏర్పడిన తెలుగు – కన్నడ లిపి ఏకీకరణ ఉపసంఘానికి ప్రొఫెసర్ సుబ్బరామప్ప అద్యక్షులు

నేను కార్యదర్శిని దాదాపు 40 మంది తమ అభిప్రాయాలు ప్రకటించారు తెలుగు లిపి సౌందర్యానికి భంగకరం కాని విధంగా సంస్కరణ జరగాలని నేను నివేదిక అందజేశాను సర్వసభ్య సమావేశంలోను ఈ విధంగానే తీర్మానించారు ఆ సదస్సుల వివరాలు విద్యాశాఖలోను, తెలుగు అకాడెమీ ఫైళ్లలోను వుంటాయి వాటిని విద్యామంత్రి ఒక మారు పరికించి ఆ సమస్యల చర్చే పునరుక్తం కాకుండా చూడాలని కోరుతున్నాను ఇంతకూ లిపితో బాషతో సమైక్యం రాదని తెలిపోయింది రెండు వేల సంవత్సరాలుగా వివిధ పరిణామాలు పొందుతూ మన జీవితంలో స్థిరమైన ... మార్పుకే ఇంటి మనం ఎనం కన్నడులూ అంతే యూరప్ అంతా దాదాపు ఒకే లిపి సమైక్యం విరాజిల్లుతున్నదా? మధ్య ప్రాచ్యంలో అరబ్బు లిపి సమైక్యం సాదించిందా? ఏకీకరణ కన్నా కంప్యూటర్ యుగం గనుక తెలుగు లిపిలో త్వరితత్వం, స్థలం పొదుపు ఎలా వస్తాయనే దృష్టితో ఇప్పటి రమ్యత చెడకుండా ప్రయత్నిస్తే మంచిది ఏకీకరణ అనగానే, అప్పటి సభల్లో లాగే మాది కంపోజింగుకు సులభం, మాదే అవలంబించండి అని కన్నడులు అనడం మా లిపి అందమైనది, మా జనసంఖ్య హెచ్చు, ప్రజాస్వామ్యమంటే మెజారిటీ రూలు గదా, మా లిపే మీరు అవలంబించండని తెలుగు వారనడం – ఇలా ఎటూ తేలదు ఉత్తర బారతంలో పంజాబీలు, బెంగాలీలు హిందీ లిపిని స్వీకరించారా? వారి బాషలను హిందీ లిపిలో చక్కగా వ్రాయవచ్చు గదా! ఉహూఁ! మనస్సు ఒప్పదు లిపి బాష లాగే సెంటిమెంటల్, నిర్బంధంగా ఎవరూ మార్పునకు ఒప్పుకోరు అయితే, విచిత్రమేమిటంటే మార్పు ప్రతి శతాబ్దంలోను జరుగుతూనే వుంది లిపిలో రెండు వేల ఏళ్ల నాటి బ్రాహ్మి లిపి నేటి తెలుగు లిపిగా మారలా? అప్పటి కాకి కాళ్ల లాగే వుందా? అంటే, క్రమ పరిమాణాన్ని ప్రజ గుర్తించదు, ఒప్పుకుంటుంది హఠాత్పరివర్తనమంటే, వెనుకాడుతుంది జనం ప్రస్తుతం కావలసింది సాంకేతికమైన సౌలభ్యం ప్రపంచ లిపులు ముఖ్యంగా రోమన్ లిపి వేగంలోను, పొదుపులోను ముందుకు పోతుంటే మన మింకా చేతితో అక్షరాలు పేర్చడంలోనే వున్నాము కలిగే సాంకేతిక సౌకర్యాలు జనబాహుళ్యానికి అంది, ముద్రణ ప్రచురణలు చాల చౌక కావాలి

**ఉపశ్రుతి :–**

తెలుగు విశ్వవిద్యాలయ భవనస్తోమం శంకుస్థాపనోత్సవం జరుగుతున్నది నా పక్కన వున్న శ్రోత ఏం సార్, ముఖ్యమంత్రి ఆరు కోట్లు ఆంధ్ర ప్రజలు అని అంటారు విద్యామంత్రేమో ఎనిమిది కోట్ల తెలుగువారు అని అంటున్నారే ఏది సరైన సంఖ్య? అనడిగారు అదేం సమస్యండీ ఆరు కోట్లు రాష్ట్రంలో వున్నారు రెండు కోట్లు రాష్ట్రం వెలుపల వున్నారు – అన్నారు ఉస్మానియా విశ్వవిద్యాలయం థియేటర్ ఆర్ట్స్ శాఖ ఆచార్యులు డాక్టర్ రాజారాం మా కర్నాటక తమిళనాడు రాష్ట్రాల వోటర్ల జాబితాలలో తెలుగు పేర్లే కనిపించవేమండీ? – అన్నారు ఆ శ్రోత

– తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd,*
*by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,*
*Editor S Radhakrishna, Phones - Business 61247, 61248, Editorial 75667*



# ఎందుకూ పనికిరాని జలుబు ఇంటి పనులన్నింటికీ విఘ్నం కల్గించాలా?



జలుబు మహా చిరాకు పెట్టేస్తుంది.
దాని ముందు మీరు నిస్పృహాయులై పోతారు.
ముక్కు కారడం, తలనొప్పి, జ్వరం వచ్చినట్లు వుండడం ఒళ్లు నొప్పులు ఇవన్నీ చాలవన్నట్లు మధ్య మధ్యలో తుమ్ముల పరంపర
అన్నిటికంటే చిరాకు కల్గించేదేమిటంటే ఇంటి పని ఎక్కడిదక్కడ అలాగే వుండిపోతుంది.
కాని, ఈ బాధల నుండి తప్పించుకోడానికి మార్గం వుంది ఒకటి. అదే కోల్డరిన్‌లో పూర్తి నమ్మకం.
జలుబు బాధలను తొలగించడానికి ప్రత్యేక ఫార్ములా కల్గినది కోల్డరిన్. ఇది మూడు విధాలుగా పనిచేస్తుంది.
కారే ముక్కును శుభ్రం చేస్తుంది
తలనొప్పిని తగ్గిస్తుంది
జలుబుతోపాటు వచ్చే జ్వరాన్ని తగ్గించడానికి సహాయం చేస్తుంది.
ఈమారు జలుబు మీపై దెబ్బ తీసినపుడు కోల్డరిన్‌తో మీరూ దానిపై ఎదురుదెబ్బ తీయండి.
ఎందుకూ పనికి రాని జలుబును మర్చిపోండి. చురుగ్గా పని చేసుకోండి.




## కోల్డరిన్

జలుబు-నివారక టాబ్లెట్

ప్యాకెట్‌పైన సూచించినట్లు వాడండి.

CLARION/B/B/25/244 TEL

# మిసెస్.వనజ ..*.. మంత్రవాది మహేశ్వర్

పెళ్ళి చూపుల కార్యక్రమం జరుగుతోంది.......

బి. ఎ. చదివిన వనజ పెళ్ళివారి ముందు తలవంచుకుని కూర్చొలేదు. చాలా బాగా కలిసిపోయి మాట్లాడేస్తోంది. అది పెళ్ళికొడుకు తల్లితండ్రులకు అదోలా అనిపిస్తోంది. క్రొత్త లేకుండా వనజ మాట్లాడేయటం అదీ అమ్మాయి మీద సదభిప్రాయం ఏర్పరచుకోలేక పోతోంది పెళ్ళికొడుకు తల్లి.... కులం గోత్రం అందం చందం లాంటివి తాము కోరుకున్న విధంగా వున్నాయని చూడడానికి వచ్చారు. అదీ కాకుండా పెళ్ళికూతురు తండ్రి రఘురామయ్య గారు తమ కుటుంబానికి ఎంతో కావల్సిన వారు. చక్కగా వాళ్ళది పెద్ద కుటుంబం..... నాలుగురాడపిల్లలు, ముగ్గురు మగపిల్లలు, ఇల్లు ఎప్పుడూ కళకళలాడు తూంటుంది. వనజ ముఖంలో కూడా లక్ష్మిదేవి కళ ఉట్టి పడుతోంది అయితే ఆ అమ్మాయి మాట తీరే నచ్చుటం లేదు కాబోయే అత్తగారైన అనసూయమ్మ గారికి

'భక్తి పాటలేమైనా వచ్చా' అనసూయమ్మ పాట పాడి వినిపించింది వనజ.

పాడిన తరువాత పావుగంటదాకా ఆ భక్తి పారవశ్యంలో నే పడిపోయింది అనసూయమ్మ.

ఏమమ్మా ఉద్యోగం చేయాలనుకుంటున్నావా బి ఎ దాకా చదివావుకనుక అడుగుతున్నాను."

"మీ ఇష్టం – డబ్బు సర్దుకోవడం ఇబ్బందైనట్లయితే, మీరు చెబితే చేయడానికి సిద్ధంగావున్నాను".

"అదేమిటమ్మా... ఆడపిల్లవి బయటికి వెళ్ళి మగాళ్ళతో పని చేయమని చెబుతామా".

తెల్లవారు ఝామునే లేచి చన్నీళ్ళు స్నానం చేసి, మడిబట్టలు కట్టుకుని.... పూజలు.... అవీ అంటూ ఏవేవో చెప్పుకుంటూ పోయింది అనసూయమ్మ ఆ తరువాత.

'అమ్మాయి ఉద్దేశ్యం చూస్తే ఒక ప్రక్క పెద్దలపట్ల గౌరవం కనిపిస్తోంది – అలాగని తన వ్యక్తిత్వం కనబడుతోంది. రేపు పెళ్ళయ్యాక ఆ వ్యక్తిత్వం మరికాస్త పెరిగిపోయి ఈ గౌరవం పోదు కదా" – అనుకుంది.

"ఏ విషయమో వెళ్ళి వ్రాస్తాం" అంటూ అంతా లేచారు.

వాళ్ళు వెళ్ళిన దగ్గర్నుంచీ ఉత్తరం గురించి ఎదుర్చుచూస్తునే వున్నారు రఘురామయ్య గారు.... ఆడపిల్లల తండ్రి ఆరాటం అలాగే వుంటుంది.

ఆ ఆరాటంతోటే భార్యతో అన్నారు – "ఏమిటే వాళ్ళింకా ఏ విషయమో వ్రాయలేదు. సంబంధం నచ్చక పోవడమంటావా కొంపదీసి".

"ఏమోనండి. నాకూ అదే అర్థంకావటం లేదు".

"ఏమిటి నాన్నా. ఇప్పుడు ఏం కొంపలంటుకు పోయాయని. వాళ్ళకి ఇష్టం లేనంత మాత్రాన నాకు పెళ్ళి జరుగకుండా పోతుందా".

"ఏమిటమ్మా ఆ మాటలు.... ఆడపిల్లవి అంత అహంకారం వుండకూడదు".

"నాది అహంకారంగానే కనబడుతుంది కానీ వాళ్ళు పాతికవేలు కట్నం అడగడం మీకు ఆశగా కనిపించటం లేదు".

"తప్పదమ్మా. ఆడపిల్లను మరో ఇంటికి పంపించటానికి –"

"ఏమిటి నాన్నా – వాళ్ళింటికి చాకిరి చేయడానికి వెడుతూ వాళ్ళకి ముట్టచెప్పడం".



బాంబినో ఒక అద్భుతమైన వెర్మిసెల్లిని. పరిశుభ్రమైన పద్ధతిలో అధునాతన ఇటాలియన్ యంత్రములతో తయారు చేయబడినది. మిక్కిలి ప్రొటీన్లు కలిగి యుండి క్రొవ్వు పదార్థములు లేకుండుటయే బాంబినో విశిష్టత. వండినప్పుడు కాని, తరువాత కాని ముద్దగా కాకపోవుటమే బాంబినో ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో ఎన్నో రకములైన, నోరూరించే వంటకాలు, ఫలహారాలు తయారు చేయవచ్చును. ఇంకా బాంబినోతో ఎంతో పొదుపు కూడా. నేడే వాడి చూడండి. మీకేతెలుస్తుంది.



బాంబినో ఉప్మా :–

బాంబినోను నేతిలో వేయించి ప్రక్కన పెట్టుకోండి. బాణిలిలో 2 చంచాల నూనె వేసి కాచండి. దానిలో ఆవాలు, కరివేపాకు, పచ్చిమిర్చి, ఎండుమిర్చి వేసి అరనిమిషం వేయించండి. తర్వాత ఉల్లిపాయ ముక్కలు వేసి ముదరరంగు వచ్చేంత వరకు వేయించండి. తర్వాత వేడినీళ్ళు పోసి, బాంబినోను, ఉప్పును కలపండి. బాంబినో ఉడికేంత వరకు కలిపి మూత పెట్టండి. తర్వాత రుచికి నిమ్మకాయ రసం, క్రొత్తిమీరి కలిపి వేడి వేడిగా తీసుకోండి.




**ఉచితం**

బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం, ప్రతీ బాంబినో డీలరు వద్ద.






**వెర్మిసెల్లిని**




IS:1485




తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి!

ated/85-1

# ఇ·వేమన·పద్యాలు




సకల విద్యలందు సంపన్నులైయున్న
యట్టివారు చూడ నెపుడు చౌక
పెరటిచెట్టు మందు పరికింప మెచ్చరు
విశ్వదాభిరామ వినురవేమ

అలా అనకమ్మా– మంచి సంప్రదాయం అదీ వున్న కుటుంబం

'కావచ్చు నాన్నా కాలానుగుణంగా మనుషుల్లో మార్పురావాలి నేను మాట్లాడుతూ అవిడ్ని పరిక్షించాను నేను ఏదో ఎదిరిస్తున్నాను అన్న ధోరణిలో చూస్తోంది ఇక పెళ్ళి కొడుకు వాళ్ళెంత చెబితే అంత అన్నట్లు ప్రవర్తిస్తున్నాడు"

క్రొత్త కదమ్మా

మీరు అలాగే సమర్ధించండి నాన్నా నిన్ననే నేను ఉత్తరం వ్రాశానులేండి అతనికి"

'ఏమిటమ్మా నువ్వు వ్రాయడ మేమిటమ్మా

ఏం నాన్నా తప్పేముంది నా అభిప్రాయం

## మిస్ వనజ

వ్రాశాను దాంతో ఏకీభవించేలాగుంటే జవాబు వ్రాయమన్నాను'

'వాళ్ళు నీ గురించి చెడ్డగా అనుకోరు"

'ఒక వేళ నేను ఉత్తరం వ్రాసినందుకే వాళ్ళు చెడ్డగా అనుకునేంత సంస్కారులైతే నేనా పెళ్ళి చేసుకోను

'చేసుకోకుండా ఎలా బ్రతుకుతావు తండ్రికి కోపం వచ్చింది

ఉద్యోగం చేసుకుని బ్రతుకుతాను'

* * * * *

ఆ రోజే చలపతికి కవరొచ్చింది –

చలపతిగారికి

నమస్తే,

పెద్ద లేర్పాటు చేసిన పెళ్ళి చూపులయ్యాయి వాళ్ళ ఆలోచనలు, అభిప్రాయాలు వాళ్ళు వ్యక్తపరచారు. నా అభిప్రాయం చెప్పడానికి ఆ రోజున అవకాశం కలగలేదు అందుకే వ్రాస్తున్నాను

ఉద్యోగం మీరు అవసరం అనుకుంటే చేయడానికి నాకేం అభ్యంతరం లేదు –

తెల్లవారుఝామున లేవడం మడి, ఆచారం –కూడా నాకేం అభ్యంతరంలేదు–

ఉమ్మడి కుటుంబమైనా అడ్డు చెప్పను–

మీవాళ్ళధోరణి చూస్తే పరిమిత కుటుంబానికి అడ్డుచెప్పేలా కనిపిస్తున్నారు పెద్ద కుటుంబం అయితే ఇల్లు కళకళలాడుతుంది అన్నారు నాకు అది నచ్చదు అప్పుడెదురయ్యే సమస్యలు నాకు తెలుసు వాటిని మనమెదుర్కో వలసి వుంటుంది మన మెదుర్కో వలసిన సమస్యల గురించి మనమే ఆలోచించుకోవాలి. ఒక్కరి కంటే ఎక్కువ సంతానం నాకిష్టం లేదు మీరు అందుకు ఒప్పుకుంటే వారం రోజుల్లో మీ నుంచి అంగీకారం తెలపండి. లేకపోతే ఇష్టం లేనట్లే అని నేను భావిస్తాను– ఇలా ధైర్యం చేసి నేను వ్రాస్తున్నందుకు మరోలా భావించ రనుకుంటున్నాను

ఇట్లు
వనజ

* * * * *

వారం – పది రోజులు దాటిపోయింది

ఏ ఉత్తరం రాలేదు

తరువాత ఎప్పుడో ఎవరి ద్వారానో తెలిసింది వాళ్ళీమధ్యే మరో సంబంధం చూసుకుని వెళ్ళారని

రఘురామయ్య గారికి రెండు షాక్ తగిలే వార్తలు

ఒకటి తన రిటైర్మెంట్

రెండు అమ్మాయికి కుదిరి పోతుందనుకున్న పెళ్ళి కుదరక పోవడం

* * * * *

వనజ ఎంతో ఉత్సాహంగా వుంది ఆ రోజు – ఉదయం వచ్చిన పోస్టుకు

'ఏమిటమ్మా ఆ కవరు' నీరసంగా అడిగారు రఘురామయ్య

"బ్యాంక్ అప్పాయింట్ మెంట్ ఆర్డరు మన ఊర్లోనే రీజనల్ ఆఫీసులో పోస్టింగిచ్చారు. రేపే జాయినవుతాను" అంది

మరో ఇంటి బాధ్యతలు చూడాల్సిన వనజకు తన ఇంటి భాధ్యతలే అప్పజెప్ప బోతున్నందుకు బాధని పెంచింది రఘురామయ్య గారికి

ఆ కళ్ళజోడు వెనుక మెరిసిన కన్నీటి పొరను గుర్తించినా గుర్తించనట్లు నటించేసింది మిస్ వనజ □

# పాపాయికి తినిపించే ప్రతి చెంచాలో తల్లి ప్రేమతోపాటూ మా నాణ్యతనూ రంగరించి ఇస్తున్నాం

మేలురకం పాత్రలు
నాణ్యమైన సేలం
స్టీలు రేకుతో
తయారైనవి

సేలం స్టీల్‌లో మేము కంటికి కనిపించే దానికన్నా మరెంతో చెంచాలో ఉందని విశ్వసించేవాళ్ళం. అందుకే మేం ఎంచుకునేవన్నీ-అది సాంకేతిక విజ్ఞానం అయినాసరే, ముడిపదార్థమైనా సరే-ఉన్నత ప్రమాణాల్లో ఉండాలని కోరి, ప్రయాసపడి, ప్రపంచంలోనే ఉత్కృష్టమైనది ఎంచుకుంటాం. అలాగే తయారీలోకూడా అడుగడుగునా ప్రతి చిన్న విషయాన్నీ ఎంతో శ్రద్ధతో పరిశీలిస్తాం. నిరంతరం అత్యున్నతమైన నాణ్యతగల వస్తువుల ఉత్పత్తే మా ధ్యేయం

మా దృష్టిలో చెంచా అంటే కేవలం చెంచా మాత్రమేకాదు. మా సంస్థతత్త్వానికి, అభిరుచికీ ప్రతీక. మాకు మీపైఉన్న శ్రద్ధాసక్తులకు ఋజువు-అమ్మ ప్రేమలాగా.



**సేలం స్టీల్ కర్మాగారం**
సేలం-636 013, తమిళనాడు
స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్
భారత ప్రభుత్వ సంస్థ

## సేలం స్టెయిన్‌లెస్.

## దీనినే కోరుకోండి. ఎందుకంటే దీనికి మించినది దొరకటం అసాధ్యం.

Sista's - SSP.557.86 TE C


यूरिया UREA
उज्ज्वला




RCF

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

7-13, November, '86